తెలంగాణ

# తెలుగు సాహిత్య చరిత్ర

డా॥ ముదిగంటి సుజాతారెడ్డి





తెలంగాణ సారస్వత పరిషత్తు
హైదరాబాద్

తెలంగాణ

# తెలుగు సాహిత్య చరిత్ర

ప్రధాన సంపాదకులు

జ్ఞానపీఠ పురస్కార గ్రహీత, పద్మభూషణ్

**డా.సి.నారాయణ రెడ్డి**

అధ్యక్షులు. తెలంగాణ సారస్వత పరిషత్తు

సంపాదకులు

**డా.జె.చెన్నయ్య**

ప్రధాన కార్యదర్శి, తెలంగాణ సారస్వత పరిషత్తు

గ్రంథకర్త

**డా. ముదిగంటి సుజాతారెడ్డి**



**తెలంగాణ సారస్వత పరిషత్తు**

తిలక్ రోడ్, హైదరాబాద్ - 500 001

ఫోన్‌నం. 040-2475 3724

# TELANGANA
# TELUGU SAHITYA CHARITRA

*Written by*

**Dr.Mudiganti Sujatha Reddy**

© Telangana Saraswatha Parishath

ప్రథమ ముద్రణ : మార్చి, 2015
ద్వితీయ ముద్రణ : అక్టోబర్ 2015
తృతీయ ముద్రణ :డిసెంబర్ 2015

పుటల సంఖ్య : 248

ప్రతులు : 1000

మూల్యం : రూ. 150/-

ప్రతులకు :

**తెలంగాణ సారస్వత పరిషత్తు**
తిలక్‌రోడ్, హైదరాబాద్ - 500 001
ఫోన్ + 01-40-24753724

డిటిపి :

**ఎవిఎమ్ గ్రాఫిక్స్,**
సత్యానగర్, హైదరాబాద్
ఫోన్ : 9440096321

ముద్రణ :

**సాయి లిఖిత ప్రింటర్స్**
ఖైరతాబాద్, హైదరాబాద్
ఫోన్ : 040-65 545 979

జ్ఞానపీఠ అవార్డు గ్రహీత
**డాక్టర్ సి. నారాయణరెడ్డి** ఎక్స్ ఎం.పి.
ఎం.ఏ., పిహెచ్.డి., డి.లిట్.
అధ్యక్షులు
**తెలంగాణ సారస్వత పరిషత్తు**
తిలక్ రోడ్,
హైదరాబాదు-500001.
ఫోన్ : (ఆ) 24753724



*Jnanpith Awardee*
Dr. C. Narayana Reddy Ex. M.P.
M.A., Ph.D., D.Litt.
PRESIDENT
Telangna Saraswatha Parishath
Tilak Road,
Hyderabad - 500 001.
Phone : (Off.) 24753724

# అవతారిక

**తె**లంగాణ ప్రజల చిరకాల స్వప్నం సాకారమై 2014 జూన్ 2వ తేదీన తెలంగాణ ప్రత్యేక రాష్ట్రంగా ఆవిర్భవించింది. రాష్ట్రంలోని అన్ని వర్గాల ప్రజల సంఘటిత స్వరంతో గళం కలిపి పరిషత్తు సర్వసభ్యమండలి 'ఆంధ్ర సారస్వత పరిషత్తు' పేరును 'తెలంగాణ సారస్వత పరిషత్తు' గా మార్పు చేస్తూ ఏకగ్రీవంగా తీర్మానించింది. పరిషత్తు చరిత్ర పూర్వరంగాన్ని సంగ్రహంగా ఆవిష్కరించటం ఈ సందర్భంలో సముచితమని భావిస్తున్నాం.

నిజాం పాలనలో తెలుగు భాషాదీపం కొడిగట్టిన కాలంలో దాని పునరుద్దీపనానికి ఉద్యమించిన మాతృసంస్థ ఈ పరిషత్తు. శ్రీ సురవరం ప్రతాపరెడ్డి, శ్రీ మాడపాటి హనుమంతరావు, శ్రీ కాళోజి నారాయణరావు, శ్రీ బూర్గుల రామకృష్ణారావు, శ్రీ లోకనంది శంకర నారాయణరావు, శ్రీ గడియారం రామకృష్ణ శర్మ వంటి సాహితీమూర్తుల ప్రేరణతో పరిషత్తు 1943 మే 26న రూపుదిద్దుకుని ఈ రోజు తెలంగాణలో అగ్రేసర సాహితీ సంస్థగా విశిష్టస్థానం వహించింది. మాన్యమిత్రులు డా॥దేవులపల్లి రామానుజరావు గారు యావజ్జీవం పరిషత్తు అభివృద్ధికి శ్రమించినారు. పరిషత్తు బహుముఖీన కార్యక్రమాలు చేపట్టి సమర్థంగా నిర్వహిస్తూ అందరి ప్రశంసలందుకుంటున్నది. పరిషత్తు ప్రాథమిక, ప్రవేశ, విశారద తెలుగు పరీక్షలు జరపడంతో పాటు, తెలుగు పండిత శిక్షణ కళాశాలను, ప్రాచ్య కళాశాలను నిర్వహిస్తున్నది. పరిషత్తు ఏర్పాటు చేసే సాహితీ సభలు, సమావేశాలు, ప్రసంగాలు, సదస్సులు, ఉత్సవాలు, చర్చాగోష్ఠులు, పరిణతవాణి ప్రసంగాలు, ప్రసంగాత్మక ప్రదర్శనలు, సాంస్కృతిక కార్యక్రమాలు మొదలైనవి తెలంగాణ వైశిష్ట్యానికి అద్దం పడుతున్నవి. పరిషత్తు ప్రచురించే గ్రంథాలను సాహితీలోకం అభిమానించి స్వాగతిస్తున్నది. ఇంతవరకు దాదాపు 160 గ్రంథాలను వెలువరించింది.

2013లో పరిషత్తు సప్తతి మహోత్సవాలను ఘనంగా నిర్వహించింది. తెలంగాణ ప్రత్యేకతలోని వివిధ పార్శ్వాలను ఆవిష్కరించే సదస్సులు, సాంస్కృతిక కార్యక్రమాలు

ఏర్పాటయ్యాయి. నిపుణులప్రసంగ వ్యాసాలను "వ్యాసగుళుచ్ఛం" పేరుతో పరిషత్తు రెండు భాగాలు వెలువరించింది. "తెలంగాణలో తెలుగు సాహిత్య వికాసం"పై సదస్సు వంటి కార్యక్రమాలను పరిషత్తు ఏర్పాటు చేసింది.

తెలంగాణను సర్వతోముఖంగా అభివృద్ధి చేసేందుకు ప్రభుత్వం, సంస్థలు, ప్రజలు ఉద్యమస్ఫూర్తితో కృషి చేయడం హర్షణీయం. తెలంగాణ భాషా సాహిత్య కళా సంస్కృతుల వికాసాభ్యుదయాల కోసం ఏడు దశాబ్దాలకు పైగా అంకిత భావంతో ముందుకు సాగుతున్న పరిషత్తు బంగారు తెలంగాణ నిర్మాణంలో తన వంతు పాత్రలో భాగంగా విశిష్ట కార్యక్రమాలకు రూపకల్పన చేసి నిర్వహిస్తున్నది. వాటిలో కొన్ని – తెలంగాణ మాండలిక పదాలు – ప్రయోగ వైశిష్ట్యం, ప్రాచీన తెలంగాణ కవుల సాహితీ సేవ, తెలంగాణ చిత్రకళ, శిల్పకళల వైభవం, తెలంగాణ గిరిజన భాషా సాహిత్యాల సదస్సు, తెలంగాణ కవయిత్రుల, కథయిత్రుల రాష్ట్ర స్థాయి సమ్మేళనం.

తెలంగాణ వైభవోన్నతిపై ప్రత్యేక గ్రంథ ప్రచురణను పరిషత్తు చేపట్టింది. ఈ పరంపరలో ప్రస్తుత గ్రంథం ప్రముఖ రచయిత్రి డా॥ ముదిగంటి సుజాతారెడ్డి రచించిన "తెలంగాణ తెలుగు సాహిత్య చరిత్ర". డా. సుజాతారెడ్డి ఈ గ్రంథాన్ని పరిశోధనాత్మకంగా శాస్త్రీయ దృక్పథంతో ప్రామాణిక రచనగా తీర్చిదిద్దినారు. యుగ విభజన ఆధారంగా ఈ గ్రంథానికి ఆమె సమగ్రతను సంతరింపజేసినారు. వేములవాడ చాళుక్యుల యుగం నుండి ఈనాటి వరకు తెలంగాణలో తెలుగు సాహిత్యాన్ని సుసంపన్నం చేసిన సాహితీవేత్తల రచనాగరిమ దీనిలో ప్రతిభాన్వితంగా చిత్రించినారు. ఈ గ్రంథం తెలంగాణ సాహితీ వైలక్షణ్యానికి మణిదర్పణంగా భాసిస్తున్నది. గ్రంథ రచయిత్రి డా॥ సుజాతారెడ్డికి నా హార్దికాభినందనలు

ఈ గ్రంథానికి పాఠకలోకం నుంచి లభించిన విశేష ఆదరణను పురస్కరించుకుని అతిస్వల్ప వ్యవధిలోనే తృతీయ ముద్రణను ప్రకటిస్తున్నాం.

పరిషత్తు వెలువరిస్తున్న ఈతృతీయముద్రణ అందరి మన్ననలను పొందగలదని విశ్వసిస్తున్నాను.

(డా. సి.నారాయణ రెడ్డి)
అధ్యక్షులు
తెలంగాణ సారస్వత పరిషత్తు

హైదరాబాదు
తేది : 02-12-2015

**డా॥ జె. చెన్నయ్య**
ప్రధాన కార్యదర్శి
తెలంగాణ సారస్వత పరిషత్తు



తిలక్ రోడ్,
హైదరాబాదు-500001.
ఫోన్ : 040-24753724

# ప్రవేశిక

**తె**లంగాణ సారస్వత పరిషత్తు నిర్వహిస్తున్న విభిన్నమైన కార్యక్రమాల్లో పుస్తక ప్రచురణ విశిష్టమైంది. పరిషత్తు ప్రచురించిన గ్రంథాల పట్టికను చూస్తే ఎంత గొప్పవైన ప్రచురణలు వచ్చాయో తెలుస్తుంది. చీకటిని తిట్టుకుంటూ కూర్చోకుండా నాటి పెద్దలు పరిషత్తును ప్రపంచ తెలుగు వేదికగా నిలబెట్టారు. తెలుగు పరీక్షల నిర్వహణ, భాషా సాహిత్య సాంస్కృతిక వికాసానికి దోహదం చేసే సదస్సుల నిర్వహణ, పెద్దల పేరిట నిర్వహించే సంస్మరణ ప్రసంగాలు, పరిణతవాణి ప్రసంగ పరంపర కొనసాగుతూ అనుబంధంగా పుస్తక ప్రచురణ జరిగింది. 2013 సంవత్సరంలో పరిషత్తు సప్తతి పూర్తి సందర్భంగా ఏడాది పొడవునా అనేకమైన ప్రత్యేక కార్యక్రమాలు ఏర్పాటు చేయడం జరిగింది. అధ్యక్షులు డా. సి.నారాయణరెడ్డి నేతృత్వంలో సప్తతి సందర్భంగా తెలంగాణ తెలుగు సాహిత్య వికాసం, తెలంగాణ ప్రాచీన కవుల కవితా ప్రాభవం, తెలంగాణ మాండలిక పదాలు-ప్రయోగ రీతులు, తెలంగాణ ప్రాచీన నృత్య రీతులు, తెలంగాణ గిరిజన భాషా సాహిత్యాలు, తెలంగాణ కవయిత్రులు, కథయిత్రుల సమ్మేళనం వంటి అనేక సదస్సులు, ప్రత్యేక కార్యక్రమాలను నిర్వహించడం జరిగింది. తెలంగాణ ప్రత్యేక రాష్ట్రంగా ఆవిర్భవించిన తరుణంలో తెలంగాణలో సాహిత్య చైతన్యాన్ని పెంపొందించే కృషిలో భాగంగా ఈ కార్యక్రమాలు నిర్వహించాలని పరిషత్తు భావించింది. నవ్య స్ఫూర్తితో ప్రచురణల్ని కూడా వెలువరించాలని నిర్ణయించింది. గత సంవత్సరం పరిణతవాణి ప్రసంగాలతో కూడిన తాజా సంపుటి, 'తెలంగాణ సాహిత్య వికాసం', 'వ్యాసగుళుచ్ఛం' రెండు సంపుటాలు ప్రచురించడం జరిగింది. వాటిని పాఠకులు ఆదరించారు. సంతృప్తిని కలిగించింది.

ఇప్పుడు వస్తున్న గ్రంథాల్లో డా. ముదిగంటి సుజాతారెడ్డి రచించిన 'తెలంగాణ

తెలుగు సాహిత్య చరిత్ర'కు ఎంతో ప్రాధాన్యముంది. ఎడతెగని ఉద్యమ పర్యవసానంగా తెలంగాణ కొత్త రాష్ట్రంగా ఆవిర్భవించింది. ఈ తరుణంలో తెలంగాణ తన సాహిత్య మూలాలను అన్వేషించి తన స్థానాన్ని పదిలపరచుకోవలసిన అవసరం వుంది. అందుకు ఇటువంటి పరిశోధనాత్మక గ్రంథం అవసరం ఎంతో వుంది. డా. సుజాతారెడ్డి పరిశోధకురాలుగానేకాక సృజనాత్మక రచయిత్రిగా కూడా విశేష కృషి చేశారు. వారు పూర్వకాలం నుండి సారస్వత పరిషత్తు ఉపాధ్యక్షులు కూడా. వారీ గ్రంథంలో తెలంగాణ ప్రాచీన కాలం నుంచి ఇటీవలి కాలం వరకు సాహిత్య చరిత్రను యుగ విభజన పూర్వకంగా రచించారు.

ప్రధాన కార్యదర్శి

# ప్రాక్కథనం

తెలంగాణ తెలుగు సాహిత్య చరిత్రను శాస్త్రీయంగా చారిత్రకతను పాటిస్తూ రాజవంశాల పేరుతో యుగ విభజన చేస్తూ నేను ఈ గ్రంథాన్ని రచించాను. వేములవాడ చాళుక్యులకు ఇయ్యవలసిన ప్రముఖ స్థానాన్ని ఇచ్చాను. ఆధునికయుగంగా పేర్కొనకుండా అసఫ్‌జాహి రాజుల యుగంలోనే తెలంగాణ పునరుజ్జీవనోద్యమం, తెలంగాణ విమోచనోద్యమం, తెలంగాణ సాయుధ పోరాట కాలం నాటి కవుల, రచయితలను గురించి చెప్పాను. తెలంగాణలో క్రమంగా జరిగిన ఆధునికత ప్రవేశాన్ని ఇతర ప్రాంతాల కన్నా భిన్నంగా వుండటాన్ని వివరించాను. తెలంగాణ సాహిత్యంలోని సాహిత్య ప్రక్రియల వైశిష్ట్యాన్ని గురించి చెప్పాను. ఇక్కడ పాట, జానపద కళా రూపాలకున్న విశిష్టతను వివరించాను. ప్రాచీన సాహిత్యంలోనే శిష్ట కవులు జానపదులకు పట్టుపడేటట్లుగా గానానికి అనువైన "ద్విపద" ఛందస్సులో మహాకావ్యాలు రచించారు. తెలంగాణ తెలుగు సాహిత్యంలో ఎన్నో ప్రక్రియలు మొట్టమొదట పుట్టి వికసించాయి. నన్నయకు పూర్వమే గద్యపద్య రచనలు కావ్యరచన చేయుగలిగినంతగా వికసించాయని శాసనాధారాలున్నాయని చూపించాను. నన్నయ భారత రచనకు యాభై సంవత్సరాలకు పూర్వమే విరియాల కామసాని చక్కని అలంకారిక శైలిలో వృత్త పద్యాలను వ్రాసిందని గూడూరు శాసనం చాటుతున్నది. ఇక వేములవాడ చాళుక్యుల కాలంలో సంస్కృతం, కన్నడంలో కావ్యరచనలు జరగటమే కాక తెలుగులోను గ్రంథ రచనలు జరిగాయన్న ఆధారాలు చూపించాను. అది తెలుగు సాహిత్య చరిత్రలో స్వర్ణయుగంగా పరిగణించాలని చెప్పాను.

కాకతీయుల, పద్మనాయక, కుతుబ్‌షాహీల కాలంలో ఎంత గొప్ప సాహిత్యం

వచ్చిందో చారిత్రక క్రమంతో వివరించాను. అసఫ్‌జాహీల కాలంలో ఎంత గొప్ప తిరుగుబాటు విప్లవ సాహిత్యం, ప్రపంచంలోనే ఎన్నదగిన పోరాటం నేపథ్యంలో వచ్చిందో చెప్పాను. ఆధునికయుగం అంటే విశాలాంధ్ర యుగంలో మొదట్లో కొంత స్తబ్ధత రావటానికి కారణాన్ని వివరించి తర్వాత కాలంలో దిగంబర కవులు, చేతనావర్త కవులు, విప్లవ వాదం, దళిత, స్త్రీ, మైనారిటీ, తెలంగాణ ప్రాంతీయం వంటి అస్తిత్వ వాదాలు ఏ విధంగా బలంగా వచ్చాయో చెప్పాను. తెలంగాణ తెలుగు సాహిత్య క్రమ వికాసం, విశిష్టతలను వివరించాను. శివకవుల నాటి నుంచి ఈనాటి తెలంగాణ ప్రాంతీయ అస్తిత్వవాదం వరకు తెలంగాణ కవులు బలమైన గొంతుతో వినిపించిన సాహిత్య గరిమను తెలిపాను. పాట, జానపద కళలు, జానపద కళా ప్రదర్శనలు ఏ విధంగా కాలం దెబ్బలకు తట్టుకొని ఏ ప్రాంతంలో లేని విధంగా తెలంగాణలో నిలబడి విశ్వవిద్యాలయాల పీఠాల నధిష్ఠించాయో తెలిపాను.

ఆ విధంగా తెలంగాణ తెలుగు సాహిత్య విశిష్టతను ఈ సాహిత్య చరిత్రలో చెప్పాను. ఈ గ్రంథాన్ని తెలంగాణ సారస్వత పరిషత్తు వారు ప్రచురించాలని తలపెట్టటం చాలా గర్వకారణం. పరిషత్తు అధ్యక్షులు ఆచార్య సి.నారాయణరెడ్డి గారికి నా కృతజ్ఞతాభివందనాలు.

రోహిణమ్ **డా. ముదిగంటి సుజాతారెడ్డి**

## విషయసూచిక

# ఆరంభం

తెలుగు భాష ద్రావిడ భాషా కుటుంబానికి చెందిన భాష. ప్రాచీనకాలంలో "తల్లి సంస్కృతంబె యెల్లభాషలకును" అన్న అభిప్రాయం ఉండేది. కాని దక్షిణభారత భాషలు నేర్చుకున్న పాశ్చాత్యులు 18, 19 శతాబ్దాల్లో ఈ భాషల నిర్మాణం సంస్కృత భాషకన్నా భిన్నంగా వుందని చెప్పారు. డచ్చి దేశస్థుడైన రాస్మిస్ క్రిష్టియన్ రాస్ (క్రీ.శ. 1787–1832) దక్షిణ భారత భాషలు సంస్కృతం కన్నా భిన్నమైనవని గుర్తించి భారత భాషలకు ఆయన మలబారిన్ భాషలని పేరు పెట్టాడు. క్రీ.శ. 1816లో ఎ.డి.క్యాంబెల్ "ఎ గ్రామర్ టు తెలుగు లాంగ్వేజ్" అన్న పుస్తకం వ్రాశాడు. దానికి పీఠిక వ్రాస్తూ ఫ్రాన్సిస్ ఎల్లిస్ దక్షిణ భారత భాషలకు, సంస్కృతానికి జన్యజనక సంబంధం లేదని చెప్పాడు. క్రీ.శ. 1856లో బిషప్ రాబర్ట్ కాల్డ్వెల్ "ఎ కంపారిటివ్ గ్రామర్ ఆఫ్ ది ద్రవిడియన్ లాంగ్వేజస్" అన్న గ్రంథంలో దక్షిణ భారత భాషలు ఇంకా 12 వరకు ఆదివాసుల భాషలు ఒక్క కుటుంబానికి చెందినవనీ వాటి నిర్మాణం ఒకే తీరుగా వున్నదని సోదాహరణంగా నిరూపించి చూపించాడు. అప్పటినుంచి ఆ భాషలకు "ద్రావిడ భాషలు" అన్న పేరు స్థిరపడింది. క్రీ.పూ. 3000 నాటిదైన మొహంజదారో తవ్వకాల్లో దొరికిన మట్టి సీళ్ళ మీదున్న చిత్రలిపిలో వున్నది ద్రావిడ భాషల మూలభాష అని ద్రావిడ భాష భారతదేశపు మూలవాసుల భాష అని సంస్కృతం ఆర్యులనబడే జాతి ఉత్తర పూర్వ దిశ నుంచి భారతదేశంలోకి ప్రవేశించిందని వారి భాష సంస్కృతం అని, అది ద్రావిడ భాషను ప్రభావితం చేసిందని చారిత్రకులు అంటారు. అదే విధంగా ద్రావిడ భాషలోని పదాలు, వాక్య నిర్మాణ పద్ధతులు సంస్కృతాన్ని చాలా ప్రభావితం చేసాయని భాషా శాస్త్రజ్ఞులు గుర్తించారు. వేదాలలో ముఖ్యంగా అధర్వణ వేదంలో కన్పించే భాష సంస్కృతిపై ద్రావిడుల భాష, సంస్కృతిల ప్రభావం బాగా కన్పిస్తున్నదని పాశ్చాత్య ఇండాలజిస్టులు గుర్తించారు. సంస్కృతంలోని

ధాతువులను పరిశీలిస్తే ఎన్నో ద్రావిడం నుంచి పోయి చేరినవి కన్పిస్తున్నాయి. టి.బరో, ఎమ్.బి. ఎమెనోలు కూర్చిన "ద్రవిడియన్ ఎటిమాలజికల్ డిక్షనరీ" (1961) చూస్తే మనకీ విషయం తెలుస్తున్నది. ఇప్పుడున్న ఉత్తర భారతం భాషలన్నిటిలోని వాక్యనిర్మాణ విధానం అంటే కర్త వాక్యంలో మొదట్లో రావటం క్రియ చివర రావటం వంటివి ద్రావిడ భాషల వాక్య నిర్మాణ ప్రభావమే అని, అదేవిధంగా ద్రావిడ భాషా పదజాలం ఆ భాషల్లోకి సంస్కృతం ప్రాకృతం అపభ్రంశ భాషల ద్వారా వచ్చి చేరిందని సునీత కుమార ఛటర్జీ వంటి భాషావేత్తలు చెప్పారు.

ఆదివాసులు మాట్లాడే భాష నుంచి మూల ద్రావిడ భాష రూపొందిందా లేదా ద్రావిడ భాష ఆదివాసుల భాషలుగా రూపొందిందా? – దేనికి ఏది మూలం అనే విషయాన్ని గురించి భాషాశాస్త్రజ్ఞులు తేల్చి చెప్పలేకుండా ఉన్నారు. పాకిస్తాన్‌లో ఒక ఆదివాసుల గుంపు మాట్లాడే "బ్రాహుయి" భాష ద్రావిడ భాషా కుటుంబానికి చెందిందని దాన్ని అధ్యయనం చేసిన భాషా శాస్త్రజ్ఞులు చెప్తున్నారు. అంటే ద్రావిడ భాష ఒక్క దక్షిణ భారతంలోనే కాక భారతదేశమంతటా మాట్లాడే ప్రజల భాషగా ఉండేదని చెప్పవచ్చును. అందుచేతనే ద్రావిడ భాష సంస్కృత ప్రాకృత అపభ్రంశ భాషలను ప్రభావితం చేసిందనడం సత్యం.

మూల ద్రావిడ భాషల లక్షణాలు ఎక్కువగా తమిళంలో వున్నాయని కొందరు అంటారు. అందుకని తమిళం ద్రావిడ భాషల కన్నిటికి తల్లిభాష అని కొందరి అభిప్రాయం. కాని అటువంటిదేమి లేదని ద్రావిడ భాషలన్ని సోదర భాషలని భాషా శాస్త్రజ్ఞులు తేల్చారు. ద్రావిడ భాషలన్నీ సంస్కృత పదజాలం చేరి రానురాను సాహిత్య భాషలుగా రూపొందాయి. జైన బౌద్ధమతాల ప్రభావం ఉన్నచోట దేశభాషల్లో ఆ మతాల భావజాలాన్ని ప్రచారం చేయాలనే దృష్టితో ఆ మతాల వారు దేశభాషలను ఆదరించి సాహిత్య సృష్టి చేసారు. ఆ విధంగా మొదట తమిళదేశంలో జైన బౌద్ధమతాల వ్యాప్తితోనే సాహిత్య సృష్టి జరిగింది. "శిలప్పదిగారం, మణిమేఖలై" తమిళంలో ఆది కావ్యాలను రచించిన ఇలంగో, శాత్తనారు కవులు బౌద్ధులు. "తిరుక్కురళ్" పద్యాలను వ్రాసిన తిరువళ్ళువరు జైనుడు. ఆ తరువాత జైన బౌద్ధమతాల్లో వున్న బుద్ధుని "ఆరాధన"ను తీసుకొని శివ విష్ణు దేవతల ఆరాధనతో కూడిన భక్తిమతాలు తమిళ

దేశంలో వ్యాపించాయి. శివ భక్తులైన నాయనార్లు, వైష్ణవ భక్తులైన ఆళ్వార్లు భక్తి కవిత్వాన్ని వ్రాసి తమిళ సాహిత్యాన్ని సుసంపన్నం చేసారు. తమిళం తర్వాతనే ఇతర ద్రావిడ భాషల్లో సాహిత్య సృజనం జరిగింది.

ఆ విధంగా చూస్తే తెలుగుదేశంలోనూ జైన బౌద్ధమతాలు బాగా విస్తరించాయి. ధాన్యకటకమనబడిన ఈనాటి అమరావతి బౌద్ధమత కేంద్రంగా వ్యాపార కేంద్రంగా ఉండేది. అక్కడి స్తూపం శిల్పకళ ప్రపంచ ప్రఖ్యాతి చెందినయి. ఇంకా తెలుగు దేశంలో ఎన్నో బౌద్ధ స్తూపాల, చైత్యాల నిర్మాణాలు, శిల్పాల అవశేషాలు బయటపడ్డాయి. తెలంగాణలో బౌద్ధం విశేషంగా వ్యాపించింది. ఖమ్మం జిల్లాలోని నేలకొండపల్లి స్తూపం చాలా పెద్దది. ఇప్పుడు ఆ స్తూపం అవశేషాలు మాత్రమే మిగిలినయి. కరీంనగర్ జిల్లాలోని ధూళికట్ట, కోటిలింగాల, నల్లగొండ జిల్లాలోని నందికొండ, ఫణిగిరి, తిరుమలగిరి, గాజులబండ, మెదక్ జిల్లాలోని కొండాపురం, కోటపేట, కోటిలింగాల వంటి ఎన్నో బౌద్ధ క్షేత్రాలు బయటపడినయి. ఇంకా పడ్తున్నయి. నేలకొండపల్లిలో మహాస్తూపం ఉండేది. మహాస్తూపమని బుద్ధుని అవశేషాల మీద నిర్మించిన స్తూపాన్ని అంటారు. ఆంధ్రదేశంలో నేలకొండపల్లి, అమరావతి మహా స్తూపాలున్న క్షేత్రాలు.

ప్రాచీనకాలంలో బౌద్ధ యాత్రికులు ఉత్తరభారతం నుంచి బయలుదేరి వార్ధా, ప్రాణహిత, గోదావరి నదులను దాటి కరీంనగర్ జిల్లాలోని కోటిలింగాలకు వచ్చి అక్కడి నుంచి ఫణిగిరి తిరుమలగిరి క్షేత్రాల మీదుగా నాగార్జున కొండ అక్కడి నుంచి అమరావతి చేరుకునే వాళ్ళనీ, క్రీ.శ. 6వ శతాబ్దంలో ప్రసిద్ధ చైనా యాత్రికుడు హ్యుయన్‌త్సాంగ్ ప్రయాణం చేసిన మార్గం ఇదేనని అంటారు. ఆ దారి ప్రాచీన కాలం నుంచి వ్యాపార రహదారిగా ఉండేది. ఆ దారి నుంచే ఉత్తర భారతం నుంచి ఎన్నో జాతులు, రాజకుమారులు, రాజవంశాల వాళ్ళు తెలుగుదేశానికి వచ్చి రాజ్యాలను స్థాపించారు. శాతవాహనులు అదే మార్గం నుంచి కోటిలింగాల చేరుకొని అక్కడి రాజులను ఆశ్రయించివుండి అదను చూసుకొని స్వతంత్రులై తమ రాజ్యాన్ని స్థాపించుకొని వుంటారు.

కోటిలింగాలలో జరిగిన తవ్వకాల్లో ప్రాచీన నాణాలు, బౌద్ధస్తూపాలు లభ్యమైనాయి. అశోకునికి పూర్వమే ఇక్కడ బౌద్ధం వ్యాపించిందని తెలుస్తున్నది. అశోకుడు 13వ శిలా శాసనం వేయించటానికి పూర్వమే ఆంధ్రదేశంలో బౌద్ధం వ్యాపించి వున్నట్లు ఆ శాసనంలో పేర్కొనబడింది. దాన్నిబట్టి తెలంగాణలోను అశోకునికి పూర్వమే బౌద్ధం వ్యాపించిందని చెప్పాలె. ఇక్కడ జనపదాల వంటి రాజ్యాలు కూడా వుండేవని ఆధారాలున్నాయి. మౌర్య చంద్రగుప్తుని ఆస్థానంలో వున్న గ్రీకు రాయబారి మెగస్థనీసు ఆంధ్రులకు ముప్పై దుర్గాలు వున్నట్లుగా చెప్పాడు. ఏరియన్ అనే మరో గ్రీకు చరిత్రకారుడు ఆంధ్రులకు ముప్పై రాజ్యాలున్నయన్నాడు. దాన్నిబట్టి ముప్పై దుర్గాలు, ముప్పై రాజ్యాలకు రాజధానులయి వుంటవి. ఆ ముప్పైలో కోటిలింగాల ఒకటి కావచ్చు. బౌద్ధ జాతక కథల్లో, వ్రాతల్లో అంధక, అశ్మక, ముషక రాష్ట్రాల ప్రసక్తి చాల కన్పిస్తున్నది. ఇవి తెలంగాణలోని రాజ్యాలు, ముషక రాష్ట్రం నల్లగొండ జిల్లా ప్రాంతం. అశ్మక రాష్ట్రం నిజామాబాదు ప్రాంతం. అంధక (ఆంధ్ర) రాష్ట్రం కరీంనగరం ప్రాంతం కాబట్టి కోటిలింగాల అంధకుల రాజధాని అయివుంటుంది. ఈ అంధకులకు భృత్యులుగా అంటే సామంతులుగానో సహాయకులుగానో సైన్యాధికారులుగానో శాతవాహనులు వుండి వుంటారు. శాతవాహన వంశజుల్లో ఒకడైన సిముకుడు అంధకుల చివరి రాజును చంపి శాతవాహన రాజ్యాన్ని స్థాపించాదని ఆధారాలతో చెప్పవచ్చును. ఎందుకంటే కోటిలింగాలలో సిముకు (శ్రీముఖు)ని నాణాలు లభించాయి. సిముకునికి పూర్వం పాలించిన అంధకు (ఆంధ్రు)ల నాణాలు లభించాయి. ఒకప్పుడు మగధను మౌర్యులకన్నా పూర్వం పాలించిన మహాపద్మనందుడు తమిళదేశం వరకు తన సామ్రాజ్యాన్ని విస్తరింపజేశాడని చారిత్రకులు చెప్తున్నారు. అతని పాలనలో వున్న అంధకులు నందవంశ వినాశంతో స్వతంత్రించి నాణాలు ముద్రించి వుంటారు.

అశోకుని తర్వాత శాతవాహనులు అంధకులను అణచివేసి తమ రాజ్యాన్ని స్థాపించారని శాతవాహనుల తొలిరాజు సిముకుని నాణాలు కోటిలింగాలలో మాత్రమే లభించటాన్ని బట్టి తెలుస్తున్నది. అయితే శాతవాహనులకు పూర్వం మౌర్యుల కాలం నాటికి తెలంగాణలో చిన్న చిన్న జనపదాలున్నాయని బౌద్ధుల వ్రాతలను బట్టి

తెలుస్తున్నది. ఆ రాజ్యాలను గెలుచుకొని క్రమంగా శాతవాహనులు అశ్మకరాజ్యంలో వున్న, ఉత్తర భారతానికి దగ్గరగా ఉంటుందని పైఠన్‌ను తమ రాజధానిగా చేసుకొని వుంటారు. అందుకే ప్రసిద్ధంగా శాతవాహనుల రాజధాని పైఠన్ అని చారిత్రకులు వ్రాస్తుంటారు. కాని కోటిలింగాలలో మాత్రమే సిముకుని నాణాలు దొరకటం చేత వాళ్ళ మొదటి రాజధాని కోటిలింగాల అనే చెప్పాలె. ఆ తర్వాత రాజధాని పైఠన్‌కు మారిందని అనుకోవాలె. తెలంగాణలో విస్తారంగా శాతవాహన రాజుల చివరి రాజులైన శివశ్రీయజ్ఞశ్రీ శాతకర్ణిల వరకు కూడా నాణాలు లభించడం వల్ల శాతవాహనులు మొదటి నుంచి చివరి వరకు అంటే క్రీ.పూ. 225 నుంచి క్రీ.శ. 225లో వంశం అంతమయ్యే వరకు తెలంగాణను పరిపాలించారని తెలుస్తున్నది. క్రీ.శ. 225 వరకు శాతవాహన వంశంలో చివరి రాజులు శివశ్రీ, యజ్ఞశ్రీల నాణాలు నల్లగొండ జిల్లా ఆకారం అక్కినేపల్లి మొ॥న అనేక చోట్ల గ్రామాల్లో లభించాయి. కొండాపూరు అక్కినేపల్లిలో శాతవాహనుల నాటి రోమన్ బంగారు నాణాలు కూడా దొరికాయి.

శాతవాహనులకు పూర్వం కోటిలింగాల నేలిన అంధక రాజుల నాణాలు చాలా తవ్వకాల్లో దొరికాయి. ఆర్కియలాజికల్ శాఖ డైరెక్టరుగా కృష్ణశాస్త్రిగారు ఉన్నప్పుడు అసిస్టెంటు డైరెక్టరు అయిన రామచంద్రమూర్తిగారి ఆధ్వర్యంలో ఇక్కడ తవ్వకాలు జరిగాయి. 1981లో ఆ తవ్వకాలను గురించి దొరికిన నాణాలను గురించి వాళ్ళు రిపోర్టు తయారు చేసారు. ఆర్కియలాజికల్ శాఖ వారి ఆఫీసులో ఆ రిపోర్టు వుంది. కోటిలింగాలలో చాలా సంఖ్యలో పూర్వ శాతవాహన రాజుల నాణాలు దొరికాయి. తర్వాత డా॥ రాజారెడ్డి వంటి ప్రైవేటు వ్యక్తులు కూడా కోటిలింగాలలో నాణాలు సేకరించారు. ఈ నాణాలన్నీ కూడా బ్రాహ్మీ లిపిలోనే వున్నాయి. ఆ నాణాల మీద "గోబద, నారన, కంపయాస, సిరావయాస, సమగోప" అనే రాజుల పేర్లున్నాయి. వీటిల్లో నారన పేరు తెలుగు పేరుకు దగ్గరగా వుంది. మారన, గౌరన పేర్ల చివర 'అన' అనే పదం కన్పిస్తున్నది. 'అన్న' బంధువాచక పదం మరో రూపమే 'అన'. ఇదే తెలుగులో దొరికిన మొట్టమొదటి పదం. ఇంతకుముందు మనం అమరావతిలో లభించిన శిలాఫలకం మీదున్న 'నాగ' పదంలోని 'బు' ప్రత్యయమే తెలుగులో మొట్టమొదట దొరికిన అక్షరంగా తెలుగు భాష ఉనికి ఆనాటిదని చెప్పుకుంటున్నాం.

కాని 'నాగబు' అన్నది "నాగబుధి, నాగబుధిక" అన్న పేర్లతో కూడిన ఫలకం అవశేషం మాత్రమే. కాని 'నాగబు' లోని 'బు' తెలుగు ప్రత్యయం కాదని చారిత్రకులంటున్నారు. కాబట్టి శాతవాహనులకు పూర్వందయిన కోటిలింగాల నాణాలమీద లభించిన 'నారన'లోని 'అన' అనే బంధువాచక పదమే మొట్టమొదట లభించే తెలుగు భాష ఉనికి ఆనవాళ్ళుగా చెప్పుకోవాలె. అది తెలంగాణలోని కోటిలింగాలలో లభ్యం కావటం విశేషం. కోటిలింగాల ప్రాంతం 'అంధక' జనపదం కాబట్టి శాతవాహనులకు పూర్వం 'అంధక' రాజ్యాన్ని పాలించిన అంధక (అంధ్ర-ఆంధ్రు)లవే ఈ నాణాలు. అక్కడి ఆంధ్రులను ఓడించి సిముకుడు కోటిలింగాలలో శాతవాహన రాజ్యం స్థాపించాడని సిముకుని నాణెం ఇక్కడ లభించటం వల్ల తెలుస్తున్నదని చరిత్ర పరిశోధకులంటున్నారు. సిముకుని నాణెం ఇక్కడ తప్ప మరెక్కడా లభించలేదని చారిత్రకులు చెప్తున్నారు. కాబట్టి శాతవాహన సామ్రాజ్యారంభం గోదావరి నదీ తీరంలో వున్న కోటిలింగాలలోనే జరిగిందని చెప్పాలె. దానికన్నా పూర్వం శాతవాహనులు 'ఆంధ్రు'ల సామంతులుగా లేదా ఉద్యోగులుగా ఉండటం చేత కావచ్చును పురాణాలు వారిని "ఆంధ్ర భృత్యులు"గా పేర్కొంటున్నాయి. "ఆంధ్ర (అంధ్ర) భృత్యులు" అని శాతవాహనులను పురాణాలు పేర్కొనటం చేత "అంధకులు, అంధ్రులు" అనబడే "ఆంధ్రుల" రాజధాని కోటిలింగాలలోనే శాతవాహనుల సామ్రాజ్యారంభం జరిగిందని చెప్పాలె.

## శాతవాహనుల యుగం

ఆ తర్వాత శాతవాహన చక్రవర్తి గౌతమీపుత్ర శాతకర్ణి (క్రీ.శ. 78-102) నాణాల మీద రెండు భాషలున్నాయి. ఒకటి ప్రాకృతం-"గోతమి పుతసరి సతకణిస" అని - రెండోది దేశి- "గోతమి మగకు తిరుహతకణి" అని. దీనిలో 'మగకు' 'లోని'కు తెలుగు షష్ఠీ ప్రత్యయం. 'మగ' అంటే ద్రావిడ భాషలో కొడుకు అని అర్థం. తెలుగులోనూ 'మగ'కు ఆ అర్థం వుంది. కాబట్టి 'మగకు' - 'కొడుకుకు' అని. ఇది తెలుగు పదమే. శాతవాహనుల రాజ భాష ప్రాకృతం. శాతవాహనులు ప్రాకృతాన్ని అభిమానించారు. వారు శాసనాలన్నీ ప్రాకృతంలో వేయించారు. అవి బ్రాహ్మీలిపిలో వున్నాయి. ఆ కాలంలో అనేక ప్రాకృత రచనలు చేయబడినాయి. ప్రాకృత సాహిత్యానికి

శాతవాహనుల పరిపాలనా కాలం స్వర్ణయుగం. క్రీ.పూ. మొదటి శతాబ్దంలో పాలించిన కుంతల శాతకర్ణి ఆస్థానంలో వున్న శర్వవర్మ "కాతంత్ర వ్యాకరణం" రచించాడు.

కుంతల శాతకర్ణికి ఆ వ్యాకరణం ఆధారంగా ఆరు నెలల్లో శర్వవర్మ సంస్కృతం నేర్పాడు. కుంతల శాతకర్ణి ఆస్థానంలో వున్న మరో ప్రసిద్ధ కవి గుణాఢ్యుడు. గుణాఢ్యునికి శర్వవర్మకు మధ్య జరిగిన వివాదంతో గుణాఢ్యుడు సంస్కృత ప్రాకృత దేశి భాషల్లో వ్రాయనని ప్రతిజ్ఞ చేసాడు. ఈ 'దేశి' భాష ప్రజల భాష తెలుగే. పైశాచీ భాషలో "బృహత్కథ" అనే కథా కావ్యాన్ని రచించాడు. పైశాచీ అన్నది వింధ్యాది ప్రాంతాల్లో సామాన్య జనులు మాట్లాడే ప్రాకృత భాష. విస్తృతంగా ప్రజల వాడుకలో వున్న భాషలో గుణాఢ్యుడు 'బృహత్కథ'ను రచించాడు. దీనిలో ప్రసిద్ధమైన రాజు ఉదయనుడు అతని కుమారుడు నరవాహనదత్తుల సాహస అద్భుత కార్యాలు వర్ణింపబడినాయి. కథలో కథను కూర్చే పద్ధతి పంచతంత్రంలో వలె దీనిలోను కన్పిస్తుంది. గుణాఢ్యునికి బృహత్కథ రచనతో చాలా కీర్తి వచ్చింది. వాల్మీకి, వ్యాసుల సరసన స్థానం లభించింది. క్రమంగా బృహత్కథ వినష్టమైంది. క్షేమేంద్ర, సోమదేవులు చేసిన బృహత్కథ సంస్కృతానువాదాలు మాత్రం లభిస్తున్నాయి.

కుంతల శాతకర్ణి ప్రాకృత ప్రేమి. ప్రాకృత కవుల నాదరించాడు. అదేవిధంగా క్రీ.శ. మొదటి శతాబ్దం వాడైన హాల శాతవాహనుడు (ప్రాకృత) కవివత్సలుడుగా ప్రసిద్ధి చెందాడు. హాలుడు తాను చెప్పిన 'గాథ'లను తన ఆస్థానానికి అతని ఆదరణ కోరి వచ్చిన కవులు చెప్పిన గాథలను ఏడువందలను "గాథా సప్తశతి"గా కూర్చాడు. 'గాథ' అన్నది ప్రాకృత ఛందోనామం. ఈ ఏడు వందల గాథలు చెప్పిన వాళ్ళల్లో కవులే కాక కవయిత్రులు కూడా వున్నారు. ఈ గాథల్లో అమాయక గ్రామీణుల జీవితం, పల్లె ప్రజల సరస శృంగారం, జాతరలు, ప్రకృతి చిత్రణలు, పొలాలు, కృషీవలుర జీవితం చాలా రమ్యంగా చిత్రింపబడినాయి. ఇది ముక్తక కావ్యం. అంటే పద్యాల కూర్పుతో కూడిన ఏ గాథకు ఆ గాథ స్వతంత్రమైనది. తర్వాత కాలంలో ముక్తక కావ్యాలకు గాథాసప్తశతి ఆదర్శంగా నిలిచింది. శతక ప్రక్రియ ఇటువంటి ముక్తక కావ్యం నుంచి పుట్టిందే. విశేషమేమిటంటే బృహత్కథను బట్టి

మనకు ప్రజల భాష. 'దేశి' పేరుతో వుండేదని తెలుస్తున్నది. ఆ ప్రజల భాష తెలుగు అని మనం చెప్పుకోవచ్చును. ఇక గాథాసప్తశతిలో అక్కడక్కడ – అద్దం, పొట్టి, అత్త, పాడి, పిల్ల, కంటె, కరణి, పత్తి మొదలైన 'దేశి' అంటే తెలుగు పదాలు కన్పిస్తున్నాయి. దీన్ని బట్టి కూడా ప్రజలు మాట్లాడుకునే భాష 'తెలుగు' ఉండేదని తెలుస్తున్నది. శాతవాహనుల కాలంలో తెలుగు వాళ్ళు నాగార్జునాచార్యుడు, ఆర్యదేవులు బౌద్ధ గ్రంథాలు రచించారు. ఈనాటి శ్రీశైలం అప్పుడు శ్రీపర్వతంగా పిలువబడేది. ధాన్యకటకంలోనే కాక శ్రీపర్వతంలో విశ్వవిద్యాలయం ఉండేది. శ్రీపర్వతంలో నాగార్జునాచార్యుడు విశాలమైన గ్రంథాలయాన్ని స్థాపించాడు. దేశవిదేశాల విద్యార్థులు ఇక్కడ చదువుకునే వాళ్ళు. శాతవాహనుల రాజ్యం మహారాష్ట్ర వరకు విస్తరించకపూర్వం తెలంగాణ అంతటా విస్తరించిందని దొరికిన నాణాలను బట్టి తెలుస్తున్నది.

## శాతవాహనానంతర యుగం

శాతవాహనుల తర్వాత ఆంధ్రదేశాన్ని పాలించిన వాళ్ళు ఇక్ష్వాకులు (క్రీ.శ. 225–300) వేయించిన ప్రాకృత శాసనాల్లో 'తలవర' అనే బిరుదం కన్పిస్తున్నది. 'తలవర' తెలుగు పదం. అది ఇప్పుడు 'తలారి'గా రూపాంతరం పొంది వ్యాప్తిలో వుంది. ఇంకా ఆ తర్వాత తెలంగాణను పాలించిన విష్ణుకుండినుల (క్రీ.శ. 380–624) సంస్కృత శాసనాల్లో కొన్ని గ్రామాల పేర్లు, వ్యక్తుల పేర్లు తెలుగు భాషలో వున్నాయి. ఆ విధంగా తెలుగు భాష ఉనికి క్రీ.పూ. 3వ శతాబ్దం నాటికి అంధకుల నాణాల్లో 'అన' పద రూపంలో తర్వాత శాసనాల్లో గ్రామాల, వ్యక్తుల పేర్ల రూపంలో కన్పించగా తెలుగులో సాహిత్య సృజన తెలంగాణాలో వేములవాడ చాళుక్యుల (క్రీ.శ. 750–973) కాలంలో ఆరంభమై వికసించిందన్న ఆధారాలు కన్పిస్తున్నాయి. ఎన్నో తెలుగు కన్నడ సంస్కృత రచనలను కవులు రచించారు. ప్రధానంగా వేములవాడ చాళుక్యుల్లో రెండో అరికేసరి కాలం తెలంగాణలో తెలుగు సాహిత్యంలో "స్వర్ణయుగం" అని చెప్పుకోవాలె.

# వేములవాడ చాళుక్యయుగం

తీరాంధ్రంలో తూర్పు చాళుక్యులు రాయలసీమలో రేనాటి చోళులు, బాణులు, కాదంబులు, వైదుంబులు పరిపాలిస్తున్న కాలంలో తెలంగాణలో కరీంనగర్, నిజామాబాద్ ప్రాంతాలను మొదట బోధన్ (పోతన)ను తర్వాత వేములవాడను రాజధానిగా వేములవాడ చాళుక్యులు, ఖమ్మం వరంగల్ ప్రాంతంలో ముదిగొండ చాళుక్యులు ముదిగొండను రాజధానిగా పాలించారు. ముదిగొండ చాళుక్యులు తూర్పు చాళుక్యుల పక్షంలో నిలిచారు. వేములవాడ చాళుక్యులు రాష్ట్ర కూటుల పక్షం వహించి నిలిచారు. వేములవాడ చాళుక్యులు జైన శైవ మతాలను అభిమానించారు. కడప, కర్నూలు ప్రాంతాలను పాలించిన రేనాటి చోళులు మొదట పల్లవులు ఆ తర్వాత పశ్చిమ చాళుక్యుల పక్షంలో నిలిచారు. దాదాపు 300 సంవత్సరాలు 13 మంది రాజులు పాలించారు. ఇంతకుముందు ఆంధ్రదేశాన్ని తెలంగాణను పాలించిన శాతవాహనులు, ఇక్ష్వాకులు, విష్ణుకుండినులు ప్రాకృత సంస్కృత భాషల్లో శాసనాలు వేయించారు. రేనాటి చోళులు తెలుగు శాసనాలు వేయించి చరిత్రను సృష్టించారు. తెలుగులో మొట్టమొదటి శాసనం క్రీ.శ. 575 నాటి ధనంజయుని కలమళ్ళ శాసనం. రెండోది క్రీ.శ. 600 నాటి పుణ్యకుమారుని ఎఱ్ఱగుడిపాడు శాసనం. రేనాటి చోళులు మొత్తం తెలుగులో 33 శాసనాలు వేయించారు. అన్నీ దానశాసనాలే. ఈ శాసనాలు గేయ పద్ధతిలో వున్నాయి. తర్వాత తూర్పు చాళుక్యులు వేయించిన క్రీ.శ. 848 నాటి అద్దంకి శాసనం. దీన్ని తూర్పు చాళుక్య రాజు శ్రీ గుణగ విజయాదిత్యుని సేనాని పండరంగు విజయశాసనంగా వేయించాడు. ఇది ఒక తరువోజ ఛందస్సు నాలుగు పంక్తుల వచనంలో వుంది. పండరంగు వేయించిన మరో శాసనం క్రీ.శ. 848 నాటిదే కందుకూరు శాసనం. ఇది ఒక్క సీస పద్యంలో వుంది. తరువోజ దేశీ భరితంగా, సీసం సంస్కృత పదభరితంగా వున్నాయి. తర్వాత తెలుగులో వేయబడిన

మూడు శాసనాలు తెలంగాణలో వేయబడినాయి. ఇవి తెలుగు సాహిత్య చరిత్రలో చెప్పుకోదగిన ప్రాశస్త్యం వున్న శాసనాలు. తెలుగులో కావ్యరచన అప్పటికి జరిగిందని జాడలు చెప్తున్న శాసనాల్లో ఒకటి క్రీ.శ.935 నాటి కొరవి శాసనం. ముదిగొండ చాళుక్యరాజు నిరవద్యుడు వేయించిన శాసనం. ఈ శాసనం గద్యంలో వుండటం విశేషం.

*"గల కలావర్తంబు రా*
*జ్యంబు సేయుచు నిష్థ (ష్ట)వి*
*షయ కామ భోగంబుల*
*నుభవించుచు సుఖంబు*
*ణ్డి యొక్క నాణ్డు కొరవి నల్ల*
*మేఱెయ కొడుకు పెద్ద*
*రావించి నీవు నా ప్రాణ స*
*మానుణ్డవైన చెలివి నీ*
*చేసిన యుపకారంబు నా*
*కు బ్రత్యుపకారంబు సేయ*
*వలయుంగాన నీకేమి వ*
*లయుం దాని వే*
*ణ్డికొమ్మన్న..."*

చక్కని కథనశైలిలో ఈ శాసనంలోని వచనం సాగింది. సామాన్యంగా కావ్యాల్లో అంకితంగా కావ్యాన్ని పొందే వ్యక్తి కవిని పిలిచి కావ్యరచన చేయమని అర్థించినట్లుగా కావ్యావతారికల్లో కన్పించే వచన రచనా పద్ధతిలో వుంది ఈ వచన రచన. ఈ శాసనం నన్నయ్య మహాభారతం రచనకు వంద సంవత్సరాల పూర్వం వ్రాసింది. సంస్కృత దేశ్యపదాల కూర్పుతో 'రగడ' ఛాయలతో నడిచింది. ఈ శాసనాన్ని వేయించిన నిరవద్యుడు వేములవాడ చాళుక్యరాజు రెండో అరికేసరికి సమకాలికుడు.

రెండో అరికేసరి పై శాసనాన్ని వేయించిన నిరవద్యుని తొలగించి అతని అన్న గొణగయ్యను సింహాసనం మీద కూర్చుండ బెట్టాడని చరిత్ర చెప్తున్నది. కొరవి శాసనం రెండో అరికేసరికి సమకాలికమైంది. దీన్నిబట్టి రెండో అరికేసరి నాటికి కథనశైలిలో చక్కని వచన రచన వికసించిందని నిరవద్యుని ఈ శాసనం వల్ల తెలుస్తున్నది. తెలంగాణలో వేయబడిన రెండో శాసనం క్రీ.శ. 1000 నాటిదైన విరియాల కామసాని మల్లభూపతి మల్లేశ్వర స్వామి ప్రతిష్ఠ చేసిన సందర్భంలో వేయించిన గూడూరు శాసనం. తెలుగులో మొదటిసారిగా వృత్త పద్యాలు కన్పిస్తున్నాయి. దీనిలో ఉత్ప్రేక్ష, రూపకాది మూడు చంపకమాలలు, రెండు ఉత్పలమాలలున్నాయి. చక్కని పదబంధంతో అలంకారాలతో తెలుగులో కావ్యశైలి 10వ శతాబ్దం నాటికి వాడుకలో వున్నదని ఈ శాసనం వల్ల తెలుస్తున్నది. దీన్నిబట్టి తెలుగు కావ్యరచనకు పరిపక్వమైందని అభిప్రాయం బలపడ్తున్నది. విరియాల కామసాని గూడూరు శాసనంలోని పద్యాలు-

*చం॥ అనుపమ దుర్జయాన్వయ సుధాబ్ధి ననేకులు రాజనందనుల్*
*సనినబొరంటి వెన్నడను సంభవుడయ్యె నతి ప్రసిద్ధుడై*
*వినుత విరోధి మండలికి వెన్నను వెన్నడు వోలె వానికిన్*
*ఘనుడగు నెఱ్ఱ భూపతి జగద్వి దితుండుదయించె గీర్తితోన్*

*ఉ॥ భావితకీర్తి నాతనికి బాండవ మధ్యమ భీముడోయనన్*
*గా విరియాల భీమ నృప ఘస్మరుడై జనియించె వానికిన్*
*భూవినుతుండు మండలిక భూషణుడెఱ్ఱ నరేంద్రు డుత్తమ*
*శ్రీ వినుతుండు బంధుజన సేవ్యుడు దా వినుతించె నున్నతిన్*

*చ॥ అత డని బొట్టబేత వసుధాధిపు జేకొని, వాని వైరి ను*
*ద్ధితముగ జంపి యాకొరవి దేశమునందు ప్రతిష్ఠ చేసి త*
*త్తనయుడు పేరు పొడగల దాయము బిట్టర గద్యనంబులు*
*ప్రతిముడు వాని (దా) మొగడు పల్లియు పంద్రెండు నేలు నిప్పుడే*

*చ॥ అరుదగునట్టి యెఱ్ఱ నృపునంగన కామమసాని యొక్క మే*
*ల్గరుడని బేతభూవిభునిగా గతి వల్లభు బిన్నవాని దా*
*బరగగ జేతబట్టి ఘను బల్లవరాయని యన్వయాబ్జ భా*
*స్కరవిభు చక్రవర్తిగని కాకతి నిల్పుట కోటి సేయదే*

*ఉ॥ కాల(కర) కాలుడై పడసె కాడయ నాయకు జంపి సూరడ*
*వ్వేలుపు గొండ రవ్వనృపు వేలుపు గొండన నిల్పి వాని చే*
*మేలుగ మూడు ముప్పయిని మేలుగ నేరెడు బోదిపాడు నుం*
*మేలుగ టేకు మావిడులు మేలుగ రెండయరాజు సంగడై*

*సూత్రధారి కొమ్మోజు బరహ శ్రీశ్రీశ్రీ, అడవగట్టు దేవరకుజేసు*

విరియాల కామసాని శత్రు వినాశనం చేసి కాకతి బేతయను కాకతి గద్దెమీద సుప్రతిష్ఠుని చేసినట్లుగా ఈ శాసనంలో చెప్పుకున్నది. ఇక్కడ శత్రువులు ముదిగొండ చాళుక్యులే అయివుంటారు. ఎందుకంటే తర్వాతకాలంలోని క్రివ్వక శాసనాన్ని బట్టి కాకతి రుద్రదేవుని దండయాత్రతో ముదిగొండ చాళుక్యుల వంశం అంతరించింది. చివరి రాజులు వేంగి చాళుక్యుల దగ్గర తలదాచుకున్నారని చరిత్ర చెప్తున్నది. మొత్తంమీద క్రీ.శ.1000 నాటికి అంటే నన్నయ మహాభారత రచనకు యాభై సంవత్సరాలకు పూర్వమే తెలుగులో ఆలంకారిక శైలిగల పద్యరచన వున్నట్లు తెలంగాణలో దొరికిన ఈ శాసనాన్ని బట్టి తెలుస్తున్నది. క్రీ.శ.935 అంటే నన్నయకు వందేండ్లకు పూర్వమే తెలంగాణలో చక్కని కావ్యరచన చేయగల రచనాశైలి వికసించిందని తెలుస్తున్నది. వేములవాడ చాళుక్యుల కాలంలో "కవిజనాశ్రయం" వంటి ఛందోగ్రంథం రచింపబడింది. దాన్నిబట్టి తెలంగాణలో 8, 9 శతాబ్దాల నాటికి తెలుగులో కావ్యరచన జరిగిందని ఆ రచనలు జైన కవులు రచించినయి కావచ్చునని చెప్పవచ్చును. ఇక ముందు కూడా వేములవాడ చాళుక్యుల కాలంలో తెలుగులో ఏమేమి రచనలు వచ్చాయో చర్చించటానికి పూర్వం క్రీ.శ.945లో పంపకవి తమ్ముడు జినవల్లభుడు వేయించిన కుర్క్యాల శాసనంలోని కందపద్యాలను గురించి తెలుసుకుందాం. ఇది తెలంగాణలోని మూడో శాసనం–

*కం॥ జినభవనము లెత్తించుట / జిన పూజల్ సేయుచున్కి జినమునులకు న*
*త్తిన యన్న దానంబీవుట/ జినవల్లభు బోలగలరె జినధమ్మ పరుల్*

*కం॥ దినకరు సరి వెల్గుదుమని/జినవల్లభు నొట్టు నెత్తు జిత కవి వనకున్*
*మనుజుల్ గలరే ధాత్రిన్ / వినుతిచ్చుదుననియవృత్త విబుధ కవీంద్రుల్*

*కం॥ ఒక్కొక్క గుణము కల్గుదు/ రొక్కటగా కొక్కలక్క లేరెవ్వరికిన్*
*లెక్కింప నొక్కలక్కకు/ మిక్కిలి గుణపక్షపాతి గుణమణిగణంబుల్*

రెండో అరికేసరి పాలనాకాలంలో జినవల్లభుడు వేయించిన ఈ శాసనంలో సంస్కృత కన్నడ పద్యాలతో పాటు తెలుగులో మూడు కంద పద్యాలున్నాయి. కందం అచ్చమైన తెలుగు ఛందస్సు, దేశిఛందస్సు. తెలుగులో కందం చెప్పేవాడే కవి అని లోకోక్తి వుంది. దాన్నిబట్టి తెలుగులో కందానికున్న ప్రాధాన్యం తెలుస్తున్నది. కుర్క్యాల శాసనంలో మొదటిసారిగా తెలుగు కందపద్యాలు కన్పిస్తున్నాయి. ఇది దేశి సంస్కృత పదాలతో కూడిన సరళమైన శైలి. జినవల్లభుడు కరీంనగర్ జిల్లాలోని గంగాధర కుర్క్యాలలకు మధ్య "త్రిభువన తిలకమ"నే వసతిని నిర్మించుకొని నివసించేవాడు. జినవల్లభుడు జైనులకు జైనమునులకు అన్నదానం చేసేవాడు. జైనాలయాలను నిర్మించాడు. మదనవిలాసమనే తోటను వేయించాడు. పంపకవికి కవితాగుణార్ణవుడని బిరుదముంది. జినవల్లభుడు ఒక చెరువును తవ్వించి దానికి గుణార్ణవమనే పేరు పెట్టాడు. ఎన్నో పుణ్యకార్యాలు చేసాడు.

వేములవాడ చాళుక్యుల కాలంలో తెలంగాణలో జైనమతం విస్తరించివుంది. పొట్ల చెరువు, కొలనుపాక, వర్ధమానపురం, పోతన, వేములవాడ, కుర్క్యాలలో జైన వసతులుండేయి. జైనంలో వసతులంటె జైనమునులు నివసించే చోటులు, జైన ధర్మాన్ని బోధించే పాఠశాలలు. జైనమతాభిమానులైన వేములవాడ చాళుక్యుల ఆశ్రయంలో సంస్కృతం, కన్నడం, తెలుగు సాహిత్యాలు ఆదరణ పొంది వికసించాయి. కన్నడంలో ఆదికవి పంపడు కన్నడ ఆదికావ్యం "విక్రమార్జున విజయం" కావ్యం రచించి దానిలో రెండో అరికేసరికి అర్జునునికి అభేదం చేసి వర్ణించాడు. రెండో

అరికేసరి సాహిత్యప్రియుడే కాక గొప్పవీరుడు. ఆయన రాష్ట్రకూట సింహాసనం కోసం తగాదా రాగా గోవిందున్ని పరాక్రమంతో అనేక యుద్ధాల్లో ఎదిరించి పోరాడి బద్దెగుని పక్షం వహించి అతన్ని సింహాసనస్థుని చేసాడు. (రాష్ట్రకూట రాజుల పేర్లను వేములవాడ చాళుక్యులు పెట్టుకున్నారు.) బద్దెగుడు రాష్ట్ర కూట రాజు పేరే. పరాక్రమవంతుడైనందుకే పంపకవి రెండో అరికేసరిని అర్జునునితో పోలుస్తూ కావ్యం రచించి వుంటాడు. పంపకవి 'ఆదికావ్యం' పేరుతో ఆది జైనతీర్థంకరుడైన వృషభదేవుని చరిత్రను రచించాడు. రెండో అరికేసరి పంపనికి ప్రసిద్ధ ధర్మక్షేత్రం ధర్మపురిని అగ్రహారంగా దానం చేసాడు. అ విధంగా జైనాభిమాని అయిన అరికేసరి జైన కవి పంపనను కన్నడంలో ఆదికవిని సన్మానించాడు. దండనాథునిగా ఆదరించాడు. వేములవాడ చాళుక్యులు జైనమతాన్ని అభిమానించారు. జైనకవులను పండితులను ఆదరించారు. అందుచేతనే తెలంగాణలో నన్నయకు పూర్వయుగాన్ని సాహిత్యంలో "జైనయుగం" అని చెప్పవచ్చును. ఎన్నో రచనలు తెలుగులో వచ్చాయి. కాబట్టి సాహిత్యంలో వేములవాడ సాహిత్య యుగం అని చెప్పాలి. వేములవాడ చాళుక్యుల యుగంలో జైనమత వ్యాప్తితో తెలుగులో వచ్చిన జైనులు రచించిన రచనలను గురించి ఒకసారి విహంగ వీక్షణం చేసి తెలుసుకుందాం!

తెలుగు కావ్యాల నుంచి తీసుకున్న పద్యాల సంకలన గ్రంథం 'ప్రబంధ రత్నావళి'. క్రీ.శ. 1530 నాటిదైన ఈ ప్రాచీన కావ్య సంకలన గ్రంథంలో పేర్కొనబడిన పద్మకవి – పంపకవి అని, సర్వదేవుడు – పొన్నకవియే అని నిడదవోలు వేంకటరావు గారు దాని రెండో ముద్రణకు వ్రాసిన పీఠికలో అన్నారు. కన్నడ సాహిత్య చరిత్రలో పొన్నకవికి సర్వదేవుడన్న బిరుదున్నదని వ్రాసారు. తెలుగులో కవిత్రయం ఉన్నట్లు కన్నడంలో రత్నత్రయం వున్నారు. కన్నడ రత్నత్రయంలో రెండోకవి పొన్నడు. ప్రబంధ రత్నావళిలో పద్మకవి జినేంద్ర పురాణం నుంచి ఒక సీసపద్యం మందర పర్వత వర్ణనతో కూడింది ఉదాహరింపబడింది. ఆ వర్ణన రమ్యంగా కావ్యశైలిలో వుంది. పంపకవి తన గురువైన జినేంద్రముని చరిత్రను తెలుగులో వ్రాసాడని పద్మ అన్నది పంపకు రూపాంతరమైన పేరు అని నిడదవోలు వారి అభిప్రాయం.

అదే విధంగా సర్వదేవుడన్నది పొన్నకవికి బిరుద నామమనీ, ప్రబంధ

రత్నావళిలోని సర్వదేవుడు పొన్నకవియే అని నిడదవోలువారి అభిప్రాయం. పంపకవి అంటే పొన్నకవికి అభిమానం. ఆ అభిమానంతోనే అతని కన్నడ ఆది పురాణాన్ని పొన్నకవి ఆంధ్రీకరించాడని అన్నాడు. ఆదిపురాణం నుంచి ఒక మత్తేభం ఒక కందం ప్రబంధ రత్నావళిలో ఉదాహరింపబడినాయి. కావ్యశైలిలో చంద్రోదయ వర్ణన ఈ పద్యాల్లో రమ్యంగా చేయబడింది. పొన్నకవి కన్నడంలో "గదాయుద్ధం, అజితపురాణం" రచించాడు. "గదాయుద్ధం" భీముని కథానాయకునిగా చేసిన మహాభారత కథనే.

క్రీ.శ. 850-1000 మధ్యకాలంలో జైనకవులు తెలుగులో కావ్యాలు రచించారని "నన్నయ్యకు పూర్వము తెలుగులో సాహిత్యమున్నదనియు నది జైన సాహిత్యమనియు మొదటిసారిగా నిరూపించునది ప్రబంధ రత్నావళి" అని నిడదవోలు వేంకటరావుగారు దాని పీఠికలో వ్రాసాడు. జైనుల కావ్యాలను నన్నయ ఒక అర్రలో వేసి కాల్చివేసాడని ఐతిహ్యం. ఈ ఐతిహ్యాన్ని బట్టి తెలుగులో కన్నడ, తమిళంలో వలె జైనులు కావ్యాలు రచించారని వాటిని వైదికాభిమానులు నిరాదరించి నష్టం చేసారని తెలుస్తున్నది. దీన్ని వీరేశలింగం పంతులు తన ఆంధ్రకవుల చరిత్రలో గ్రంథస్థం చేసాడు కూడా.

## వేములవాడ భీమన

వేములవాడలో వెలిసిన మరో ప్రసిద్ధ కవి భీమన. వేములవాడ భీమకవిగా ప్రసిద్ధి చెందాడు. కవిజనాశ్రయమనే ఛందోగ్రంథాన్ని తెలుగులో రచించాడు. ఇది "భీమన ఛందము" పేరుతో ప్రసిద్ధమైంది. లోకంలో వేములవాడ భీమకవిని గురించి ఎన్నో కథలు ప్రచారంలో వుండడమే కాక ప్రాచీన కవిస్తుతిలో కూడా అతని పేరు వుంది. శ్రీనాథుడు "వచియింతు వేములవాడ భీమనభంగి నుద్దండ లీల" అన్నాడు. దాన్ని బట్టి భీమన కవిత్వం ఉద్దండరీతిలో వుండేదని తెలుస్తున్నది. శ్రీనాథుడు (క్రీ.శ. 1380-1450) నన్నయ కన్నాముందుగా భీమనను స్తుతించటం చేత భీమన నన్నయకు పూర్వుడని చెప్పవచ్చును. భీమన శాపానుగ్రహ సమర్థుడని వశ్యవాక్కు గల కవి అని ప్రచారంలో వున్న కథలు చెప్తున్నాయి. అతని చాటువులుగా ఎన్నో పద్యాలు వ్యాప్తిలో వున్నాయి. అవన్నీ అతనివే అని చెప్పలేము. అతని పేరుమీద రాఘవ పాండవీయం, నృసింహ పురాణం, హరవిలాసం, సుమతి శతకం, శతకంధర

రామాయణం మొదలయిన రచనలెన్నో విన్పిస్తున్నాయి. అవన్నీ ఆధారాలు లేంది ఒక్క కవే రచించాడని చెప్పలేము. భీమన కవిజనాశ్రయం రచించాడనడానికి ఆధారాలున్నాయి. వార్తాకవి రాఘవయ్య, అప్పకవి (క్రీ.శ. 1650) భీమనను కవిజనాశ్రయ కర్తగా పేర్కొన్నారు. ఆంధ్రకవి రామయ్య "ఛందో నిబంధనాచాతురీ ధౌరేయ వాగ్ధాము వేములవాడ భీము"న అని స్తుతించాడు. 'వేములవాడం జరించి వేములవాడన్ దా మెరిసిన భీముని బలభీము వినుత భీము' అని కొరవి గోపరాజు స్తుతించాడు. ఇంకా మొల్ల, పింగళి సూరన, చిత్రకవి పెద్దన మొదలయిన ప్రాచీన కవులు భీమనను స్తుతించారు. "లాక్షణికులు కూడా పెక్కురు కవిజనాశ్రయము వేములవాడ భీమకవి రచితమని ఉదాహరించెదరు" అని ప్రబంధ రత్నావళి పీఠికలో వేటూరి ప్రభాకరశాస్త్రి గారన్నారు.

భీమన వేములవాడలో జన్మించాడు. 'వేములవాడ' అన్న పేరు శాసనాల్లో ప్రజల నోళ్ళల్లో వేములవాడ, లేములవాడ, లేంబులవాడ అని ప్రచారంలో వుంది. పల్లె ప్రజలు ఇప్పటికి 'ఏముడాల' అంటారు."లేములవాడ భీమ భళిరే కవిశేఖర సార్వభౌమ" అని చాటుపద్యం. ఇప్పటికి ప్రజల నోళ్ళలో లేములవాడగా ప్రసిద్ధి చెందిన వేములవాడను రాజధానిగా చేసుకొని పాలించిన చాళుక్య రాజుల్లో మొదటి బద్దెగుడు (క్రీ.శ. 870-895) ప్రసిద్ధుడైన రాజు. అతడే వేములవాడలో భీమేశ్వరాలయాన్ని నిర్మించాడు. అది వేములవాడ చాళుక్యుల శైలిలో నిర్మింపబడిన ఆలయం. ఆ తర్వాత రెండో అరికేసరి (క్రీ.శ. 930-995) వేములవాడలో రాజరాజేశ్వరాలయాన్ని నిర్మించాడు. అది ఇప్పటికీ ప్రసిద్ధంగా వుంది. బద్దెగునికి 'సోలదగండ' అంటే అపజయమెరుగని వీరుడని బిరుదముంది. కొరవి శాసనంలో వేంగి చాళుక్య భీముని బంధించినట్లుగా చెప్పబడిందీ బద్దెగుడే. పంపకవి విక్రమార్జున విజయంలో బద్దెగుడు భీమనృపతి గర్వం దింపిన వాడుగా వర్ణింపబడినాడు. బద్దెగుడు నిర్మించిన భీమేశ్వరాలయం ప్రసిద్ధమైంది. ఇప్పటికీ పూజలందుకుంటున్నది. ఈ భీమేశ్వరుని అనుగ్రహం వల్లనే ఒక బ్రాహ్మణ వితంతువుకు భీమన పుట్టాడని ఆ దేవుడతన్ని వశ్యవాక్కుగా దీవించాడని ఐతిహ్యం. వితంతువు కొడుకైన భీమనను బ్రాహ్మణులు వేధించారనీ అయినా భీమన చలించలేదని కథలు వ్యాప్తిలో వున్నాయి. ఈ భీమన

గొప్ప కవి అని కూడా కథలున్నాయి. ఆ భీమనే కవిజనాశ్రయుడు, శ్రావకాభరణుడనే బిరుదాలున్న మల్లియ రేచన ఆశ్రయంలో కవిజనాశ్రయాన్ని రచించాడు. నన్నయ రాజరాజుకు మహాభారతాన్ని అంకితంగా ఇయ్యలేదు. రాజరాజ నరేంద్రుని సంబోధిస్తూ భారతాన్ని రచించాడు. అదేవిధంగా భీమన కవిజనాశ్రయుడైన రేచనను సంబోధిస్తూ కవిజనాశ్రయం చెప్పాడు. కాని అంకితంగా ఇయ్యలేదు.

కవిజనాశ్రయంలో ఎన్నోచోట్ల జైనమత ప్రసక్తి వుంది. దాన్ని శైవుడైన భీమన వ్రాసాడనటం అసంగతమని అప్పకవి "వికటకవులు కొన్ని వింతలు కల్పించి కవిజనాశ్రయమున కలిపినారు" అని అన్నాడు. భీమన శైవుడైనా జైనాన్ని అభిమానించి వుంటాడు. ఆ కాలంలో ఎందరో వేద పారంగతులైన పంపకవి వంటి వాళ్ళు జైనాన్ని స్వీకరించారు. కాబట్టి జైనమత ప్రాబల్యం గురించి తెలియని కాలంలో అంచనా వేయలేని కాలంలో విమర్శకులు ఏవేవో ఊహలు మార్పులు చేయటం జరిగింది. దాంతో నిర్ణయించలేని గందరగోళమేర్పడింది. రేచనకు కవిజనాశ్రయుడని బిరుదమున్నట్లు కవిజనాశ్రయం గద్యంలో వుంది. అటువంటప్పుడు రేచన తన పేర తనే గ్రంథం రచించుకున్నాడనటం కంటే అతని ఆశ్రయంలో భీమన రచించాడనడమే సమంజసం. "వేములవాడను వెలసిన భీమేశ్వరు కరుణ గల్గు భీమసుకవి నే గోమటి రేచన మీదను నీ మహి కవులెన్న ఛందమెలమి రచింతున్" అని కవిజనాశ్రయంలోని పద్యంలో వుంది. కాబట్టి కవిగా లోకంలో గాథలు చెప్పబడే భీమనే కవిజనాశ్రయకర్త అని చెప్పడం సమంజసం. బద్దెగునికి పూర్వమే తెలుగులో పద్యశాసనాలు వున్నాయి. అంటే తెలుగులో పద్య విద్య స్థిరపడింది. అటువంటప్పుడు భీమన తెలుగు ఛందస్సు లక్షణాలను వివరిస్తూ తెలుగులో ఛందోగ్రంథాన్ని వ్రాసాడంటే కాదని నిరాకరించడం నన్నయకు పూర్వం ఛందోగ్రంథం వెలిసిందంటే కాదనడం సమంజసం కాదేమో.

కవిజనాశ్రయాన్ని ప్రచురించిన మానవల్లివారు, జయంతి రామయ్య పంతులు గారు భీమన కృతిగానే అంగీకరించారు. రేచనే కవిజనాశ్రయం చెప్పాడనుకుంటే తన గురించి తనే "సుగుణ సుందర తరుణీస్మరనిభుడు, వారస్త్రీ సంసేవ్యదక్షుడు, సుందరీవశ్య విద్యామణి" వంటి విశేషణాలను వేసుకోడు. కొరవి గోపరాజు భీమనను 'బలభీము' అని స్తుతించాడు. తర్వాత మధ్వాచార్యులు మధ్వ మతంలో శరీర సౌష్ఠవానికి ప్రాధాన్యం ఇచ్చాడు. భీముని అవతారంగా కీర్తింపబడినాడు. అది జైన ప్రభావం

వల్ల వచ్చిందే కావచ్చును. జైనంలో శరీర సౌష్ఠవానికి ప్రాధాన్యమిచ్చారు. పంపకవి తన దేహ సౌందర్యాన్ని గురించి కావ్యాలలో చెప్పుకున్నాడు. "వనితా కటాక్షకువలయవన చంద్రుడు" వంటి విశేషగుణాలున్నాయి. పంపకవి సమాధి ఇప్పటికీ బోధన్‌లో వుంది.

తెలంగాణలోని వేములవాడ ప్రసిద్ధి తెలియని కాలంలో 'వేములవాడ భీమన' ప్రసిద్ధమైన ద్రాక్షారామంతో పండితులు ముడిపెట్టి వుంటారు. వేములవాడలో కూడా ప్రసిద్ధంగా భీమేశ్వరాలయముందని తెలియని వాళ్ళు వేములవాడ భీమన ద్రాక్షారామ భీమేశ నందనుడని చెప్పి వుంటారు. కాని భీమన తెలంగాణలోని వేములవాడ భీమన అనటమే సత్యం. మొదట తెలుగు ఛందోగ్రంథం తెలంగాణలోనే వ్రాయబడింది.

## సోమదేవ సూరి

రెండో అరికేసరి కాలంలోనే ఉత్తర భారతం గుజరాతు నుంచి సోమదేవసూరి అనే జైనకవి వచ్చి వేములవాడలో ఆశ్రయం పొందాడు. సోమదేవ సూరి సంస్కృతంలో ప్రసిద్ధమైన "యశస్తిలకచంపు" అనే కథా కావ్యాన్ని వ్రాసాడు. దాన్నతడు క్రీ.శ. 959లో రెండో అరికేసరి పెద్ద కొడుకు వాగరాజు (క్రీ.శ. 955-960) కాలంలో పూర్తి చేశాడు. నీతికావ్యమనే రాజనీతి గ్రంథాన్ని సంస్కృతంలో రచించాడు. సోమదేవ సూరి రెండో బద్దెగుని కాలంలో కూడా వున్నాడు. అతనికి విద్యాగురువు. ఈ బద్దెగుడు సోమదేవ సూరికి వేములవాడలో శుభదామమనే పేరుతో జినాలయాన్ని నిర్మించి ఇచ్చాడు. రెండో బద్దెగుని కొడుకు మూడో అరికేసరి కాలంలో కూడా సోమదేవసూరి వున్నాడు. శుభదామజినాలయానికి అతడు క్రీ.శ. 966లో నైవేద్యార్థం రేపాక గ్రామాన్ని దానంగా ఇచ్చాడు. ఆ విధంగా సోమదేవసూరి మూడుతరాలు జైన గురువుగా వ్యవహరించాడు.

## బద్దెగుడు (బద్దెన)

తెలుగు సాహిత్య చరిత్రలో బద్దెన అనే భూపాలుడు నీతి శాస్త్రముక్తావళి, సుమతీ శతకం కర్తగా చెప్పబడుతున్నాడు. వేములవాడ చాళుక్యుల్లో ముగ్గురు రాజులు బద్దెగ పేరుతో కన్పిస్తున్నారు. భీమేశ్వరాలయం నిర్మాత మొదటి బద్దెగుడు క్రీ.శ. 870-895. రెండో బద్దెగుడు పంపకవి ఆశ్రయదాత రెండో అరికేసరి కొడుకు. క్రీ.శ. 960-96 మధ్య పాలించాడు. మూడో బద్దెగుడు ఈ వంశంలో చివరి రాజు.

సోమదేవసూరి సంస్కృతంలో రచించిన నీతి కావ్యాన్నే రెండో బద్దెగుడు "నీతిశాస్త్ర ముక్తావళి" పేరుతో తెనిగించాడేమో. అతని కాలంలోనే భీమన కవి కూడా వుండి వుంటాడు. అందుకే సుమతీ శతకం బద్దెగుని రచనగాను, భీమన రచనగాను చెప్పబడుతున్నది. ఇద్దరిలో ఎవరో ఒకరు సుమతీ శతకాన్ని వ్రాసి వుంటారు. జినవల్లభుని కుర్క్యాల శాసనంలో కందపద్యాలు కన్పిస్తున్నాయి. సుమతీ శతకం కందాల్లోనే వుండడం గమనించవలసిన విషయం. వేములవాడ భీమకవి ఒక సుమతీ శతకాన్ని రచించాడని కూచిమంచి తిమ్మకవి తన సర్వలక్షణ సారసంగ్రహంలో పేర్కొన్నాడు. కంద పద్యాల్లో వున్న సుమతీ శతకం జినవల్లభుని రచన కూడా కావచ్చును. సుమతీ శతకం జైనుల రచన అని వంగూరి సుబ్బారావు 1920లో వ్రాసిన "ఆంధ్రవాఙ్మయ చరిత్ర"లో అభిప్రాయపడినాడు. తెలుగులో రెండో సాహిత్య చరిత్రను రచించిన గురజాడ శ్రీరామమూర్తి "కవి జీవితములు" (1913)ను కవుల కాలాన్నిబట్టి వ్రాస్తూ వేములవాడ భీమకవితో కవుల జీవితం ఆరంభించాడు. సుమతీ శతకాన్ని జినవల్లభుడు, బద్దెగుడు, భీమన –ముగ్గురిలో ఎవరో ఒకరు రచించి వుంటారు. లోకంలో సుమతీ శతకాన్ని బద్దెన రచన అని ప్రచారంలో వుంది కాబట్టి రెండో బద్దెగుడు రచించాడనటం సర్వసమ్మతంగా వుంటుంది. మొత్తం మీద సుమతీ శతకం వేములవాడ చాళుక్యరాజు రెండో అరికేసరి కాలం నాటి రచన అనటం నిర్వివాదాంశం. వేములవాడ చాళుక్యరాజుల్లో చివరి రాజు మూడో బద్దెగుడు (క్రీ.శ.1052). అతన్ని కాకతి మొదటి ప్రోలరాజు పారదోలినట్టు కాజిపేట శాసనం వల్ల తెలుస్తున్నది. దాంతో వేములవాడ చాళుక్య వంశ రాజ్యం అంతరించింది. కాబట్టి రాజ్యాస్థిరతతో వున్న మూడవ బద్దెగుని కన్నా రెండో బద్దెగుడు నీతిశాస్త్ర ముక్తావళి రచయిత అని చెప్పడం సమంజసంగా వుంటుంది. కన్నడ రత్నత్రయంలో వాళ్ళయిన పొన్న, రన్న కవులనాదరించిన మల్లపయ్య కూతురు అత్తిమబ్బె (అత్తిమాంబ) ఆ కాలంలోనే ఉంది. భీమనకాశ్రయమిచ్చిన కవిజనాశ్రయ రచనకు ప్రోత్సహించిన మల్లియ రేచన మల్లపయ్య కొడుకు అత్తిమబ్బె సోదరుడై వుంటాడు. అత్తిమబ్బె కూడా సాహిత్యాభిమాని. కవులనాదరించింది. వాళ్ళది వైశ్యకులం. వైశ్యులు చాలామంది ఆ కాలంలో జైనమతావలంబులు. వైశ్యుల లాగానే యజ్ఞోపవీతాలను ధరించే పంచాణంవాళ్ళు విశ్వకర్ములు కూడా ఆ కాలంలో జైనులే.

తర్వాత జైన మతానికి ఆదరణ తగ్గి వీరశైవం విజృంభించిన కాలంలో వాళ్ళంతా శైవులైనారు.

వేములవాడ చాళుక్యులు కన్నడ, తెలుగు, సంస్కృత భాషలను సాహిత్యాలను అభిమానించారు. ఒక్క కుర్క్యాల శాసనంలో కన్నడ, సంస్కృతాలతో పాటు 3 తెలుగు కందపద్యాలున్నాయి. వేములవాడ చాళుక్యులు రాష్ట్ర కూటులతో వియ్యమందుకొని వాళ్ళతో ఘనిష్ఠ సంబంధాలు పెట్టుకున్నారు. అందుకేనేమో వాళ్ళు కన్నడ భాష నెక్కువగా అభిమానించి పంపాదికవుల నాదరించారు. శాసనాలను కన్నడంలోనే ఎక్కువ వేయించారు. కొన్ని మాత్రమే సంస్కృతంలో వున్నాయి. కవులకు పండితుల కాశ్రయమిచ్చి పోషించారు. సాహిత్య కృషికి దోహదం చేశారు. జైన శైవ మతాల నవలంబించారు. అనేక జైనాలయాలను, శైవాలయాలను నిర్మించి శిల్పకళను పోషించారు. అనేక గ్రామాలను కవి పండితులకు జైనాచార్యులకు దానంగా ఇచ్చారు. గోదావరి, మంజీర, మానేరు, ప్రాణహితా నదుల పరీవాహక ప్రదేశంలో వున్న వాళ్ళ రాజ్యం సారవంతమైన భూములతో కూడింది. అంతేకాక వాళ్ళు నదులపై ఆనకట్టలు నిర్మించి కాలువలు తవ్వించి నీటిపారుదల వసతులు కల్పించారు. దాంతో పంటలతో దేశం సుభిక్షంగా వుంది. “సిరిసిల్ల” – సిరి అంటే సన్నని, సిల్ల – సెల్ల అంటే వస్త్రాలని అర్థం. ఆనాటి సిరిసెల్లలో పల్చని నాజూకైన వస్త్రాలను నేసే నేతగాండ్లు వుండేవారేమో. వేములవాడ సమీపంలో వున్న ఆ గ్రామం అపురూపమైన వస్త్రాల నేతకు కేంద్రమై, అక్కడి నుంచి వస్త్రాలు విదేశాలకు ఎగుమతి అయి దేశ విదేశీ వాణిజ్యం జరిగేది కావచ్చును. ఆనాడు వర్తక సంఘాలుండేయని తెలుస్తున్నది. వేములవాడలోని ‘వాడ’ పేరును బట్టి అది బెజవాడ లాగానే వర్తక కేంద్రంగా వుండేదని చెప్పవచ్చు. వర్తక సంఘాలను “నకరము”లనే వాళ్ళు. వేములవాడలో నకరేశ్వరాలయముంది. అది వర్తక సంఘం నిర్మించిన ఆలయమై వుంటుంది. దాన్నిబట్టి వర్తక సంఘం సమృద్ధితో వుందని చెప్పవచ్చు. అనేక ఆలయాల నిర్మాణాలతో జైన శైవ మతాల వికాసంతో వాణిజ్య సమృద్ధితో సాహిత్యాభివృద్ధితో వేములవాడ చాళుక్యుల పాలన తెలంగాణ చరిత్రలో విశేషమైంది. సాహిత్యంలో స్వర్ణయుగం అని చెప్పుకోదగింది.

## శతక సాహిత్యం

శతకాలు సంస్కృత సాహిత్యంలో ముక్తకకావ్య ప్రక్రియలో చేరుతాయి. తెలంగాణలో రచింపబడిన ప్రాకృత ముక్తక కావ్యమైన గాథా సప్తశతిలో (క్రీ.శ. 1వ శ.) 700 గాథలున్నాయి. అదే విధంగా సంస్కృతంలో గోవర్ధనాచార్యుని (క్రీ.శ. 1116) ఆర్యా సప్తశతిలో 700 ఆర్యా ఛందస్సులో శ్లోకాలున్నాయి. ఇవన్నీ శృంగార రసభరితమైనయి. వేంకటాధ్వరి (క్రీ.శ. 1650) లక్ష్మీ సహస్రంలో 1000 శ్లోకాలున్నాయి. దీనిలో లక్ష్మి విష్ణువుల స్తుతి భక్తి పూర్వకంగా వుంది. ఈ విధంగా ముక్తక కావ్యాల్లో వందల కొద్దీ శ్లోకాలున్న రచనలున్నాయి. ఇవేగాక సంస్కృతంలో శతకం పేరుతో ముక్తక కావ్యాలున్నాయి. బాణుని (క్రీ.శ. 7వ శ.) చండీశతకం, మయూరుని (క్రీ.శ. 7వ శ.) సూర్య శకతం. చండీ శతకంలో 48 శ్లోకాలే వున్నాయి. సూర్య శతకంలో 100 శ్లోకాలున్నాయి. రెండు కూడా స్రగ్ధరా వృత్తాల్లో వున్నాయి. తర్వాత భర్తృహరి రచనలకు శతకాలని పేరు. అవి నీతి శృంగార వైరాగ్య శతకాలు. వాటిల్లో క్రమంగా నీతిని బోధించే శతకంలో 109 శృంగార వైరాగ్యాలను బోధించే శతకాల్లో 100 చొప్పున శ్లోకాలున్నాయి. అమరుకుని అమరుక శతకంలో 115 శ్లోకాలున్నాయి. ఇవి శృంగార రసభరితమైనయి. భల్లటకవి శతకంలో 100 శ్లోకాలున్నాయి. ఇది శృంగార రస భరితమైంది. ఆనంద వర్ధనుని (క్రీ.శ. 9వ శ.) దేవీ శతకంలో దేవీస్తుతితో కూడిన 100 శ్లోకాలున్నాయి. అప్పయ్య దీక్షితుని (క్రీ.శ. 16వ శ.) వైరాగ్య శతకంలో 100 శ్లోకాలున్నాయి. విశ్వేశ్వర పండితుడు (క్రీ.శ. 18వ శ.) శృంగార రసపూర్ణమైన రామావళీ శతకాన్ని వ్రాసాడు. తెలుగు కవి ఆదిభట్ల నారాయణదాసు (క్రీ.శ. 19వ శ.) సంస్కృతంలో కాశీ శతకం వ్రాసాడు. ఈ విధంగా సంస్కృత సాహిత్యంలో శతకాలు నీతి వైరాగ్య శృంగార భావాలతో కూడి వున్నాయి. కొన్ని భక్తిభావ భరితమై స్తుతి రూపంగా వున్న శతకాలు కూడా వున్నాయి. చాలా శతకాల్లో 100 శ్లోకాలున్నా కొన్నింటిలో నూటికి తక్కువ ఎక్కువ శ్లోకాలు కూడా వున్నాయి. తెలుగు శతకాల్లో వలె సంస్కృత శతకాల్లో మకుట నియమం లేదు.

తెలుగులో శతక రచన తెలుగు సాహిత్యారంభకాలం నుంచి జరుగుతూనే

వుంది. సుమతీ శతకం నన్నయకు పూర్వ రచన జైన కవి వ్రాసాడని అంటారు. ఆ జైన కవి బద్దెగుడు. వేములవాడ చాళుక్యరాజు (క్రీ.శ.960) తిక్కన కృష్ణ శతకం వ్రాసాడంటారు. కాని అది దొరకలేదు. పోతన నారాయణ శతకం వ్రాసాడంటారు. కాని అదీ దొరకలేదు. పోతన పేరుతోనే వంగూరి సుబ్బారావుగారు ఒక నారాయణ శతకాన్ని ప్రచురించారు. కాని దీని శైలి పోతన భాగవత శైలి కన్నా భిన్నంగా వుంది. శివకవి పండితారాధ్యుడు వ్రాసిన శివతత్త్వసారం శతకమని పాల్కురికి సోమన చెప్పాడు. కాబట్టి శివతత్త్వసారం తెలుగులో మొదటి శతకమని తెలుగు సాహిత్య చరిత్రకారులు వ్రాస్తున్నారు. ఇది శతకమనబడినా దీనిలో శతక లక్షణాలు సంపూర్ణంగా లేవు. మొదటిది - దీనిలో వస్తువు వైవిధ్యంతో శివాచారం తెలిపే గ్రంథంగా వుంది. దీనిలో 489 పద్యాలున్నాయి. వాటిల్లో 191 పద్యాల్లో హరా, శివా, రుద్రా, ఆజా అనే 28 రకాల శివసంబోధనతో మకుటాలున్నాయి. కాని అన్నీ కంద పద్యాలే. కాని తెలుగులో సంపూర్ణ శతక లక్షణాలున్న మొదటి శతకం సోమనాథుని వృషాధిప శతకం అంటున్నారు. కాని సుమతి శతకమే తెలుగులో మొదటి శతకం. తెలుగు శతకాలను పరిశీలించి తెలుగు శతక లక్షణాలను ఈ కింది విధంగా నిర్ణయించవచ్చు.

## శతక లక్షణాలు

1. సంస్కృత లాక్షణికులు చెప్పినట్లుగానే తెలుగులోనూ శతకాలు లఘు కావ్యాలు. ముక్తక కావ్య ప్రక్రియకు చెందినయి. శతకమంటే 100 పద్యాల కూర్పు కలవి అని అర్థం. కాని సంస్కృతంలో వలెనే తెలుగులో భిన్నమైన పద్య సంఖ్య కన్పిస్తున్నది. భగవంతుని నామస్తుతి 108 పేర్లతో చేయడముంది. కాబట్టి చాలామంది కవులు తెలుగులో అష్టోత్తర శత సంఖ్యలో పద్యాలు కూర్చారు. కాని వందలు వేలు పద్యాలున్న శతకాలు కూడా తెలుగులో వున్నాయి.

2. ఛందస్సు ఒక్కటే వుండాలన్న నియమం తెలుగులో పాటించబడింది.

3. మకుట నియమం వుంది.

4. తెలుగు శతకాల్లో నీతి వైరాగ్య భక్తి భావాలు ఎక్కువగా వున్నాయి. శృంగార

భావాలున్న శతకాలు లేవు. వున్నా అవి భగవత్పరమైన శృంగార విరహాలను వర్ణిస్తున్నాయి.

5. పురాణేతిహాస కథలను శతక రూపంగా వ్రాయడం తెలుగులో ఒక విశేషం. తెలుగు శతకాల్లో వస్తు వైవిధ్యం పాటించబడిందని చెప్పాలి.

శతకాలు ముక్త పద్యాలతో కూడినయి. ప్రతి పద్యం స్వతంత్రార్థం కలది. ప్రతి పద్యం భావ పరిపూర్ణతతో పాఠకునికి భావరస స్ఫూర్తి కలిగిస్తుంది. శతకాల్లో కవి ఆత్మానుభూతికి ఎక్కువ స్థానముంటుంది. మహాకావ్యంలో ఇతివృత్తం పాత్రలు వర్ణనలు మొదలయిన వాటికి ప్రాధాన్యం కాగా శతకాల్లో కవి ఆత్మానుభూతికి ప్రాధాన్యం. ప్రాచీన సాహిత్యంలో ఆత్మాశ్రయ కవిత్వానికి శతకాలు చక్కని ఉదాహరణలు. విభావానుభావాల నిర్వహణ లేదు. కాని శతకాల్లో రస నిర్వహణ లేదని చెప్పలేము. శతక కవి విభావాల వర్ణనతో భావాల తీవ్రతతో రసస్ఫూర్తిని కలిగించి అలరిస్తాడు. సంస్కృత లాక్షణికులు రసధ్వని ఉదాహరణలకు ముక్తక కావ్యాల నుంచే శ్లోకాలను ఇచ్చారు. దీన్నిబట్టి శతకాల్లో ముక్తకాల్లో రసధ్వనుల పోషణ చక్కగా జరిగిందని చెప్పవచ్చును.

## సుమతీ శతకం

తెలుగు శతకాల్లో సుమతీ శతకం ప్రశస్తమైంది. ఇదే తెలుగులో మొదటి శతకం. దీన్ని కర్త బద్దెగుడు అని ప్రసిద్ధి. వేములవాడ భీమకవి ఒక సుమతీ శతకం వ్రాసినట్లుగా కూచిమంచి తిమ్మకవి తన సర్వలక్షణ సార సంగ్రహంలో చెప్పాడు. సుమతీ అనే జైనముని సుమతీ శతకాన్ని వ్రాసాడని వంగూరి సుబ్బారావు గారు అభిప్రాయపడినారు. వేములవాడ చాళుక్యరాజు రెండో బద్దెన సుమతీ శతకాన్ని వ్రాసాడు. ఆ బద్దెగుడే నీతిశాస్త్ర ముక్తావళి కర్త. సుమతీ శతకం బద్దెన రచన అనే లోకంలో వ్యాప్తిలో వుంది. కాబట్టి సుమతీ శతకం వేములవాడ చాళుక్యుల నాటి రచన అని తెలుస్తున్నది.

సుమతీ శతకం సరళ సుందరమైన శైలిలో వుంది. భావాలు సూటిగా వున్నాయి.

"సుమతీ" అన్న మకుటం వుంది. అన్నీ కందపద్యాలు. చిన్నచిన్న ఉదాహరణలతో విషయాన్ని ప్రతిపాదించడం ఒక విశేషం. దీనిలో 108 పద్యాలున్నాయి. "శ్రీరాముని దయచేతను...." అనే పద్యంతో ఆరంభమౌతున్నది. "నీతులు నోరూరగ చవులు బుట్ట నుడివెద సుమతీ" అని కవి చెప్పినట్లుగానే ప్రతి పద్యం నీతి బోధకంగా సరళ సులభంగా వుంది. కవి అపార లోకజ్ఞానమున్నవాడు. నిత్య జీవితంలో అక్కరకు వచ్చే నీతులను కవి ఉపమాలంకార సహాయంతో చెప్పాడు. ఉదా.

*ఎప్పుడు తప్పులు వెదకెడు*
*నప్పురుషునిఁగొల్వ కూడదది యెట్లన్నన్*
*సప్పంబు పడగ నీడను*
*కప్పవసించెటి విధంబుగదరా సుమతీ!*

*దీనిలో 'సర్పం' 'సప్పం' కావటం ప్రసకొరకే ఆనాడు 'సపన్' అని వ్రాసేవారు.*

*కమలములు నీటబాసిన*
*కమలాప్తుని రశ్మిసోకి కమలిన భంగిన్*
*తమ తమ నెలవులు దప్పిన*
*తమ మిత్రులు శత్రులౌట తథ్యము సుమతీ!*

ఏ పాదానికాపాదం తెగిపోవడం తెలుగులో శతక పద్యాల్లో కన్పిస్తుంది. అటువంటి రచన ధారణకు సులభంగా వుంటుంది. తర్వాత కాలంలో తెలుగులో శతకం వ్రాయని కవి లేడు. వందల వేల సంఖ్యలో శతకాలు వ్రాయబడినాయి. తెలంగాణలో శరభాంకలింగ శతకం, నరసింహ శతకం (ధర్మపురి శేషాచలకవి), శ్రీకృష్ణ శతకం (కొకుత్స నరసింహదాసు) మొదలైన ఎన్నో వందలవేల సంఖ్యలో శతకాలు పూర్వకాలంలో రచింపబడినాయి. ఆధునిక కాలంలోనూ కపిలవాయి లింగమూర్తి, టి.వి.నారాయణ, భాస్కర యోగి వంటి వాళ్ళెందరో శతకాలు వ్రాసారు. వ్రాస్తున్నారు.

ఆఖరికి కృష్ణాగోదావరి డెల్టా భూములు గోల్కొండ రాజ్యంలో విలీనమయ్యాయి.

సుల్తాన్ కులీ తర్వాత జంషీద్ రాజయ్యాడు. జంషీద్ క్రూరుడై ప్రజాదరణ పొందలేదు. జంషీద్ కాలంలో అతని సోదరుడు ఇబ్రహీం కుతుబ్‌షా పారిపోయి విజయనగరంలో ప్రవాసిగా తలదాచుకున్నాడు. ఇక్కడ ఉన్నప్పుడే ఇబ్రహీంకు తెలుగు భాషా సాహిత్యాలతో పరిచయమైంది. స్వయంగా ఉర్దూ భాషలో కవి అయిన ఇబ్రహీం తెలుగు నేర్చుకున్నాడు. తర్వాత తెలుగు కవులనాదరించాడు. జంషీద్ మరణించిన తర్వాత ఇబ్రహీం క్రీ.శ. 1550లో రాజయి క్రీ.శ. 1580 వరకు పరిపాలించాడు. అతన్ని కవులు ఇభరాముడని కీర్తించారు. అతన్ని వర్ణిస్తూ ఎన్నో చాటువులు ప్రచారంలో ఉన్నాయి. ఇబ్రహీం హఠాత్తుగా మరణించాడని అంటారు. అతని మరణవార్త విని తట్టుకోలేక ఒకానొక కవి ఈ చాటువును చెప్పాడంటారు-

*రారా విధాత! యోరి వినరా! తగురా! తలకొట్టమారి! ని*
*స్సారపు లోభిరాజులను చంపక మల్కిభరామ భూవరున్*
*చారుయశోధనున్ సుగుణి చంపితివ అర్థుల కేమి దిక్కురా!*
*చేరికనింత రాజును సృజింపగ నీ తరమా వసుంధరన్*

అర్థులను ఆదరించే కవి పండితులను పోషించే రాజమరణం ఎంత దుఃఖం కలిగించిందో ఈ పద్యం చాలా కరుణాత్మకంగా వర్ణిస్తున్నది. అపూర్వమైన పద్యం.

ఇబ్రహీం కుతుబ్‌షా ఉర్దూ భాషకు ఒక రూపమిచ్చిన కవి అంటారు. ఉర్దూలో దాన్ని దక్కనీ బోలీ అని పిలుస్తారు. ఉర్దూలో గజళ్ళు వ్రాసిన మొదటి కవి ఇబ్రహీం. ఉమర్‌షా మహమ్మద్ అంజూ, మహమూద్ షిరాజి, కులీ మీర్జా వంటి ఉర్దూ కవులెందరో అతని ఆస్థానంలో ఉన్నారు. అద్దంకి గంగాధరుడు, మరింగంటి సింగరాచార్యులు, కందుకూరి రుద్రకవి వంటి తెలుగు కవులను ఈ రాజు ఆదరించాడు.

ఇబ్రహీం తర్వాత మహమ్మద్ కులీకుతుబ్‌షా (క్రీ.శ. 1580-1612) రాజయ్యాడు. ఇతడు 1592లో రాజ్య రాజధానిని గోలకొండ నుంచి హైద్రాబాదుకు మార్చాడు. ఇతడే చార్మినార్, జామా మసీద్‌లను, మాసాబ్ తటాకాన్ని నిర్మించాడు. మహమ్మద్ కులీ తర్వాత సుల్తాన్ మహమ్మద్ రాజయ్యాడు. ఈయన మంచి విద్యావంతుడు.

మహ్మద్ కులీ దక్కనీ ఉర్దూ పారశీక భాషలను పోషించాడు. పారశీక భాష రాజభాష. ఆ భాషలో ఎన్నో శాస్త్ర గ్రంథాల రచన సాగింది. సుల్తాన్ తర్వాత అబ్దుల్లా కుతుబ్‌షా రాజయ్యాడు. ఇతని కాలంలోనే గోలకొండ రాజ్య క్షీణదశ ఆరంభమైంది. క్రీ.శ.1672 అతడు మరణించగా అబుల్ హసన్ తానీషా (క్రీ.శ. 1672-1687) రాజయ్యాడు. ఇతడు అబ్దుల్లా అల్లుడు. అబుల్ హసన్ ఔరంగజేబుకు సామంతునిగా ఉంటానని అంగీకరించి కానుకలు పంపాడు. తానీషా హిందు ముస్లింల సఖ్యతను పొందిన రాజు. అతని మంత్రులు అక్కన్న మాదన్న అనే హిందువులు. బీజాపూరును జయించిన తర్వాత ఔరంగజేబు 1687లో గోల్కండ మీద దండెత్తాడు. ఎనిమిది నెలలు పోరాడిన తర్వాత ఒక సేనాని ద్రోహంతో గోల్కొండను వశపరచుకున్నాడు. అబుల్ హసన్ తానీషా పట్టుబడి దౌలతాబాదు కోటలో బందీ అయ్యాడు. దీనితో కుతుబ్‌షాహీల దాదాపు 200 సంవత్సరాల పాలన అంతమైంది.

కుతుబ్‌షాహీలు మతసామరస్యాన్ని పాటించి పాలించారు. ఉర్దూ పారశీలతో పాటు తెలుగును పోషించారు. దక్షిణాంధ్రయుగంలో తెలుగు సాహిత్యం అనేక ప్రక్రియలతో వికసించినట్లుగానే కుతుబ్‌షాహీల పాలనలో తెలుగు సాహిత్యం సర్వతోముఖంగా అభివృద్ధి చెందింది. కుతుబ్‌షాహీల కాలంలో జటప్రోలు, గద్వాల వంటి సంస్థానాలు ఏర్పడినాయి. ఆ సంస్థానాధీశ్వరులు స్వయంగా కావ్యాలు వ్రాయటమే కాక కవులను ఆదరించి కావ్యరచనలకు ప్రేరణ నిచ్చారు.

## కందుకూరి రుద్రకవి

జనార్ధనాష్టకము, సుగ్రీవ విజయమనే యక్షగానం, నిరంకుశోపాఖ్యాన కావ్యం రచించాడు. పై కావ్యాలే కాక బలవదరీ శతకం, స్మరదీపిక అనే కామశాస్త్రమును రచించాడని తెలుస్తున్నది. అవి అలభ్యం.

జనార్ధనాష్టకములో "కందుకూరి జనార్ధనా" మకుటంతో ఎనిమిది పద్యాలున్నాయి. "అష్టకము" ప్రక్రియలో పాల్కురికి సోమన వృషభాష్టకము బసవాష్టకము, త్రివిధ లింగాష్టకము రచించాడు. మల్లికార్జున పండితారాధ్యుడు అమరేశ్వరాష్టకము రచించాడు. ఇవి సంస్కృత ప్రక్రియలో వ్రాసిన రచనలు. తెలుగులో

రుద్రకవి జనార్దనాష్టకము మొదటిది. ఇది శృంగార రసభరితం. వర్ణనలు రమ్యంగా ఉన్నాయి. "దనుజ మర్దన కందుకూరి జనార్దన" మకుటంతో వుంది. మాత్రా ఛందస్సులో వ్రాయబడింది. ఆ తర్వాత తెలుగులో అష్టకాల రచన జరిగింది. రుద్రకవి రచన రమణీయంగా ఉంది. బాపు బొమ్మలతో జనార్దనాష్టకం అందంగా ప్రచురింపబడింది. దీనికి ఆరుద్ర పీఠిక వ్రాసాడు.

సుగ్రీవ విజయం తెలుగులో మొట్టమొదట యక్షగానం. సీతాన్వేషణ నుంచి సుగ్రీవుని పట్టాభిషేకం వరకు రామాయణ వృత్తాంతం ఉన్నది. కరుణాది రసాలను బాగా పోషించాడు. దీనిలో పాటలు, ఏలలు, వచనాలు, ద్విపదలు ఉన్నాయి. సంగీత బద్ధం. యక్షగానం కాబట్టి సంవాద శైలికే ప్రాధాన్యం వుంది. దీన్ని రుద్రకవి కందుకూరి జనార్దన దేవునికి అంకితంగా ఇచ్చాడు. ఆ జనార్దనదేవుని వసంతోత్సవ సమయంలో ఈ యక్షగాన నాటకం ప్రదర్శింపబడి వుంటుంది.

కందుకూరి రుద్రకవి విశ్వబ్రాహ్మణుడని చాటుపద్యాల వల్ల తెలుస్తున్నది. గోలకొండ రాజు మల్కిభరాముడు రుద్రకవికి నల్లగొండ జిల్లాలోని చింతలపాళెంను అగ్రహారంగా దానమిచ్చినట్లు ఒక శాసనం (క్రీ.శ.1558) వల్ల తెలుస్తున్నది. నిరంకుశోపాఖ్యానం శ్రీనాథుని కాశీఖండంలో గుణనిధి కథను పోలివుంది. నిరంకుశోపాఖ్యానంలో నాయకుడు నిరంకుశుడు. నిరంకుశుడు గుణనిధికన్నా దిగజారిన వాడు. అయినా చివరకు అతడు మోక్షం పొందడం ఇతివృత్తం. ఈ కృతిలో నిరంకుశుని భార్యను కవి వ్యక్తిత్వం గల పాత్రగా చిత్రించడం విశేషం. ఇది నాలుగు ఆశ్వాసాల కావ్యం. కందుకూరులో వెలసిన సోమేశ్వరునికి అంకితంగా ఇచ్చాడు. ఇది ప్రౌఢశైలిలో ఉంది. వర్ణనలు రమ్యంగా ఉన్నాయి. కందుకూరు నల్లగొండ జిల్లాలో వుందని ప్రసిద్ధ చారిత్రకులు బి.ఎన్.శాస్త్రి అన్నారు.

## మరింగంటి కవులు

మరింగంటి వంశంవారు శ్రీ వైష్ణవులు. నల్లగొండ జిల్లాలోని దేవరకొండ ప్రాంతవాసులు. వారు మొదట ఆసూరివారు. శ్రీరంగేశ్వరుని వాక్కుతో వారు మరింగంటి వారైనారు. సింగరాచార్యులు దశరథ రాజనందన చరిత్ర కావ్యంలో

శ్రీరంగనాథుడు రామానుజులతో ఈ విధంగా అన్నట్లుగా పద్యం వ్రాసాడు.

*కంటిన్ లక్ష్మణ మునివరు*
*కంటిన్ కూరేశ దేశిక స్వామి మణిం*
*గంటి నదెవ్వరన మరిం*
*గంటి మహాన్వయము దనరె గణ్యంబగుదున్*

ఈ పద్యంలో 'మరింగంటి' పదప్రయోగంతో ఈ వంశజులు మరింగంటి వారయ్యారు.

## మరింగంటి జగన్నాథాచార్యులు (క్రీ.శ.1550–1580)

శతావధాన శత లేఖినీ సార్వభౌమ బిరుదాంకితుడు. కలలో రంగనాథుడు ఆదేశించిన ప్రకారం ఈ కవి "శ్రీరంగనాథ విలాసము" అను ప్రబంధం వ్రాసాడు. పోతన రచనాశైలి ప్రభావం కన్పిస్తున్నది. అనేక సన్మానాలు పొందాడు. అగ్రహారాలు పొందాడు.

## సింగరాచార్యులు (క్రీ.శ.1520–1590)

సింగరాచార్యులు మరింగంటి కవుల్లో ప్రఖ్యాతుడు. మల్కిభరాముని చేత వాడపల్లి అగ్రహారాన్ని పొందాడని తెలుస్తున్నది. ఆశు కవిత్వం చెప్పగలవాడు. ఈ కవి వరదరాజస్తుతి, శ్రీరంగ శతకం, రామకృష్ణ విజయమనే ద్వ్యర్థికావ్యం వ్రాసాడు. దశరథ రాజనందనచరిత్రమనే నిరోష్ఠ్యకావ్యం రచించాడు. పదహారేండ్ల వయస్సులో నలయాదవ రాఘవపాండవీయమనే నాలుగర్థాల కావ్యం వ్రాసాడు. దశరథ రాజనందన చరిత్ర, సీతాకళ్యాణం అతని రచనలు మాత్రం ముద్రితమయ్యాయి. ఇంకా అనేక కావ్యాలు రచించి ప్రసిద్ధి చెందాడు.

## మొదటి వేంకట నరసింహాచార్యులు (క్రీ.శ.1600)

బహుగ్రంథకర్త శ్రీకృష్ణ శతానందీయము, చిలువపడగ రేని పేరణము, క్షత్రబంధూపాఖ్యానము, రామానుజాభ్యుదయము మొదలయిన కావ్యాలు వ్రాసిన ప్రసిద్ధ కవి. "చిలువ పడగరేని పేరణము" అచ్చ తెనుగు కావ్యం.

ఈ వంశకవులు మరికొందరు రచించిన గ్రంథాలు కలవు, వీరిని గూర్చి విశ్వవిద్యాలయాల్లో పరిశోధనలు చేసినారు.

## హరిభట్టు (క్రీ.శ.1475-1550)

ఈ కవి వరాహ పురాణం, నారసింహ పురాణం (ఉత్తర భాగం) మత్స్య పురాణం, భాగవతం షష్ఠ ఏకాదశ ద్వాదశ స్కంధాలు రచించాడు. హరిభట్టు వరాహ పురాణం నందిమల్లయ ఘంట సింగయ కవుల వరాహ పురాణం కన్నా భిన్నమైంది. ఈ కవి వరాహావతార కథను విస్తారంగా రచించాడు. మత్స్యపురాణాన్ని శ్రీరంగనాథుని కంకితంగా ఇచ్చాడు. వరాహ పురాణం పూర్వభాగం 8 ఆశ్వాసాల గ్రంథం. దీన్ని కవి నైజాంలోని కంబంమెట్టు గ్రామకరణం కొలిపాక ఎర్రయామాత్యునికి అంకితంగా ఇచ్చాడు. ఉత్తర నరసింహ పురాణంలో ప్రహ్లాదుడు యవ్వనంలో శృంగార రక్తుడై వామనాసురుని దుర్బోధతో వైకుంఠంపై దాడిచేసి విష్ణుమాయ తొలగిపోగా విష్ణుభక్తుడైన వృత్తాంతం చోటు చేసుకుంది. ఈ కవి ఈ కావ్యంలో అష్టాదశ ప్రబంధ వర్ణనలు సందర్భానుకూలంగా చేసాడు. "అష్టఘంటావధాన" బిరుదాంకితుడు. తర్వాత కాలంలో హరిభట్టు పోతనవలె నరాంకితం చేయటానికి ఇష్టపడక దైవాంకితం చేసాడు.

## ఏకామ్రనాథుడు

ఏకామ్రనాథుని "ప్రతాపచరిత్ర" తెలుగులో మొట్టమొదటి వచన కావ్యం (1550). దీనిలో ఆ కవి కాకతీయ రాజుల చరిత్రను గ్రంథస్థం చేసాడు. కాని రుద్రమదేవి గణపతిదేవుని భార్య అని చారిత్రక అసత్యాన్ని చెప్పటం వంటి దోషాలు ఈ కృతిలో ఉన్నాయి. ఏకామ్రనాథుని వచన రచన ఆనాటి రాజకీయ వ్యవహార వచన రచనను పోలి వుంది. రాయవాచకంలోను అదే శైలి కన్పిస్తుంది.

## కాసె సర్వప్ప

క్రీ.శ.1600 వాడైన కాసె సర్వప్ప "సిద్ధేశ్వర చరిత్ర" పేరుతో కొంత ద్విపదలో, మరికొంత వచనంలో ఓరుగల్లు కాకతీయరాజుల చరిత్రను వ్రాసాడు. ఏకామ్రనాథుని

'ప్రతాప చరిత్ర'ను ద్విపదగా కాసె సర్వప్ప రచించాడు. ప్రతాప చరిత్రను కూచిమంచి జగ్గకవి (18వ శ॥) "సోమదేవ రాజీయం" అనే పద్య కావ్యంగా రచించాడు. ఇది 17వ శతాబ్ది రచన అని పండితుల అభిప్రాయం. రెండో ప్రతాపరుద్రుడు తురుష్కుల చేతిలో బందీయై ఢిల్లీకి తీసుకుపోతుంటే మార్గమధ్యంలో నర్మదానదిలోకి దూకి మరణించాడన్న వృత్తాంతం సిద్ధేశ్వర చరిత్రలోనే ఉంది. కాకతీయుల తటాక, దేవాలయాల నిర్మాణం పరిపాలనా విధానం గురించి సర్వప్ప విశదంగా వ్రాసాడు. హనుమకొండ మీద వెలసిన శివునికి సిద్ధేశ్వరుడని పేరు. శివపార్వతుల వివాహ వర్ణన చేసాడు. దీనికి సిద్ధేశ్వర మాహాత్మ్యమని కూడా పేరున్నది. దీనిలో అప్రౌఢమైన దోషపూరితమైన భాష కన్పిస్తున్నది. అయినా కాకతీయుల నాటి సాంఘికాచారాలను, మతం, సంప్రదాయాలను వర్ణించటం చేత చరిత్ర గ్రంథంగా విలువ కలిగి వున్నది.

## పోశెట్టి లింగ కవి

క్రీ.శ. 15వ శతాబ్దం కవి. కుమ్మరి కులం వాడని ప్రసిద్ధి. గార్లపాటి లక్ష్మణ కవి శిష్యుడు. నవ చోళ చరిత్ర, మల్హణ చరిత్ర, శంకర దాసమయ్య చరిత్ర, సంగమయ్య చరిత్ర, శిష్య ప్రబోధము ద్విపద కావ్యాలను రచించాడు. ఇతని కావ్యాల్లో కైకిలి, మోటు, తునక వంటి తెలంగాణ పదాలు కన్పిస్తాయి. పాల్కుర్కి సోమనను గురుమూర్తిగా స్తుతించాడు. "నవచోళ చరిత్ర" ముద్రింపబడింది. ఐదు ఆశ్వాసాల గ్రంథం. తొమ్మిదిమంది శివభక్తుల కథలున్నాయి. నవచోళుల్లో కరికాల చోళుని చరిత్ర ఉంది.

## ఎలకూచి బాలసరస్వతి

క్రీ.శ. 1600–1650 నాటి కవి. జటప్రోలు సంస్థాన ప్రభువు. సురభి మాధవరాయల ఆశ్రయంలో ఉన్నాడు. 1610లో ఆంధ్ర శబ్ద చింతామణికి తెలుగు టీకను వ్రాసాడు. సంస్కృతంలో ఆంధ్రశబ్ద చింతామణి లఘుకృతి. అది నన్నయ కృతమని ప్రసిద్ధి. దానికి బాలసరస్వతి రెండు పరిచ్ఛేదాల్లో టీకను వ్రాసాడు. బాలసరస్వతి అసలు పేరు ఎలకూచి వెంకట కృష్ణయ్య మహామహోపాధ్యాయ బిరుదాంకితుడు. తర్వాత బాలసరస్వతి "చంద్రికాపరిణయం" ప్రౌఢ ప్రబంధం వ్రాసి

సరస్వతికి అంకితమిచ్చాడు. "మల్లభూపాలీయం" రచించి బాలసరస్వతి సురభి మాధవరాయల తండ్రి మల్లభూపాలునికి అంకితం ఇచ్చాడు. అన్నిటికన్నా అతని రచనల్లో పేర్కొనదగింది, అతనికి కీర్తిని తెచ్చిపెట్టింది – భర్తృహరి త్రిశతి" అనువాదం. ఇతని తర్వాత పుష్పగిరి తిమ్మన, ఏనుగు లక్ష్మణ కవి, భర్తృహరి శతకాలను అనువదించారు. కాని సరళమైన శైలిలో వున్న బాలసరస్వతి అనువాదం ప్రసిద్ధమైంది. వ్యాప్తిలో ఉంది. దీన్ని వావిళ్ళ వారు ముద్రించారు.

"బాలసరస్వతి యాదవరాఘవ పాండవీయ"మనే త్ర్యర్థికావ్యాన్ని రచించి వేంకటేశ్వర స్వామికి అంకితంగా ఇచ్చాడు. ఇంతకుముందు ద్వ్యర్థి కావ్యాలు తెలుగులో వచ్చాయి. కాని త్ర్యర్థి కావ్యాల్లో ఇదే మొట్టమొదటి కావ్యం. అముద్రితం. కార్తికేయాభ్యుదయం, వామన పురాణం మొదలైన రచనలు చేసాడు. కాని అవి అలభ్యం.

## కాకునూరి అప్పకవి

పాలమూరు జిల్లా కల్వకుర్తి తాలుకా ప్రాంతాలకు చరిగొండ సీమ అని పేరు. అప్పకవి తాత సోమన కాకునూరును అగ్రహారంగా పొందాడు. నవదళపురి (తొమ్మిది రేకుల) దానికి దగ్గరలోనే ఉంది. తొమ్మిది రేకుల అప్పకవి నివాస గ్రామం. దాన్ని సంస్కృతీకరించి నవదళపురి అన్నాడు. సోమన కాశిలో చదువుకొని వచ్చాడు. "కాకునూరింటి వాడని ఘనత గాంచి"నాడని చెప్పుకున్న పండితుడు (1600-1660). అప్పకవి స్పష్టంగా తెలంగాణ వాడని తెలుస్తున్నా అతని జన్మస్థలం గురించి వాగ్వివాదాలు జరిగాయి. ఇప్పుడు అప్పకవి తెలంగాణవాడు పాలమూరు జిల్లా వాడన్న అభిప్రాయం స్థిరపడింది.

అప్పకవి 'అప్పకవీయం' పేరుతో ఆంధ్రశబ్ద చింతామణికి పద్యగద్యాత్మకమైన వ్యాఖ్యానాత్మకమైన అనువాదం చేసాడు. 82 ఆర్యలుగా ఈ గ్రంథం విభజింపబడింది. ఐదు పరిచ్ఛేదాలున్నాయి. ఎనిమిది ఆశ్వాసాలుగా ప్రణాళికలేసుకున్నాడు. కాని ఐదు ఆశ్వాసాలు లభించాయి. దీనిలో భాష అలంకార శాస్త్ర విషయాలు, కావ్య వ్యవహారిక భాషా స్వరూప నిర్ణయం, ఛందస్సుల వివరణలు, యతిప్రాసల ప్రామాణిక

వివేచనలు ఉన్నాయి. ఇవి ఛందోవిషయాలను విశదంగా చర్చించటం చేత ఛందోగ్రంథంగా చెప్పబడుతున్నదది. 1602 పద్యాల్లో అప్పకవి సంజ్ఞాసంధి పరిచ్ఛేదాలను వివరించాడు. వచనరూప వివరణలు ఉన్నాయి. ఈ గ్రంథం వివరణల్లో వ్యవహారిక భాష ప్రయోగం కన్పిస్తున్నది.

అప్పకవి ప్రాచీన సాహిత్యం నుంచి 23 మంది కవుల చాటు పద్యాలను, 173 కావ్యాలను, 42 లక్షణ గ్రంథాలను, 339 పద్యాలను ఉదహరించడం అతని పాండిత్య పటిమను తెలియజేస్తున్నది. అప్పకవి కొన్నిచోట్ల తాను రచించిన పద్యోదాహరణలు కూడా ఇచ్చాడు. అనంతరం కవి పండితులు దీన్ని ఒక ప్రామాణిక గ్రంథంగా స్వీకరించారు. ప్రతిభగలవాడన్నారు. కొన్నిచోట్ల అప్పకవి పదాలకు వ్యుత్పత్తి అర్థాలు చెప్పటం విశేషం. ఊచేటి–ఎల = ఉయ్యెల అని చెప్పాడు. లాలి పాటలను, పెండ్లి పాటలను దేశికవితకు ఉదాహరణలుగా ఇచ్చాడు. లాలిపాట, పెండ్లిపాట, సువ్వాల పాటలకు అప్పకవి లక్షణాలు చెప్పాడు. ఇంతకుముందు లాక్షణికులు ప్రబంధంలో అష్టాదశ వర్ణనలు ఉండాలని చెప్పగా అప్పకవి 22 వరకు పెంచాడు. కవులను వాళ్ళ ప్రతిభను బట్టి ఏడు రకాలుగా చెప్పాడు. కావ్యంలో రసపోషణ ప్రాధాన్యాన్ని గుర్తించాడు. కాని అప్పకవి ఆనాటి ఛాందసభావాలతో "అంధ్రిభవుని కావ్యము గ్రాహ్యము కాదం"టూ చెప్పాడు. ఇటువంటి అభిప్రాయాలు పండితలోకంలో వుండటం చేతనే శ్రీకృష్ణదేవరాయలు, రామరాజభూషణుని వంటి కవుల కావ్యాలకు వాళ్ళ ప్రతిభకు గుర్తింపు రాలేదు. ఆధునిక కాలంలో జరిగిన పరిశోధనల వల్ల వాళ్ళకు రావలసిన గుర్తింపు వచ్చింది.

అప్పకవి "సాధ్వీజనధర్మం, శ్రీశైలమల్లికార్జున శతకం, అంబికా సంవాదమనే యక్షగానం, కవి కల్పకమనే లక్షణ గ్రంథం, ఆపస్తంభధర్మ నిబంధనమ్ (సంస్కృతం) మొదలైన గ్రంథాలు రచించాడు. కాని అవేవి లభ్యం కావటం కాలేదు. అతని కీర్తిస్తంభంగా అప్పకవీయం నిలిచింది. కొన్నిచోట్ల కొన్ని పొరపాట్లు దొర్లినా ముఖ్యంగా కవులను గురించి చెప్పిన అంశాల్లో చారిత్రక దోషాలు దొర్లినా అప్పకవీయం అద్వితీయమైన ఛందోగ్రంథం. అప్పకవీయం ప్రాశస్త్యాన్ని కవి ఇట్లా చెప్పుకున్నాడు–

"ఇది చదివిన పిమ్మట మరియేదియేనియు చదువబుద్ధియేలా పొడమున్ బదపడి గ్రంథములన్నియు, వెదకివెదకి సారమెల్ల వివరింపంగన్ (1-7)".

## అద్దంకి గంగాధరుడు

ఈ కవి తపతీ సంవరణోపాఖ్యామనే ప్రబంధాన్ని వ్రాసి గోలకొండ సుల్తాను ఇబ్రహీం కుతుబ్‌షాకు (క్రీ.శ.1550-1580) అంకితమిచ్చాడు. ఇబ్రహీం కుతుబ్ షాను తెలుగు కవులు మల్కిభరాముడని కీర్తించారు.

గంగాధరుని ప్రబంధానికి పూర్వం ఈ రాజు పెక్కు కృతులను అంకితంగా పొందినట్లు పీఠికను బట్టి తెలుస్తున్నది.

మహాభారతం ఆదిపర్వంలోని తపతి సంవరణుల కథను తీసుకొని 5 ఆశ్వాసాల ప్రబంధంగా గంగాధర కవి వ్రాసాడు. కవి కల్పనలు వర్ణనలు చక్కగా ఉన్నాయి. శైలి ధారాళంగా వుంది. శబ్దాలంకారాలు రమ్యంగా వున్నాయి. నన్నయ తెలుగు భారతంలో తపతి సంవరణుల కథను 23 పద్యగద్యాల్లో చెప్పాడు. అంత చిన్న కథను తీసుకొని గంగాధర కవి పెంచి శృంగార ప్రధానమైన ప్రబంధంగా రచించాడు. గంగాధర కవి చాలా విషయాల్లో రామరాజభూషణుని వసుచరిత్రను అనుకరించాడు. శృంగార నైషధంలో హంసరాయబారం నడుపుతుంది. గంగాధరుని కావ్యంలో నాయికా నాయకులు తపతీ సంవరణుల మధ్య రాయబారాన్ని ఒక చిలుక నడుపుతుంది. ఈ ఘట్టాన్ని గంగాధర కవి రమ్యంగా చిత్రించారు. అష్టాదశ వర్ణనలను రమ్యంగా చేశాడు. వసు చరిత్రకన్నా ఒకటి రెండు సంవత్సరాలు ముందే రచింపబడిందని అంటారు. కాని ఇబ్రహీం కుతుబ్‌షా విజయనగరంలో వున్నప్పుడే అళియ రామరాజు జీవించి వున్నప్పుడే వసుచరిత్ర వ్రాయబడింది. కాని రాజకీయ అల్లకల్లోలాలతో తాళికోట యుద్ధం తర్వాతనే వసు చరిత్ర పెనుగొండలో అళియ రామరాజు తమ్ముడు తిరుమల రాయలకు అంకితంగా ఇయ్యబడింది. ఆ విధంగా అద్దంకి గంగాధరుడు ఇబ్రహీ కుతుబ్‌షా వెంట విజయనగరంలో వుండి వసు చరిత్రను గురించి తెలుసుకొని దానిలోని కవిత్వాన్ని విని వుంటాడు. వసుచరిత్ర వంటి రమ్యమైన ప్రబంధాన్ని రచించి తననాదరించిన కుతుబ్‌షాకు అంకితంగా ఇచ్చి వుంటాడు.

## పొన్నగంటి తెలగన

ఈ కవి యయాతి చరిత్రను రచించి అమీనుఖాను అనే ఇబ్రహీం కుతుబ్‌షా సామంతరాజుకు అంకితంగా ఇచ్చాడు. అమీనుఖాను మెదక్ జిల్లాలోని పొట్లచెర్వు (నేటి పటాన్ చెరువు) పాలకుడు. యయాతి చరిత్ర అచ్చతెనుగు కావ్యం. క్రీ.శ. 1576–80 రచనా కాలం. ఇదే తెలుగులో మొట్టమొదటి అచ్చతెనుగు కావ్యం. సంస్కృత భాషా పదాలను వాడకుండా దేశి తద్భవ పదాలను మాత్రమే వాడి కవి ఈ కావ్యాన్ని రచించాడు. కొన్ని సంస్కృత పదాలను కవే స్వయంగా అనువదించి దేశిపదాలను తయారు చేసుకున్నాడు కూడా. ఉదా॥ పంచవదనుడు = ఐదు మోముల వేల్పు. హిరణ్యగర్భుడు=కడుపు బంగారు బొక్కసము చేసిన మేటి. వాల్మీకి= కనువినుకలి తావు చూలి. బ్రహ్మ = నీటి పుట్టుగు పట్టి, పక్కడాల్ వేలుపు, పొక్కిలి పసిబిడ్డ. హిమవంతుడు = మరుమేపుకందొక మామగారు. కవి అష్టాదశ వర్ణనలు చేశాడు. అచ్చతెనుగులో ఒక్క పద్యం వ్రాయటమే కష్టం. అటువంటిది మొత్తం కావ్యాన్ని వ్రాయటం అద్భుత కార్యమే. కవి దాన్ని ఇట్లా చెప్పుకున్నాడు–

*మున్నెవ్వరు నొడవని యీ తెన్నుడి కడుమీరి యచ్చ తెనుగుంగబ్బం*
*బెన్నిక మీరగజెప్పిన నిన్నుం బొగడంగ గలడె నెలతాల్పయినన్*

అచ్చతెనుగులో సోమన ఒక్క పద్యం వ్రాసాడు. కాని కావ్యాన్నే అచ్చతెనుగులో వ్రాయాలనే ఆలోచన తెలగనకు ఎందుకు వచ్చిందో తెలియదు. అతని పేరే “తెలగన్న” అంటే అచ్చ తెనుగు కావ్యం వ్రాయటం వల్ల అతనికా పేరు వచ్చిందా? తెలియదు. అచ్చ తెనుగు కావ్యంవ్రాసి ఒక ముస్లింకు అంకితంగా ఇయ్యటం ఒక వింత సంయోగంగా కన్పిస్తున్నది. తరువాత కాలంలో ఇటువంటి అచ్చ తెనుగు కావ్యాలు చాలా వ్రాయబడినాయి.

## సారంగు తమ్మయ

తమ్మయ్య వైజయంతి విలాసమనే శృంగార ప్రబంధాన్ని వ్రాసాడు. దీనికి విప్రనారాయణ చరిత్ర అని కూడా పేరు. ఇది 4 ఆశ్వాసాల ప్రబంధం. ఈ కవి

గోలకొండ సుల్తాను మహమ్మదు కుతుబ్‌షా (క్రీ.శ. 1581-1611) కాలంలో గోలకొండ కరణంగా పని చేసాడు. ఈ కవి తన కావ్యాన్ని తన ఇష్టదైవం శ్రీరాముని కంకితంగా ఇయ్యడం విశేషం. తమ్మయ సంస్కృతంలో వున్న దివ్యసూరి చరితము ననుసరించి విప్రనారాయణుని కథను వ్రాసాడు. ఇతని కవిత్వం సరసంగా వుంది. అక్కడక్కడ ఔచిత్యాన్ని మించిన శృంగార వర్ణనలున్నాయి. పాత్రచిత్రణలను కవి సహజంగా చేసాడు. తమ్మయ్య విశిష్టాద్వైత మతానుయాయి. వైష్ణవ సంప్రదాయాలను అక్కడక్కడ వర్ణించాడు.

## చరిగొండ ధర్మన

ధర్మన క్రీ.శ. 1504 ప్రాంతంలో ఓరుగల్లును పాలించిన చిత్తాపుఖాను కాలంవాడు. ఈ కవి 8 ఆశ్వాసాల చిత్రభారతం వ్రాసి చిత్తాపుఖాను మంత్రి ఎన్ములపల్లి పెద్దామాత్యునికి అంకితమిచ్చాడు. కవి చిత్రభారత కథను బ్రహ్మాండపురాణం నుంచి తీసుకున్నాడు. పేరుకు తగినట్లుగానే ఈ కథ చిత్రంగా వున్నది. శ్రీకృష్ణునికి అర్జునునికి మధ్య చతుర్ధనరాజు వల్ల యుద్ధం సంభవిస్తుంది. కృష్ణార్జునుల యుద్ధాన్ని కవి మహాభారత యుద్ధరీతిలో వర్ణించాడు. ఈ యుద్ధం కూడా 18 రోజులు జరిగిందట. ధర్మన కవిత్వం వీరరస స్ఫోరకంగా వుంది. చిత్రకవిత్వంలో తనకున్న ప్రవేశాన్ని చూపించాడు. చిత్రభారతం కథను నాదిండ్ల గోపమంత్రి "కృష్ణార్జున సంవాదం"గా (1522) రచించాడు. ఆయన చతుర్ధన రాజు స్థానంలో గయున్ని ప్రవేశ పెట్టాడు. ఆధునిక కాలంలో చిలకమర్తి ఈ కథను తీసుకొని "గయోపాఖ్యానం" నాటకం వ్రాసాడు. చాలా ప్రసిద్ధమైంది. ఆ విధంగా ధర్మన రచించిన చిత్రభారతం కథ తర్వాత కాలంలో నాటకానికి మూలమై చాలా ప్రాచుర్యాన్ని పొందింది.

## కామినేని మల్లారెడ్డి

(క్రీ.శ. 1580-1590) ఈ కవి మెదకు దుర్గానికి సమీపంలోని బిక్కనవోలును రాజధానిగా గోలకొండ సుల్తానుల కింద సామంతుడుగా పాలించిన రాజవంశంలోని వాడు. ఈ కవి ఇబ్రహీం కుతుబ్‌షా కాలం వాడని చాటు పద్యాల వల్ల తెలుస్తున్నది. ఆ రాజు చేత గౌరవ సత్కారాలు పొందాడు. మల్లారెడ్డి షట్చక్రవర్తి చరిత్ర, శివధర్మోత్తర

కృతులను వ్రాసాడు. శివధర్మోత్తర కావ్యేతివృత్తాన్ని స్కందపురాణం నుంచి కవి తీసుకున్నాడు. శైవ ధర్మాలను వివరించిన గ్రంథం. దీనిలో కవి శైలి సరళంగా వుంది. కాని షట్చక్రవర్తి చరిత్రలో కవి రామరాజభూషణుని వసుచరిత్ర శైలిని అనుసరించాడు. హరిశ్చంద్రాది ఆర్గురు చక్రవర్తుల కథలను శృంగార రసప్రధానంగా ప్రబంధ వర్ణనలను చేర్చి చక్కని కల్పనలతో రచించాడు. రామరాజభూషణుని వలెనే శ్లేష శబ్దాలంకార వైచిత్రిని కవి ప్రదర్శించాడు. ఈ కవి మరో రచన పద్మపురాణం. దీనిలో కవి రామాయణ కథను చక్కని శైలిలో రచించాడు. శివాభిమాని అయిన ఈకవి శైవ ధర్మాలను వివరిస్తూ శివధర్మోత్తరం కృతి రచించాడు.

## సురభి మాధవరాయలు

ఈ కవి పాలమూరు జిల్లాలోని జటప్రోలు పాలకుడు. క్రీ.శ. 1650 ప్రాంతం వాడు. జటప్రోలు జీర్ణ కర్ణాటరాజ్యంలో ఒక సంస్థానం. సాహిత్య పోషణకు ప్రసిద్ధమైన సంస్థానం. మాధవరాయల రచన చంద్రికాపరిణయం ప్రబంధం. దీనిలో చంద్రిక సుచంద్రుల ప్రేమ వివాహ కథ వుంది. కథ కల్పితం. కథ వసుచరిత్ర కథను పోలి వుంది. వర్ణనల్లోనూ వసుచరిత్రను పోలి వుంది. వసుచరిత్రలో వలెనే మాధవరాయలు శ్లేష యమక చమత్కారాన్ని ప్రదర్శించాడు. ఇది ప్రబంధయుగానంతరం వచ్చిన అనేక పిల్ల వసుచరిత్రలలో ఒకటి. వెల్లాల సదాశివశాస్త్రి, అవధానం శేషశాస్త్రి ఇద్దరూ కలిసి చంద్రికాపరిణయానికి 'శరదాగమనం' బృహత్వ్యాఖ్యానం వ్రాసారు. చాలాకాలం నాడు జటప్రోలు సంస్థానంవారు దీన్ని ముద్రించినారు. తరువాత కేశవ పంతుల నరసింహశాస్త్రి విపుల పీఠికతో ఈ కావ్యాన్ని ముద్రించారు. 2001 సంవత్సరంలో తెలుగు విశ్వవిద్యాలయం దీన్ని ముద్రించింది.

## రామదాసు

రామదాసు అసలు పేరు కంచెర్ల గోపన్న. క్రీ.శ.1620–80 మధ్యకాలంలో వున్నాడు. అక్కన్న మాదన్నలు అతని మేనమామలు అంటారు. గోల్కొండ ప్రభువు అబుల్ హసన్ తానీషా (క్రీ.శ. 1658–87) దగ్గర వాళ్ళు మంత్రులుగా వున్నారు. వాళ్ళ ప్రభావంతోనే గోపన్న భద్రాచలం తాసీల్దారుగా నియమింపబడి వుంటాడు.

అతడు చిన్ననాటి నుంచి రామభక్తి కలవాడు. రఘునాథ భట్టరాచార్యుల గురుత్వంలో అతని రామభక్తి ఇనుమడించి రామదాసుగా ప్రసిద్ధి చెందాడు. రామదాసు పూర్వజులు శైవులని అంటారు. ఇతడు రామభక్తుడయ్యాడు. భక్తి భగవత్ కైంకర్యం అతిథి పూజలతో అతని ఆస్తి కరిగిపోయింది. అది పోగా సర్కారు ఖజానా డబ్బునుకూడా ఖర్చు చేశాడు. ప్రభువు దానికి కోపించి అతన్ని బంధిఖానాలో వేసాడు. రామలక్ష్మణులు స్వయంగా వచ్చి సుల్తానుకు డబ్బు చెల్లించి రామదాసును విడిపించారని ప్రభువు అతని భక్తి మహిమను తెలుసుకొని అతన్ని బాధించినందుకు పశ్చాత్తాప పడినాడని ఐతిహ్యం. రామదాసు కీర్తి దక్షిణాన త్యాగయ్య వరకూ వ్యాపించింది. త్యాగయ్య రామదాసును ఎన్నోసార్లు స్మరించాడు. రామదాసు భక్తి పారవశ్యంతో జైలులో ఎన్నో కీర్తనలను వ్రాసాడు. "దాశరథీ కరుణాపయోనిధి, భద్రగిరి దాశరథ కరుణాపయోనిధీ" మకుటంతో దాశరథి శతకాన్ని వ్రాసాడు. ప్రతియేటా రామకోటి వ్రాసి భద్రాచలం రామునికి అర్పించేవాడట. రామదాసు బందీఖానాలో 12 ఏండ్లు ఉన్నాడు. అప్పుడు రామున్ని భక్తితో తనను రక్షించమని మొరపెట్టుకున్నాడు. ఒకొకసారి రాముని మీద అలుగుతూ కోపగిస్తూ అనునయిస్తూ చెప్పిన కీర్తనలు నిసర్గ భావాలతో కూడి వున్నాయి. భాష సరళంగా భావాలు నిరాడంబరంగా వుండి శ్రోతలను ఆకట్టుకుంటాయి.

రామదాసు తెలుగే కాక ఆనాడు రాజభాషయిన ఉర్దూ, పారశీక భాషలను నేర్చాడు. అతడు పండితుడైనా అతని కీర్తనలు సరళమైన నిత్య వ్యవహారానికి దగ్గరైన తెలుగులో వున్నాయి. రామదాసు మొత్తం ఎన్ని కీర్తనలు వ్రాసాడో చెప్పలేము. కాని నూరో, నూట యాభయ్యో వుంటాయని పండితుల అభిప్రాయం. అతడు వ్రాసిన కీర్తనలు తక్కువే అయినా సరళ భక్తిభావాలతో కూడి తెలుగు నుడికారంతో వుండి అలరిస్తున్నాయి. దాశరథి శతకం కూడా సరళమైన భాష, భావాలతో వుంది. అతని ఆర్తి శరణాగతి దాస్యభక్తి ఇందులో కనిపిస్తాయి. భావతీవ్రత అతని కీర్తనల్లో బాగా చోటు చేసుకుంది.

గోల్కొండను ఔరంగజేబు ఆక్రమించుకొని బందీలను విడిచిపెట్టాడని అందులో రామదాసు కూడా వున్నాడని చారిత్రకుల అభిప్రాయం.

## క్షేత్రయ్య

క్షేత్రయ్య అసలు పేరు వరదయ్య. తిరుపతి, కంచి, శ్రీరంగం క్షేత్రాలనెన్నిటినో దర్శించటం వల్ల అతని పేరు క్షేత్రయ్య అయ్యింది. కృష్ణా జిల్లాలోని మొవ్వ అతని స్వగ్రామం. మొవ్వగోపాలస్వామి భక్తుడు. ఆ దేవున్ని నాయకునిగా చేసి శృంగార పదములు రచించాడు – అతని పదాలు, భావాల కూర్పులూ గజళ్ళను తలపింప జేస్తాయి. క్షేత్రయ్య తంజావూరును దర్శించి రఘునాథ నాయకుని చేత సన్మానాలందు కున్నాడు. సంగీతం, సాహిత్యం అభినయాలకు నిలయమైన ఆయన పదములు చాలా ప్రసిద్ధి చెందినయి. క్షేత్రయ్య అబ్దుల్లా తానీషా ఆస్థానాన్ని సందర్శించి సన్మానింపబడినాడు. అబ్దుల్లాపైన వేయి పదాలు చెప్పాడంటారు. క్షేత్రయ్య రసమంజరి అనే నాయికానాయక భేదాలను చెప్పే లక్షణ గ్రంథం కూడా రచించాడు.

## రెడ్రెడ్డి మల్లారెడ్డి (1650–1700)

"గంగాపుర మాహాత్మ్యం" అనే స్థల పురాణాన్ని వ్రాసాడు. ఈ కవి పెదతాత మల్లారెడ్డి కుతుబ్‌షా రాజు నుంచి బూర్గుల గ్రామాన్ని దానంగా పొందాడు. గంగాపురంలోని చెన్నకేశవస్వామి మహిమలను వర్ణిస్తూ ఈ కావ్యం రచించాడు. సురవరం ప్రతాపరెడ్డి ఈ కావ్యాన్ని పరిష్కరించి విపులమైన పీఠికతో విజ్ఞాన వర్ధినీ పరిషత్తు ఐదవ ప్రచురణగా 1946లో ప్రచురించారు. కవి ప్రబంధ శైలిలో వ్రాసాడు. వర్ణనలు చమత్కార పూర్ణంగా ఉన్నాయి.

## బిజ్జల తిమ్మభూపాలుడు (1675–1725)

సంస్కృతంలో మురారి రచించిన ప్రసిద్ధ నాటకం "అనర్ఘరాఘవం"ను కావ్యంగా రచించాడు. పండిత కవి. బిజ్జల తిమ్మభూపాలుడు అలంపూరు రాజధానిగా ప్రాగటూరు ప్రాంతాన్ని పరిపాలించాడు. బీజాపూరు రాజు నుంచి ఇనాం పొందాడు. అనర్ఘ రాఘవం ఐదు ఆశ్వాసాల కావ్యం. వీరరస ప్రధానమైంది. ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ వారు కేశవ పంతుల నరసింహ శాస్త్రి విపుల పీఠికతో 1977లో ప్రచురించారు.

## పెదసోమభూపాలుడు (1663-1712)

గద్వాల కోటను నిర్మించి రాజధానిని పూడూరు నుంచి గద్వాలకు మార్చాడు. జానపదులు ఇతన్ని నల్లసోమనాద్రిగా పాటలు కట్టి అతని శౌర్యాన్ని కీర్తిస్తూ పాడుతారు. ఇతడు జయదేవుని అష్టపదులకు విపుల వ్యాఖ్యానం వ్రాసినట్లు తెలుస్తున్నది. సంస్కృతాంధ్రంలో రెండు భాషల్లో వ్యాఖ్యానం వ్రాయటం విశేషం. ఇది అముద్రితం.

## కాణాదం పెద్దన సోమయాజి (1752-1793)

అభినవ భోజుడుగా ప్రసిద్ధి చెందిన ఇతడు గద్వాల చినసోమభూపాలుని ఆస్థాన కవి. అభినవ అల్లసానిగా కూడా కీర్తింపబడినాడు. మత్స్యపురాణాన్ని అనువదించాడు. రామాయణానికి సంస్కృతంలో టీక వ్రాసాడు. ఇవి అలభ్యాలు. ఇతని రచన బాలకాండ తాత్పర్యము, ఆధ్యాత్మ రామాయణము, ముకుంద విలాసము లభిస్తున్నాయి. గద్వాల వారి ప్రెస్సులో అచ్చయ్యాయి. ఈ కవి కవిత్వం రమ్యమైనది. వర్ణనలు రసవంతంగా ఉన్నాయి.

## చినసోమ భూపాలుడు (1762-1793)

గద్వాల సంస్థాన చరిత్రలో చినసోమభూపాలుని పాలనా కాలం స్వర్ణయుగం అంటారు. ఇతడు కవి పండిత పోషకుడే కాక స్వయంగా కవి. హరిభట్టు రత్న శాస్త్రాన్ని అనువదించాడు. అష్టపదులను యక్షగానంగా వ్రాసాడు.

## పరశురామ పంతుల లింగమూర్తి (1710-1800)

వరంగల్లు వాసి. "సీతారామాంజనేయ సంవాదము" ఇతని వేదాంత గ్రంథం. ఇతని రతీమన్మథ విలాసము, మానస శతకము, సీతపాట ముద్రితమై లభిస్తున్నాయి. ఇతని "సీతారామాంజనేయ సంవాదము" మూడాశ్వాసాల గ్రంథం. వేదాంత జిజ్ఞాసువులకు గొప్ప గ్రంథం.

ఇంకా ఈ కాలంలో మాహాత్మ్యకావ్యాలు, శతకాలు, వేదాంత తాత్త్విక గ్రంథాలు వ్రాసిన కవులెందరో ఉన్నారు. సంస్కృత కావ్య నాటకాలను ప్రబంధాలుగా రచించిన

కవులున్నారు. జయదేవుని అష్టపదులు ఈ నాటి కవులను బాగా ఆకర్షించాయి. వాటిని చాలా మంది కవులు అనువదించారు. వ్యాఖ్యానాలు వ్రాసారు. కుతుబ్‌షాహీల యుగం దక్షిణాంధ్రంలో తంజావూరు నాయకరాజుల మధుర నాయక రాజుల జింజి రాజుల కాలంలోని సాహిత్య వాతావరణాన్ని తలపింప జేస్తున్నది. రాజుల ఆదరణలో ఎందరో కవులు ఎన్నో రచనలు చేసి దక్షిణాంధ్రంలో వలెనే ప్రభువుల ఆదరణ పొందారు. తర్వాత ఇంగ్లీషు వాళ్ళు క్రమక్రమంగా భారతదేశాన్ని ఆక్రమించుకోవడంతో సాహిత్య వాతావరణం ఆధునికత ప్రవేశించి ప్రకియల్లో మార్పు రావటం మొదలైంది. ఆ మార్పును మనం అసఫ్‌జాహీల కాలంలో చూడవచ్చును.

# అసఫ్‌జాహీల యుగం

కుతుబ్‌షాహీలను జయించిన తర్వాత తెలంగాణను మొఘలు రాజులు-ఔరంగజేబు కొడుకులు ఒకరి తర్వాత ఒకరు పాలించారు. దాదాపు 40 సంవత్సరాల వాళ్ళ పాలనలో తెలంగాణ అల్లకల్లోలంగా ఉంది. సర్వాయి పాపన్న వంటి వాళ్ళు తిరుగుబాటు చేసి తమ రాజ్యాన్ని స్థాపించాలని ప్రయత్నించారు. కాని ఢిల్లీ బాదుషా బలం ముందు నిలువలేక వీరమరణం చెందారు. ఇదే సమయంలో గోండులు గోండ్వానా రాజ్యస్థాపనకు పూనుకున్నారు. గోండులు గోదావరి చంబల్‌లోయ ప్రాంతాలనేలారు. కాని మరాఠా రాజులు వాళ్ళను జయించారు. ఆ తర్వాత గోండుల రాజ్యం నిజాం రాజ్యంలో భాగమైంది.

మొఘల్ ఔరంగజేబు తర్వాత చక్రవర్తి అయిన షా ఆలం గోలకొండలో పరిస్థితులు చూసి నిజాం ఉల్‌ముల్క్‌ను సుబేదారుగా నియమించాడు. నిజాం ఉల్ ముల్క్ (1724-1748) నామమాత్రంగా ఢిల్లీ సామంతునిగా ఉండి 1724 నుంచి స్వతంత్ర పాలన సాగించాడు. అప్పట్నుంచి 1948 వరకు అసఫ్ జాహీల పాలన సాగింది. నిజాం ఉల్ ముల్క్ తన రాజధానిని ఔరంగాబాదు నుంచి హైదరాబాదుకు మార్చాడు. నిజాం విజయాన్ని గుర్తించి ఢిల్లీ చక్రవర్తి అతనికి "అసఫ్ జా" అని బిరుదాన్నిచ్చాడు. అదే వాళ్ళ వంశనామమైంది. క్రీ.శ. 1724లో నిజాం రాజ్యం ఉద్భవించింది. నిజాం ఉల్ ముల్క్ రాజనీతిజ్ఞుడు. కవిపండిత పోషకుడు. నిజాం ఉల్ ముల్క్ తర్వాత అతని రెండో కుమారుడు నాసర్‌జంగ్ రాజయ్యాడు (1748-51). తర్వాత నిజాం మూడో కొడుకు సలాబత్ జంగ్, ఆ తర్వాత బ్రిటిష్ వాళ్ళ సహాయంతో

నాలుగో కొడుకు నిజామలీఖాన్ (1761–1803) రాజయ్యాడు. తర్వాత సికిందర్ జా (1803–1829) రాజయ్యాడు. ఇతని కాలంలోనే బ్రిటిషు రాజ ప్రతినిధికి కోఠిలో భవ్య భవనం నిర్మింపబడింది. అది రెసిడెన్సీగా ప్రసిద్ధిచెందింది. ఇక్కడ నుంచి బ్రిటిషు ప్రభుత్వం నిజాంను నడిపించే వాళ్ళు. ఆ తర్వాత నాసిరుద్దౌలా (1829–1857) రాజయ్యాడు. నాసిరుద్దౌలా నాలుగో అసఫ్ జాహీ బిరుదంతో గద్దెనెక్కాడు. ఇతని కాలంలో చాదర్‌ఘాట్ బ్రిడ్జి, ఎడ్వర్డ్ మెమోరియల్ దవాఖానా నిర్మింపబడ్డాయి. ఈ దవాఖానా తర్వాత గాంధీ దవాఖానాగా మారింది. నాసిరుద్దౌలా కాలంలోనే "వహబీ ఉద్యమం" పంజాబ్‌లో సిక్కులు నడిపారు. ఇంగ్లీషు వాళ్ళ ప్రభుత్వాన్ని అంతం చేయటం దీని లక్ష్యం. నాసిరుద్దౌలా సోదరుడొక్కడు ముబారిజ్ ఉద్దౌలా హైద్రాబాదులో ఆ ఉద్యమాన్ని నడిపాడు. 1857లో జరగబోయే సిపాయిల ఉద్యమానికి ముందలి ప్రకంపనలు ఇవి అని చెప్పాలె. నాసిరుద్దౌలా కాలంలోనే తురాబ్ అలీఖాన్ సాలార్‌జంగ్ 1853లో ప్రధానమంత్రి అయ్యాడు. అప్పుల్లో కూరుకుపోయిన నిజాం రాజ్యాన్ని రక్షించటానికి సంస్కరణలు చేపట్టాడు. 1858 నుంచి మొఘలు నమూనా నాణాలు కాక హాలీ సిక్కా పేరుతో అసఫ్‌జాహి సిక్కాలు ముద్రింపబడినాయి. పరిశ్రమల స్థాపనకు ప్రోత్సాహమిచ్చాడు. పారిశ్రామిక ప్రదర్శన ఏర్పాటు చేశాడు. నైజాంలో ఆధునికీకరణం అభివృద్ధికి ఇదే నాంది.

నాసిరుద్దౌలా తర్వాత అతని కొడుకు అఫ్జలుద్దౌలా (క్రీ.శ.1857–1869) రాజయ్యాడు. సిపాయిల తిరుగుబాటు జరుగుతున్న కాలంలో గద్దెనెక్కాడు. ఆంగ్లేయులకు వ్యతిరేకంగా నిజాం రాష్ట్రంలో మౌల్వీ ఇబ్రహీం తుర్రే బాజ్‌ఖాన్, మౌల్వీ అల్లా ఉద్దీన్ రోహిల్లాలు విప్లవకారులకు నాయకత్వం వహించి తిరుగుబాటు ఉద్యమం నడిపారు. కోఠిలోని రెసిడెన్సీ భవనాన్ని ముట్టడించారు. అల్లాఉద్దీన్ మౌల్వీని బంధించి అండమాన్‌కు పంపించారు. 1857 సంవత్సరంలో ఉత్తర భారతంలో తిరుగుబాటు వార్తను వినగానే హైద్రాబాదులో తీవ్రమైన అలజడి చెలరేగింది. ఎంతోమంది సైనికులను ఉరితీసారు. రోహిల్లాలకు నాయకత్వం వహించిన తుర్రేబాజ్‌ఖాను బ్రిటిషు రెసిడెన్సీ మీద దాడి చేసాడు. తుర్రెబాజ్‌ఖాన్‌ను బంధించి 1859లో చంపారు. రెసిడెన్సీ బయట ద్వారానికి ఆయన శవాన్ని వేలాడదీసారు.

మంత్రి సాలార్‌జంగ్ గట్టి రక్షణ ఏర్పాట్లతో 1857 నాటి తిరుగుబాటు దారులు ఎందరో బంధింపబడినారు. అండమాన్ జైలు పంపబడినారు. గోండులు రాంజీ నాయకత్వంలో బ్రిటిషు వాళ్ళనెదిరించారు. రాంజీగోండును నిర్బంధించి నిర్మల్‌లో చెట్టుకు వేలాడదీసారు. ఇప్పటికీ ఆ చెట్టును రాంజీగోండు చెట్టు అని అంటారు. నైజాం రాజ్యంలో 1857లో తిరుగుబాటు విప్లవం తీవ్రంగా జరిగి ఎందరో చనిపోయారు. అండమాన్‌కు యావజ్జీవ కారాగార శిక్ష విధింపబడి పంపబడినారు. ఇదంతా ఏదీ చరిత్రకు ఎక్కలేదు. భీమ్‌రావు దేశాయి కొబ్బల్ దుర్గమును స్వాధీనం చేసుకొన్నాడు. భీమ్‌రావు వీరమరణం చెందాడు. ఆ కాలంలో తాంతియాతోపే వార్తాహరులు హైదరాబాదుకు వచ్చి సలహాలిచ్చేవారు. రాయెరాయ్ రాయాన్ జాగీరుదారు అతని దగ్గర ఉద్యోగిగా ఉన్న సోసాజీపండిత్, 1857లో నానాసాహెబ్ పేష్వాకు ఉత్తరం పంపారు. ఈ విధంగా నానాసాహెబ్ పేష్వా, తాంతియాతోపే వంటి తిరుగుబాటు దారులతో సంబంధం పెట్టుకొని నిజాం రాష్ట్రంలో 1857 నాటి ఆంగ్లేయులకు వ్యతిరేకంగా తిరుగుబాటు ఉద్యమాలు జోరుగా సాగాయి. సురపురం సంస్థానాధిపతి వెంకటయ్య నాయక్‌ను జైలుకు పంపారు. తిరుగుబాటులో పాల్గొన్న మోర్తాడ్ భూస్వామి రుక్మారెడ్డిని జైలుకు పంపారు. రాజాదీప్‌సింగ్ కౌలాస్ కోటను గెరిల్లా శిక్షణా కేంద్రంగా చేసాడు. కౌలాస్ పట్వారీ రంగారావును అండమాన్‌కు 1867లో పంపారు. సంస్థానాధిపతి రాంరావును అండమాన్‌కు పంపారు. దాంతో నిజాం రాష్ట్రంలో జరిగిన సిపాయి తిరుగుబాటు అంతమొందింది.

అఫ్జలుద్దౌలా తర్వాత అతని కొడుకు మహబూబు అలీఖాన్ (1869–1911) రాజయ్యాడు. ఇతని కాలంలో విద్యావ్యాప్తికి కృషి జరిగింది. పాశ్చాత్య విద్య విజ్ఞానాలు సంస్కృతి ప్రభావాలతో ఆధునికత కొంతవరకు నిజాం రాష్ట్రంలో ప్రవేశించింది. 1871లో తంతి తపాలా శాఖ ఏర్పడింది. వాడి సికింద్రాబాదు రైల్వే మార్గం 1874లో పూర్తయింది. సికింద్రాబాదు విజయవాడ రైలు రాకపోకలు మొదలయ్యాయి. కోర్టులు వెలిసాయి. పనుల పద్ధతి సంస్కరింపబడింది. పాలనా సౌలభ్యానికి వేరువేరు శాఖలు ఏర్పడినాయి. 1885లో విద్యావ్యాప్తికి సిటి హైస్కూలు చాదర్ఘాటు హైస్కూలు స్థాపించబడింది. క్రిస్టియన్ మిషనరీలకు స్కూళ్ళు స్థాపించే అనుమతి లభించింది.

ఎన్నో స్కూళ్ళు కాలేజీలు స్థాపించబడినాయి. 1864లో మొట్టమొదట ఇంగ్లీషు పత్రిక దక్కన్ టైమ్స్ ప్రారంభమైంది. 1885లో దాదాపు 25 ఇంగ్లీషు ఉర్దూ పత్రికలు వచ్చాయి. షౌకతుల్ ఇస్లాం వంటి వాళ్ళు పత్రికా స్వాతంత్ర్యానికి పోరాటం చేసారు. ఇంతవరకు పార్శీ రాజభాషగా ఉండేది. 1884లో ఉర్దూ రాజభాషగా చేయబడింది. బ్రిటిషు పాలిత ప్రాంతాల్లో జరిగే స్వాతంత్ర్య ఉద్యమ ప్రభావాలు నిజాం రాష్ట్రంలో ప్రవేశించసాగాయి. శాంతియుత పోరాటాలు జరిపేందుకు కోరట్‌కర్, వామన నాయక్, మాడపాటి హనుమంతరావులు నడుం కట్టారు. అఘోరనాథ ఛటోపాధ్యాయ, ముల్లా అబ్దుల్ ఖయూం, రామచంద్రపిళ్ళై వంటి వాళ్ళు 1885లో జరిగిన జాతీయ కాంగ్రెసు స్థాపనను సమర్థించారు. హైద్రాబాదు వాసి ప్రసిద్ధ కవయిత్రి సరోజినీదేవి నాయుడు గాంధీజీతో భుజం కలిపి జాతీయోద్యమంలో పాల్గొన్నది. హ్యూమనిటేరియన్ లీగ్‌ను స్థాపించి భాగ్యరెడ్డి వర్మ హరిజనోద్ధరణకు కృషి చేసాడు. తెలంగాణలో పునరుజ్జీవనానికి నాందిగా గ్రంథాలయోద్యమం ఆరంభమైంది. పుస్తకపఠనం అందులో తెలుగును చదవటం వ్రాయటం నేర్చుకొని విద్యావంతులు విజ్ఞానవంతులై ప్రజలు చైతన్యం పొందాలని గ్రంథాలయోద్యమం సాగింది. 1901లో కొమర్రాజు లక్ష్మణరావు, మునగాల, రాజా నాయని వెంకట రంగారావు, రావిచెట్టు రంగారావులు సుల్తాన్‌బజారులో శ్రీకృష్ణ దేవరాయాంధ్ర భాషా నిలయం స్థాపించారు. ఇప్పటికీ నడుస్తున్నది. 1904లో హనుమకొండలో రాజరాజ నరేంద్ర ఆంధ్ర భాషా నిలయం, 1905లో సికింద్రాబాదులో ఆంధ్ర సంవర్ధని గ్రంథాలయం స్థాపించబడినాయి. 1911–1920 మధ్యకాలంలో ఏడు గ్రంథాలయాలు కొమర్రాజు ప్రేరణతో వచ్చాయి. 1906లో కొమర్రాజు లక్ష్మణరావు, నాయని వెంకటరావు పుస్తక ప్రచురణల కోసం రచనలకు ప్రేరణనిస్తూ రచనల పోటీలను పెడ్తూ విజ్ఞాన చంద్రికా గ్రంథమండలిని స్థాపించారు. ఆ విధంగా ప్రజలను ముందుగా చైతన్యవంతులను చేసే కార్యక్రమాలు జరిగాయి.

మహబూబ్ అలీఖాన్ తర్వాత అతని కొడుకు ఉస్మాన్ అలీఖాన్ (1911–1948) ఏడో నిజామయ్యాడు. ఆ నిజాం 1919లో ఉస్మానియా విశ్వవిద్యాలయాన్ని స్థాపించి నిజాం రాష్ట్రంలో విశ్వవిద్యాలయం లేని కొరత తీర్చాడు. ఆధునిక శిక్షణ

వైపు దృష్టిని సారించాడు. కాని ఈ విశ్వవిద్యాలయంలో రాజభాష ఉర్దూ మాధ్యమంగా ఉండేది. ఉస్మాన్‌సాగర్, నిజాం సాగర్, హిమాయత్ సాగర్ వంటి చెరువులను తవ్వించాడు. నీటిపారుదల సౌకర్యం కల్పించాడు. సిర్పూర్ కాగితం మిల్లు, బోధన్ చక్కర మిల్లు, అజంజాహీ బట్టల మిల్లు, సింగరేణి బొగ్గుగనుల తవ్వకాలు, చార్మినారు సిగరెట్ ఫ్యాక్టరీ ఆ విధంగా ఎన్నో పరిశ్రమలు స్థాపించబడినాయి. 1914లో పురావస్తు శాఖను ఏర్పాటు చేసి అజంతా ఎల్లోరా రామప్ప వంటి చారిత్రక ప్రదేశాలను సంరక్షించాడు. 1927లో ఉస్మానియా దవాఖానా 1919లో హైకోర్టు, రోడ్డు రవాణా సంస్థ 1942లో స్టేట్‌బ్యాంక్ ఆఫ్ హైద్రాబాదు స్థాపించబడినాయి. నిజాం రాష్ట్రం ఆధునికతవైపు ఇంకా ముందుకు పయనించింది.

కాని ప్రజలు నిజాం రాజు పాలనలో కాక దొరల, దేశముఖ్‌ల, జాగీర్‌దార్ల సంస్థానాధీశుల కింద బానిస బతుకులు బతికారు. ఎటువంటి స్వాతంత్ర్యం లేకుండా పన్నుల విధింపులో లెవీధాన్యం చెల్లింపుతో కౌలుధాన్యం కొలవటంతో పేదరికంతో రైతులు మగ్గిపోయారు. దొరల అధికారుల దౌర్జన్యాలు, వెట్టిచాకిరితో కింది కులాల వాళ్ళు కృశించిపోయారు. నోరెత్తి మాట్లాడే అధికారం లేదు. ప్రజలు విజాతీయ సంస్కృతి భాషలతో బానిసల బతుకు బతికారు. నాలుగు శాతం అక్షరాస్యతతో అజ్ఞానాంధకారంలో ఉండిపోయారు. తమ భాషా సంస్కృతులకు సాహిత్యానికి దూరమయ్యారు.

1921 నవంబరు 12వ తారీఖున వివేకవర్ధని ప్రాంగణంలో కర్వే పండితుని అధ్యక్షతలో సంఘసంస్కరణ సభ జరుగుతుండగా ఆ సభలో న్యాయవాది ఆలంపల్లి వెంకట రామారావు తన ఉపన్యాసాన్ని తెలుగులో ఆరంభించగా సభలోని సభ్యులు చప్పట్లతో హేళన చేసారు. అప్పుడు అవమానంగా భావించిన తెలుగువాళ్ళు అదే రాత్రి టేకుమాల రంగారావు ఇంట్లో సమావేశమై "నిజామాంధ్ర జనసంఘం" స్థాపించారు. అదే నిజాం ఆంధ్రోద్యమంలో మహత్తరమైన సంఘటనగా చరిత్రలోకి ఎక్కింది. ఆంధ్ర జనసంఘం స్థాపన జరిగిన సభలో మాడపాటి హనుమంతరావు, బూర్గుల రామకృష్ణారావు, ఆదిరాజు వీరభద్రరావు మొదలైన పెద్దలున్నారు. ఆ

సభలో నూరుగురు సభ్యులు చేరారు. 1922లో కొండా వెంకటరంగారెడ్డి అధ్యక్షతలో ఆంధ్ర జనసంఘం నియమావళిని రూపొందించారు. ఈ ఆంధ్ర జనసంఘానికి తెలంగాణ జిల్లాలన్నిటిలో శాఖలేర్పడ్డాయి. ఇదే సమయంలో తెలుగులో తెనుగు, నీలగిరి పత్రికలు స్థాపించబడినాయి. ఆంధ్ర జనసంఘం తెలుగు భాషా ప్రచారం, గ్రంథాలయాల స్థాపన, విద్యార్థులకు సహాయం, తాళపత్ర గ్రంథాలను సేకరించటం, పండితులకు సన్మానం, అనాథలకు సహాయం వంటి ఆదర్శాలతో ఏర్పడింది. సభలు పెట్టుకోవటానికి అనుమతి దొరకటమే కష్టంగా వుండేది. ఇక నిజాం పాలనలో రాజకీయ విషయాలను చర్చించటం నిషేధం. క్రమంగా ఆంధ్రజనసంఘం 1930లో ఆంధ్రమహాసభగా మారింది. 1930 నుంచి 1946 వరకు పదమూడు ఆంధ్ర మహాసభా సమావేశాలు జరిగాయి. వాటితో పాటు సమాంతరంగా పది మహిళా సభలు జరిగాయి. స్త్రీలలో చైతన్యం తేవటానికి ఈ మహిళా సభలు చాలా దోహదం చేసాయి. పర్దా నిషేధం, స్త్రీ విద్య కావాలి, బాల్య వివాహాల నిర్మూలనం వంటి చైతన్యాన్ని సమాజంలో ఈ సభలు తీసుకువచ్చాయి.

1926లో గోలకొండ పత్రిక స్థాపించబడింది. ఆంధ్ర మహాసభకు అండగా నిలిచింది. రైతుల సమస్యలను, వ్యవసాయ పశు చికిత్సలను ఆదర్శంగా తీసుకొని క్రమంగా 1937లో నిజామాబాదులో జరిగిన ఆంధ్ర మహాసభలో నిజామాంధ్రులకు బాధ్యతాయుత ప్రభుత్వం ఆదర్శమని ప్రకటించబడింది. అప్పట్నుంచి మహాసభ రాజకీయ సంస్థగా మారింది. 1944 మహాసభ కాంగ్రెసుగా (మితవాద) కమ్యూనిస్టు (అతివాద)గా చీలిపోయింది. 1938లో కాంగ్రెసు పార్టీ ఏర్పడింది. 1942లో క్విట్ ఇండియా ఉద్యమం తెలంగాణలో జరిగింది. చాలామంది అరెస్టయి జైలుకు పోయారు. 1946లో కడివెండిలో దొడ్డి కొమరయ్య వీరమరణం కమ్యూనిస్టు సాయుధ పోరాటం రూపం ధరించింది. దళాలుగా ఏర్పడి కమ్యూనిస్టులు సాయుధులై నిజాం పోలీసులను మిలిటరీని రజాకార్లను ఎదిరించి వీరోచితంగా పోరాడారు. స్త్రీలు సైతం వీరనారులై పోరాడారు. ఖాసిం రజ్వీ నాయకత్వంలో "రజాకార్లు" అనే వాలంటీర్ల దళం ఏర్పడి నిజాం పాలనను సమర్థించింది. మత మార్పిడులను అడ్డగించేందుకు ఉత్తర భారతం నుంచి వచ్చిన ఆర్యసమాజం వారు తెలంగాణలో సామాజిక విప్లవం తేవటమే కాక

నిజాంకు వ్యతిరేకంగా పోరాటం చేసారు. ఇంతలో 1947 ఆగస్టు 15వ తారీఖున భారతదేశానికి స్వాతంత్ర్యం వచ్చింది. అయినా నిజాం భారత యూనియన్‌తో కలువకుండా రజాకార్ల అండతో స్వతంత్ర దేశంగా ఉండాలని కలలు కన్నాడు. యుఎన్ఓకు కూడా పోయి వాదించాలని చూసాడు. కాని ఆనాటి హోంమంత్రి సర్దారు వల్లభాయి పటేల్ సమయ స్ఫూర్తితో తీసుకున్న నిర్ణయంతో పోలీసు చర్య పేరుతో మిలటరీ నిజాం రాష్ట్రంలో ప్రవేశించింది. దాంతో నిజాం లొంగిపోయి 17 సెప్టెంబరు 1948లో నైజాంను భారత యూనియన్‌లో విలీనం చేస్తూ రేడియోలో ప్రకటన చేసాడు. దాంతో నైజాం విమోచనం జరిగింది. నైజాం ఒక రాష్ట్రంగా 1952లో ఎలక్షన్లు జరిగాయి. బూర్గుల రామకృష్ణారావు ముఖ్యమంత్రిగా బాధ్యతాయుత ప్రభుత్వం ఏర్పడింది.

1901లో శ్రీకృష్ణదేవరాయాంధ్ర భాషా నిలయం గ్రంథాలయం స్థాపనకు పూర్వమే హైద్రాబాదులో 1872లో సోమసుందర్ మొదలియారు ముదిగొండ శంకరారాధ్యులు సికింద్రాబాదులో రెండు గ్రంథాలయాలు పెట్టారు. 1879లో యంగ్‌మెన్ ఇంప్రూవ్‌మెంటు సొసైటీ వారు హైద్రాబాదులో ఒక గ్రంథాలయాన్ని స్థాపించారు. 1892లో అసఫియా స్టేట్ సెంట్రల్ లైబ్రరీ, 1895 భారత్ గుణవర్ధక్ గ్రంథాలయం శాలిబండలో, 1896లో అబ్బర్ట్ రీడింగ్ రూం, బొల్లారంలో స్థాపించబడినాయి. శ్రీకృష్ణదేవరాయాంధ్ర భాషా నిలయం తర్వాత 1905లో ఆంధ్ర సంవర్ధనీ గ్రంథాలయం, 1913లో వరంగల్ మడికొండలో ప్రతాపరుద్ర ఆంధ్ర భాషా నిలయం, 1918లో రెడ్డి హాస్టల్ గ్రంథాలయం, 1913 కె.వి.రంగారెడ్డి వేమన గ్రంథాలయం 1923లో ఆంధ్ర విద్యార్థి సంఘ గ్రంథాలయం 1926లో ఆది హిందూ లైబ్రరీ, 1930లో జోగిపేట గ్రంథాలయం ఇంకా ఎన్నో జిల్లాల్లో గ్రామాల్లో గ్రంథాలయాలు స్థాపించబడి తెలంగాణలో తెలుగు భాషాభివృద్ధిని తెలుగు ప్రజల్లో విద్యా విజ్ఞానాన్ని అందించాయి. విద్యవిజ్ఞానోద్యమాన్ని నడిపాయి. తెలంగాణలో జాగృతిని తెచ్చాయి.

అసఫ్‌జాహీల కాలంలో గద్వాల, వనపర్తి సంస్థానాలు తెలుగు సాహిత్యానికి

కవి పండితులకు ఆదరణ కల్పించాయి. ఆంధ్రప్రాంతంలోని ప్రసిద్ధ కవిపండితులు గద్వాల సంస్థానం సందర్శించి సన్మానాలందుకున్న వారే. వనపర్తినేలిన రెండో రాజారామేశ్వరరావు మానవల్లి రామకృష్ణ కవిని పిలిపించి అమూల్యమైన గ్రంథాలను పరిష్కరింపజేశారు. వాటిల్లో నన్నెచోడకవి రచించిన "కుమార సంభవం" ఇంకా "నీతి సారముక్తావళి", "సకలనీతి సమ్మతం" "శ్రీరంగమహత్త్వం" ఉన్నాయి. కుమార సంభవం నన్నయకు పూర్వరచన అని మానవల్లివారు ఆ కావ్యపీఠికలో ప్రతిపాదించారు. దాంతో ఏదో జరగకూడనిది జరిగినట్లుగా పండితులందరు నన్నయే ఆది కవి అని సమర్థిస్తూ మానవల్లికవి వాదం మీద విరుచుకుపడి ఖండించారు. మానవల్లి ప్రతిపాదనను సమర్థించిన వాళ్ళు తక్కువ. ఇటువంటి పిడివాదం, కులం, శాఖల, ప్రాంతాల మీద అభిమానం తెలుగు సాహిత్య రచనకు చాలా హాని కలిగించిందని చెప్పాలె.

రామరాజ భూషణుని వసు చరిత్ర కావ్యం ప్రౌఢమైంది. శ్లేషాది అలంకారాలు ప్రతి పద్యంలో ఏదో ఒక అలంకార సంబంధమైన వివిధ శాస్త్ర పాండిత్యపరమైన చిక్కుముడి వుంటుంది. వ్యాఖ్యానం లేకుండ అర్థం చేసుకోవటం అసాధ్యం. అటువంటి కఠిన ప్రబంధానికి వేములవాడ నివాసి బహుగ్రంథ కర్త, రాజేశ్వరస్వామి భక్తుడు. క్రీ.శ. 1750 ప్రాంతం వాడైన సోమనాథ కవి "విద్వజ్జనరంజనీ" పేరుతో వ్యాఖ్యానం రచించాడు. ఈ వ్యాఖ్యానం తర్వాత నాలుగు వ్యాఖ్యలు వసు చరిత్రకు వచ్చినా సోమనాథ కవి రచించిన వ్యాఖ్యానమే ఉత్తమమైందని పండితుల అభిప్రాయం. అయితే ఈ వ్యాఖ్యానంలో కొంతభాగం నష్టం కాగా శేషాద్రి రమణ కవులు పూరించగా ఆధునిక కాలంలో వావిళ్ళ వారు వసుచరిత్రను సోమనాథుని వ్యాఖ్యానంతో 1926లో ముద్రించారు.

## ఒద్దిరాజు సోదరులు

సీతారామచంద్రరావు, రాఘవ రంగారావు ఒద్దిరాజు సోదరులుగా ప్రసిద్ధి చెందారు. వీరు వరంగల్లు జిల్లాలోని మానుకోట తాలుకా ఇనుగుర్తి గ్రామవాసులు దేశముఖ్‌లు. వీరు ఆంధ్ర ఆంగ్ల సంస్కృత ఉర్దూ పారశీ ఆది భాషలు నేర్చారు.

న్యాయశాస్త్రం వైద్యం జ్యోతిషశాస్త్రం, సంగీతశాస్త్రంలో పండితులు. విజ్ఞాన ప్రచారిణీ గ్రంథమాల పేరుతో గ్రంథమాలను నిర్వహించారు. వీరు 'తెనుగు' అనే వారపత్రికను నడిపారు. దీన్ని వారే ముద్రించి వితరణం చేసేవారు. సైకిల్ మీద పోయి పత్రికను పంచేవారు. అదే 1922లోనే నల్లగొండ నుండి 'నీలగిరి', 1926లో గోలకొండ పత్రికలు ఆరంభమయ్యాయి. "నీలగిరి'ని షబ్నవీసువారు స్థాపించాడు. కె.రాములు, గవ్వా సోదరులు, ఆదిరాజు వీరభద్రరావు వంటి వాళ్ళెందరో రచనలు చేశారు. 'తెనుగు' పత్రిక కన్నా ముందు తెలంగాణాలో మహబూబునగరం నుంచి శ్రీనివాస శర్మ 'హితబోధిని' పత్రికను సికింద్రాబాదు నుంచి స్వామి వెంకటరావు 'ఆంధ్రమాత'ను ప్రచురించారు. ఇవి ఎక్కువకాలం నడువలేదు. ఏడాది, ఎనిమిది నెలలు మాత్రమే నడిచాయి. నైజాంలో అక్షరాస్యత తక్కువ. తెలుగు మీద అభిమానం లేదు. దాంతో పత్రికలను కొని చదివేవారి సంఖ్య తక్కువ. ఒద్దిరాజు సోదరులు మద్రాసు పోయి కాశీనాథుని నాగేశ్వరరావును కలిసారు. బందరులో కృష్ణారావును కలిసారు. పత్రిక నడపటంలో గల కష్టనష్టాలను తెలుసుకొన్నారు. రాజకీయ వార్తల విషయంలో ప్రభుత్వం ఆంక్షల గురించి విన్నారు. అయినా ధైర్యంగా 'తెనుగు' పత్రికను ఆరంభించారు. ఇది వెయ్యి ప్రతుల వరకు ముద్రణ జరిగేదట. కష్టపడి ఒద్దిరాజు సోదరులు చందాదారులను సమకూర్చారు. 'తెనుగు' పత్రిక ఆరేండ్లు నడిచింది. తెలంగాణాలో సాహిత్య సాంఘిక రాజకీయ చైతన్యాన్ని కలిగించింది. 1922 ఆగస్టులో స్థాపించబడిన ఈ పత్రికకు శేషాద్రి రమణ కవులు, గంగుల సాయిరెడ్డి, రాయప్రోలు సుబ్బారావు వంటి వాళ్లెందరో వ్రాసారు.

ఒద్దిరాజు సోదరులు కొన్ని సంప్రదాయ రచనలు చేసారు. ప్రబంధాలు పద్య కావ్యాలు వ్రాసారు. శ్రీవైష్ణవ సంప్రదాయాలను చెప్పే కృతులను చికిత్స గ్రంథాలు వ్రాసారు. ఆ తర్వాత వాళ్ళు ఆధునిక ప్రక్రియలను అవగాహన చేసుకొని కథలు, నవలలు రచించారు. సామాజిక చారిత్రక నవలలు రచించారు. చారిత్రక నవలలతో దేశభక్తిని, త్యాగనిరతని ప్రబోధించారు. సామాజిక నవలలు కథల్లో ఆధునికతను చిత్రించారు. సమాజంలోని కుళ్లును విదేశీ వ్యామోహాన్ని నిరసించారు. ఒద్దిరాజు సోదరులు ఎనిమిది సాంఘిక నాటకాలు రాణా ప్రతాపసింహ చారిత్రక నాటకం

వ్రాసారు. సాంఘిక నాటకాల్లో ఆనాటి భూస్వాముల, అధికారుల దౌష్ట్యాన్ని, షావుకార్లు చేసే మోసాలను పేద ప్రజల బాధలను చిత్రించారు. రవీంద్రనాథ టాగోరు "నౌకాభంగము" నవలను తెనిగించారు. ఇంగ్లీషు సంస్కృత భాషల్లోను రచనలు చేశారు. వాళ్ళు జాతీయ వాదాన్ని మానవతా దృక్పథంతో రచనలు చేసి తెలంగాణలో సాంస్కృతిక పునరుజ్జీవనంలో పెద్దపాత్రను ధరించారు. సారస్వత రంగంలో దాశరథి వంటి ఆధునిక కవులను తయారు కావటానికి పూర్వరంగం సిద్ధం చేసారు. తమ రుద్రమదేవి నవలతో అడవి బాపిరాజు, నోరి నరసింహ శాస్త్రిలను, గోనగన్నారెడ్డి, తిక్కన సోమయాజి రుద్రమదేవి నవలలు వ్రాయటానికి వస్తువునందించారు. పత్రికా రంగంలోను ఎందరినో పత్రికా ప్రచురణకు ప్రేరేపించారు. ఆ విధంగా ఒద్దిరాజు సోదరులు తెలంగాణను మేల్కొల్పిన వైతాళికులయ్యారు.

ఒద్దిరాజు సోదరుల్లో సీతారామచంద్రరావు (1887-1956) రుద్రమదేవి చారిత్రక నవల వ్రాసి మద్రాసు విజ్ఞానచంద్రికా గ్రంథమండలి నవలల పోటీలో బంగారు పతకాన్ని గెలుచుకున్నాడు. ఈ నవల 1918లో ముద్రితమైంది. 1922లో పునర్ముద్రితమైంది. సీతారామచంద్రరావు "శౌర్యశక్తి, భ్రమర, బ్రాహ్మణ సాహసము" అనే చారిత్రక నవలలు వ్రాసాడు. "స్త్రీ సాహసము, ముక్తలవ" సాంఘిక నవలలు వ్రాసాడు. నాటకాలు, ఖండకావ్యం, "సౌదామినీ పరిణయం" అనే పద్యకావ్యాన్ని రచించాడు. ఇంకా అముద్రిత రచనలెన్నో ఉండిపోయాయి. సంస్కృతంలో ఆంగ్లంలో కూడా 60 వరకు రచనలు చేశాడు.

ఒద్దిరాజు రాఘవ రంగారావు (1894-1973) 'వీరావేశము, వరాహముద్ర" అనే చారిత్రక నవలలు, తపతీ సంవరణోపాఖ్యానమ్‌కు వ్యాఖ్యానం వ్రాసాడు. రాఘవరావు సంస్కృత రచనలు చేసాడు. 25 వరకు రచనలు చేసాడు. ఆనాటి పత్రికల్లో సోదరుల వ్యాసాలు ఎన్నో అచ్చయ్యాయి. ఆధునిక ప్రక్రియ నవలలే కాక కథలు కూడా వ్రాసారు. టాగోరు నవల "నౌకాభంగము"ను ఆంధ్రీకరించారు. ఒద్దిరాజు రాఘవ రంగారావు "లండన్ విద్యార్థి" ఒద్దిరాజు సీతారామచంద్రరావు "రక్తమూల్యము" కథలు "సుజాత" పత్రికలో అచ్చయ్యాయి. సీతారామచంద్రరావు

"నటి, అదృశ్య వ్యక్తి" (1928) కథలు సుజాత పత్రికలో అచ్చయ్యాయి. వాళ్ళ కథలు జాతీయ భావాలతో కూడి ఉన్నాయి. గ్రాంథిక భాషలో వ్రాసారు. అప్పటింకా వ్యవహారిక భాషలో వ్రాయాలన్న దృక్పథం రాలేదు. ఒద్దిరాజు సోదరులు ప్రాచీన సాహిత్య ప్రక్రియలు ఆధునిక ప్రక్రియలను కూడా వ్రాసారు. ఎన్నో విధాలుగా కాలం కంటే ముందుగా ఆలోచించి తెలంగాణలో ఆధునికతను తెచ్చిన వైతాళికులయ్యారు. వాళ్ళ భవనాన్ని రజాకార్లు కాల్చివేయటంతో రచనలెన్నో దొరకకుండా ఉన్నాయి. దొరికిన సాహిత్యాన్ని బట్టి, నడిపిన పత్రికను బట్టి వాళ్ళు ఆధునికతను ఆహ్వానించి ముందుకు నడిచి సమాజాన్ని ముందుకు నడపాలనుకున్న నవ్యతను ఆహ్వానించి తెలంగాణను జాగృతం చేసిన సంస్కర్తలు.

ఒద్దిరాజుల తర్వాత తెలంగాణ విమోచనోద్యమాన్ని నడిపిన నాయకులు, తెలంగాణ స్వాతంత్ర్య ఆకాంక్షను, పోరాటాన్ని ప్రేరేపించిన సాహిత్యం వ్రాసారు.

## మాడపాటి హనుమంతరావు

ఆంధ్రజన సంఘం ఏర్పడటానికి అది తర్వాత ఆంధ్రమహాసభగా మారి ఒక రాజకీయ పోరాట శక్తిగా మారటం – అంతా మాడపాటి హనుమంతరావు పూనికతోనే జరిగింది. "ఆంధ్ర పితామహ" అని అతనికి బిరుదం నిజాం వ్యతిరేకోద్యమంలో ఆద్యుడు కావటం చేత సార్థకమైంది. ఆ రోజుల్లో నిజాం 'ఆంధ్ర' శబ్దం వింటే జంకేవాడు. అందుకు అన్నిటికీ 'ఆంధ్ర' అనే నామకరణం చేసే వారు. ఆ రోజుల్లో ఆంధ్ర మహాసభలు జరపాలంటే నిజాం ప్రభుత్వం ఎన్నో ఆంక్షలు, అడ్డంకులు పెట్టేది. వాటిని తొలగించటానికి మాడపాటి, ఆనాటి నగర కొత్వాల్ విద్యా సంస్కర్త రాజబహద్దరు వెంకట రామారెడ్డి తోడ్పడి సభలను విజయవంతం చేసే వాళ్ళు. మాడపాటి ప్రయత్నంతోనే ఎన్నో సాహిత్య సాంస్కృతిక విద్యా సంస్థలు స్థాపించబడినాయి. సారస్వత సంస్థలను నెలకొల్పి తెలంగాణలో సాహిత్య చైతన్యాన్ని తెచ్చాడు. తన రచనలతో భావ విప్లవం తేవటానికి కృషి చేసాడు. అడవి బాపిరాజు మీజాన్ పత్రికా సంపాదకుడు నవలా రచయిత మాడపాటిని ఈ విధంగా ప్రస్తుతించాడు.

తెలుగుతనమూ తమకే లేదని
తెలుగు భాష తమదే కాదని
తెలుగు వారూ తామే కామని
తెలంగాణ మత్తులో ఉంటే
మంత్రపు కర్రా తిప్పారండీ
మాడపాటి వారు.

అన్ని రంగాల్లో తెలంగాణ వికాసాన్ని అభిలషించిన మనీషి. 1951 హైద్రాబాదు మున్సిపల్ మేయరుగా, 1958లో రాష్ట్ర శాసనమండలి స్పీకరుగా ఎన్నికై సేవలందించాడు.

తెలంగాణ విమోచనోద్యమ చరిత్రను మాడపాటి 'తెలంగాణా ఆంధ్రోద్యమము' (1950) గ్రంథంగా రచించాడు. ఆయన మొదట ప్రేమ్‌చంద్ కథలను ఉర్దూనుంచి అనువదించాడు. తర్వాత స్వతంత్రమైన కథలు వ్రాసాడు. పరిశోధనాత్మక, వివరణాత్మక వ్యాసాలు వ్రాసాడు. పారశీక కవులు సాదీ, ఫిరదౌసి కవితలను తెనిగించాడు. ఆయన తలమునకలుగా రాజకీయోద్యమంలో ఉన్నా సాహిత్య పిపాసతో రచనలు చేసాడు. ఆయనకు తెలుగు హిందీ ఉర్దూ మరాఠీ పారశీ భాషల్లో మంచి ప్రవేశం ఉంది. మాడపాటి రచించిన "హృదయ శల్యము" కథ గురజాడ "దిద్దుబాటు" (1910) కథ అచ్చయిన 'ఆంధ్రభారతి'లో 1912లో అచ్చయింది. "హృదయశల్యము" మొదట పంపించినా దాన్ని పక్కనబెట్టి దిద్దుబాటు కథ ముందుగా అచ్చు వేసారేమో తెలియదు. తెలంగాణ నుంచి తెలుగు కథ తెలుగులో కథా రచనారంభం కాలంలోనే రావటం విశేషం. 'హృదయ శల్యము' కథ రుద్రమదేవి పాత్ర వల్ల చారిత్రకంగా అనిపించినా ఆ కథ సమకాలిక స్త్రీల సమస్యనే చిత్రిస్తున్నది. తెలంగాణ నుంచి వచ్చిన మొట్టమొదటి కథ. ఆధునిక ప్రక్రియ కథ తొలినాళ్ళలోనే తెలంగాణలో అడుగు పెట్టింది, వికసించింది. 'నేనే'అని మరో స్వతంత్ర కథను మాడపాటి వ్రాసాడు. రెండు కథలు సంఘ సంస్కరణలు భావాలు గల కథలు. ప్రేమ్‌చంద్ ఏడు కథలను అనువదించాడు. మాడపాటి ఏడు కథలు 1915లోనే 'మల్లికాగుచ్ఛము' పేరుతో మచిలీపట్నం నుంచి పుస్తకంగా ప్రచురించబడినాయి. 1940లో అణాగ్రంథమాల

హైద్రాబాదు వారు రెండు కథలను 'మాలతీ గుచ్ఛము' పేరుతో ప్రచురించారు. ప్రేమ్‌చంద్ పీడిత ప్రజలను గురించి వ్రాసిన కథలనే ఆయన అనువాదానికి ఎన్నుకున్నాడు. నైజాంలోనూ అటువంటి పీడిత ప్రజల జీవితాలకు దగ్గరగానే ఉన్నాయనే ఆ కథలను ఎన్నుకొని వుంటాడు. మొత్తంమీద మాడపాటి కాలం నుంచి కూడా తెలంగాణ కథా రచయితలు ప్రేమ్‌చంద్ కథల చేత వస్తువు కథన శిల్పం చేతనే ప్రభావితులయ్యారు. కాని వాళ్ళ మీద ఇంగ్లీషు బెంగాలీ రచయితల ప్రభావం కన్పించదు. అందుకే తెలంగాణ కథ ఆంధ్ర ప్రాంతాల కథ కన్నా భిన్నమైన వస్తువు ఇతివృత్తం శిల్పాలతో వికసించింది.

## సురవరం ప్రతాపరెడ్డి

సురవరం బహుముఖ ప్రజ్ఞాశాలి. సామాజిక చరిత్ర, పరిశోధన గ్రంథాలు రచించాడు. కథలు, నాటకాలు, కవిత్వం వ్రాసాడు. పత్రికా సంపాదకత్వం నిర్వహిస్తూ ఎన్నో రకాల వ్యాసాలు వ్రాసాడు. 1932లో ముడుంబై వెంకట రాఘవాచార్యులు ఆధునిక భావ కవిత్వము పేరుతో వ్యాసం వ్రాసి గోలకొండ పత్రికకు పంపాడు. దానిలో ఆయన తెలంగాణలో తెలుగు కవులే లేరు అని వ్రాసాడు. అది ప్రతాపరెడ్డి గారికి తెలిసి ఆ చులకన భావనకు స్పందించి రెండేండ్లు శ్రమించి 354 మంది తెలంగాణ కవుల కవితలతో గోలకొండ కవుల సంచిక ప్రచురించాడు. దాన్నొక ఆత్మగౌరవానికి సవాలుగా తీసుకొని సురవరం ఆ సంచికను కవుల ఫోటోలతో సహా వేసాడు. ఆ సంచికలో భావ కవితా ప్రక్రియకు చెందిన కవితలెన్నో వున్నాయి. గోలకొండ కవుల సంచిక ఒక చరిత్రను సృష్టించింది. తెలంగాణలో తెలుగు కవులు పూజ్యం కాదు పూజనీయులు అని సురవరం ప్రకటించాడు. 1952లో మొట్టమొదట కేంద్ర సాహిత్య అకాడమీ అవార్డు అందుకున్న "ఆంధ్రుల సాంఘిక చరిత్ర"ను సురవరం ఎన్నో కావ్యాలను పఠించి అధ్యయనం చేసి సామాన్య జనుల జీవితమే విధంగా వుండేదో తెలిపారు. చరిత్ర అంటే రాజుల చరిత్ర కాదు సామాన్యుని జీవన చరిత్ర అని చెప్పే గ్రంథం – మొదటి గ్రంథం ఇది. 1929లో వ్యాసరచనతో ఆరంభమైన ఈ గ్రంథ రచన 1949లో పుస్తకంగా ముద్రింపబడింది.

సురవరం అరెవీరులు (1924) నవలను రచించాడు. జానపద కథను తీసుకొని వ్రాసాడు. ఇది అసమగ్రంగా వుండిపోయింది. ఇది సినిమాగా కూడా వచ్చింది. ఆయన మరో నవల 'శుద్ధాంత కాంత' (1913). అది అముద్రితంగా వుండిపోయింది. గ్రాంథిక భాషలో వుంది.

సురవరం 'మొగలాయి కథలు' పేరుతో లోకంలో వ్యాప్తిలో వున్న కథలను తీసుకొని ఆధునిక ప్రక్రియలో చక్కని కథన శిల్పంతో వ్రాసాడు. ఇది అణాగ్రంథమాల వారు ప్రచురించారు. ఇవి 11 కథలు. ఇవిగాక 'సురవరం కథలు' పేరుతో 11 కథలు 1940 దశకంలో పత్రికల్లో అచ్చయిన కథలను ఆంధ్ర సారస్వత పరిషత్తు వారు 1987లో ప్రచురించారు. సురవరం కథల్లో తెలంగాణ యాస జాతీయాలు పలుకుబడులు కన్పిస్తాయి. అక్కడక్కడ సందర్భానుకూలంగా ఉర్దూ పదాలు చోటు చేసుకున్నాయి. హిందువుల పండుగలు, రామాయణ విశేషములు ఆయన పరిశోధనా దృక్పథాన్ని చాటే గ్రంథాలు, ఉచ్చల విషాదం, భక్త తుకారాం నాటకాలు వ్రాసాడు. భక్తతుకారాం రంగస్థలం మీద ప్రదర్శింపబడింది. సురవరం కవిత్వం కూడా వ్రాసాడు. గోలకొండ పత్రికతో సురవరం తెలంగాణ ప్రజల్లో జాతీయ చైతన్యం తెచ్చారు. తెలంగాణలో ఏ సంస్థ ఏర్పడినా ఏ సభ జరిగినా సురవరం లేనిదే జరిగేది కాదు. అప్పటి హైద్రాబాదు నగర కొత్వాలు రాజబహద్దరు వెంకట రామరెడ్డికి ఆయన సన్నిహితుడుగా ఉండేవాడు. సురవరం గ్రంథాలయోద్యమంతోను సంబంధమున్నవాడు. రెడ్డి వసతి గృహంలో ఒక మంచి గ్రంథాలయం నిర్మించాడు. ముద్రితాముద్రిత గ్రంథాలను సేకరించి శ్రీకృష్ణదేవరాయాంధ్ర భాషా నిలయంలో పెట్టాడు. ఆయనకు జానపద సాహిత్య సేకరణలోను అభిరుచి ఉండేది.

"హైందవ ధర్మవీరులు"లో 16 మంది వీరుల సాహస చరిత్రలను కూర్చాడు. సురవరం సామాన్య జనుల ప్రజాస్వామ్య హక్కులను వివరిస్తూ "ప్రజాధికారములు" వ్రాసాడు. ఈ రెండు గ్రంథాలను దేశోద్ధారక గ్రంథమాల ప్రచురించింది. రాజబహద్దురు వెంకట రామారెడ్డి జీవిత చరిత్రను సురవరం వ్రాసాడు. సామాన్య కుటుంబంలో జన్మించిన రాజబహుద్దురు హైద్రాబాదు నగర కొత్వాలుగా ఎదిగి

ఎన్నో సంస్థలను స్థాపించి గ్రామాల్లో నివసించే వాళ్ళకు హాస్టలు పెట్టి విద్యార్జన సౌకర్యాలు కల్పించిన మహనీయుడు కొత్వాలు. తెలంగాణ చరిత్రలో ఒక ప్రధాన పాత్ర వహించిన రాజబహద్దరు చరిత్రను సురవరం సరళశైలిలో రచించాడు.

నైజాం రాజ్యంలో ఎటువంటి రాజకీయ సాంస్కృతిక చైతన్యం లేనికాలంలో సురవరం గోలకొండ పత్రికను నడిపి తెలుగు ప్రజలు మాతృభాషలో చదువుకునే అవకాశం కల్పించాడు. రాజకీయ సాంస్కృతిక చైతన్యం తెచ్చాడు. ఆ రోజుల్లో ఎన్నో ఉర్దూ పత్రికలు. కాని తెలుగు పత్రికలు వార్తలందించేయి లేవు. రాజబహద్దురు ప్రేరణతో సురవరం గోలకొండ పత్రికను స్థాపించాడు. తెలంగాణ తెలుగు పత్రికలు 1913లో హితబోధిని, 1917లో ఆంధ్రమాత, 1922లో నీలగిరి, తెనుగు, 1923లో ఆంధ్రాభ్యుదయము, శైవ ప్రచారిణి, 1926లో దేశ బంధు, 1927లో సుజాత పత్రికలు వచ్చాయి. కాని అన్ని కొంతకాలమే నడిచి ఆగిపోయాయి 'సుజాత' వంటి పత్రికలు ఆంధ్రప్రాంతాల వారి చలం వంటి రచయితల రచనలను అచ్చువేసేవారు. కాని ఆంధ్ర ప్రాంతాల్లోని పత్రికలు తెలంగాణ రచయితల కవుల రచనలను పక్కన పెట్టే వాళ్ళు. అది సురవరం వారిని బాధించేది. సురవరం గోలకొండ పత్రిక మూలంగానే కాక "విజ్ఞాన వర్ధిని పరిషత్తు" స్థాపించి హైద్రాబాదులో తెలంగాణలో రచయితలు కవులు లేరని వాళ్ళను తయారు చేయాలని ప్రోత్సాహాన్నియ్యాలని సంకల్పించాడు. 1929 హైద్రాబాదులోని సీతారాంబాగ్‌లో "వేదాంతవర్ధిని" సంస్కృత కళాశాల పెట్టారని తెలిసి నాగులపల్లి కోదండరామారావుతో కలిసిపోయి నిజాంకు ఈ విషయం తెలిపి ఆ కళాశాలకు ఆర్థిక సహాయమందించాడు. అట్లా ఎన్నో విద్యా సంస్థలతో అతనికి అనుబంధం ఉండేది. గోలకొండ పత్రిక అంటే సురవరం, సురవరం అంటే గోలకొండ పత్రిక గుర్తుకు వస్తాయి. ఆ విధంగా తెలుగు భాషాసేవ, జాతీయాభిమానం ధ్యేయాలుగా సురవరం ఆ పత్రికను నడిపాడు. గోలకొండ పత్రిక నిజాం రాష్ట్రాంధ్రుల కీర్తి ప్రతిభలను చాటింది. 1947లో సురవరం గోలకొండ పత్రికను విడిచి పెట్టిపోయేంత వరకు సంపాదకీయ వ్యాసాలు, వ్యాసాలు, శీర్షికలు, విమర్శలు ఎన్నో వ్రాసాడు. తెలంగాణ పత్రికా రంగాన్ని సాహిత్యాన్ని సుసంపన్నం

చేసాడు. తెలంగాణ ఆంధ్రోద్యమం, తెలంగాణ విమోచనోద్యమాలకు గోలకొండ పత్రిక అండగా నిలిచి చారిత్రకమైన పాత్రను నిర్వహించింది. ఆంధ్ర మహాసభ రాజకీయాలతో తలమునకలై వుండగా తెలుగు భాషా సాహిత్యాభివృద్ధి కోసం సురవరం ప్రతాపరెడ్డి 1943లో ఆంధ్ర సారస్వత పరిషత్తును స్థాపించాడు. అది ఇప్పటికీ భాషా సాహిత్యాభివృద్ధికి సి.నారాయణరెడ్డి నేతృత్వంలో పని చేస్తున్నది.

సురవరం తెలంగాణ విద్య విజ్ఞానాభివృద్ధికి కృషి చేసిన తెలంగాణ వైతాళికుడు. 1953లో కన్నుమూసాడు.

కొమర్రాజు లక్ష్మణరావు, మాడపాటి హనుమంతరావులతో పాటు సురవరం తెలంగాణను చైతన్యవంతం చేసిన వైతాళికుడు.

## సోమరాజు ఇందుమతీబాయి

గోలకొండ కవుల సంచికలో చోటు చేసుకున్న పది మంది కవయిత్రుల్లో చెప్పుకోదగిన కవయిత్రి ఇందుమతీబాయి. ఈమె ఊటుకూరు లక్ష్మీకాంతమ్మ వ్రాసిన "ఆంధ్ర కవయిత్రులు"లో చోటు చేసుకుంది. ఈమె శకుంతలా పరిణయము, గౌరి అనే ఖండ కావ్యాలు, వేణు గోపాలస్వామి శతకం రచించింది. గోలకొండ కవుల చరిత్రలో చేరిన మరో కవయిత్రి వరంగల్ నివాసి **కందాళ బాలసరస్వతి**. రామన్నపేట నివాసి. 'పరిణయ నాటకము' రచించింది.

## రూప్ఖానుపేట రత్నమ్మ

మరో కవయిత్రి రూప్ఖానుపేట రత్నమ్మ పర్గి నివాసి. వెంకట రమణ శతకము, శ్రీనివాస శతకము, కృష్ణుని దశావతార వర్ణన పద్యాలు రచించింది. గోలకొండ కవుల సంచికలోని ఆమె మూడు కంద పద్యాలు సరళరమ్యంగా వున్నాయి.

## దాశరథి కృష్ణమాచార్యులు

దాశరథి 1925లో ఖమ్మం జిల్లా చినగూడూరులో జన్మించాడు. సంప్రదాయక విద్యనభ్యసించినా ఛాందస బుద్ధి అతనికంటలేదు. 1944-46లో ఆంధ్రమహాసభ, జాతీయోద్యమంలోనూ పాల్గొన్నాడు. 1947-48లో జైలు శిక్షననుభవించాడు. జైలు

గోడలమీద బొగ్గుతో-

ఓ నిజాము పిశాచమా కానరాదు
నిన్ను బోలిన రాజు మాకెన్నడేని
తీగెలను తెంపి అగ్నిలో దింపినావు
నా తెలంగాణ కోటి రత్నాల వీణ

పద్యాన్ని వ్రాసేవాడు. నిజాంను రజాకార్లను ఎదిరించాడు. పైపద్యం తర్వాత "అగ్నిధార" కవితా సంపుటిలో చేరింది. దాశరథి కవితలు - అగ్నిధార, రుద్రవీణ, మహాంద్రోదయం, మహాబోధి, పునర్నవం, తిమిరంతో సమరం మొదలైన కవితా సంపుటాలుగా వచ్చాయి. మధురమైన సినిమా పాటలు వ్రాసాడు. సాహిత్య విలువలున్న పాటలు అవి. పద్య కవిత్వం, వచన కవిత్వం గేయాలు వ్రాసాడు. గాలిబ్ గజళ్ళను "గాలిబ్ గీతాలు" (1961)గా ప్రచురించాడు. బాలల గీతాలు కూడా రచించాడు. 'మహాశిల్పి జక్కన' నవలను రచించాడు.

దాశరథి జాతీయాభిమానం, దేశభక్తి గల కవి. అభ్యుదయవాది. మానవతా వాదాన్ని విశ్వసించిన వాడు. నెహ్రూ సోషలిజాన్ని అభిమానించాడు. గాంధీ, బుద్ధుడు అతనికిష్టమైన శాంతిదూతలు. నిజాం వ్యతిరేక పోరాటంలో పాల్గొన్న ఈ కవి హింసాయుతమైన యుద్ధాన్ని కాక శాంతిని కాంక్షించాడు.

దాశరథి సంస్కృతం, తెలుగు, ఉర్దూ, పారశీ, ఇంగ్లీషు భాషలు నేర్చినవాడు. ఉస్మానియా విశ్వవిద్యాలయం నుంచి బి.ఏ. పట్టా పొందాడు. యౌవన దశలోనే తెలంగాణ పోరాటంలో అడుగు పెట్టాడు. 1946లో ఉద్యమ కవిగా, ప్రజాకవిగా రూపొందాడు.

"మా ప్రజలను శ్రమజీవుల
సమభావుల నణచలేరు
ఆర్పలేరు..."

అన్నాడు దాశరథి. శ్రమజీవుల బడుగు వర్గాల పక్షంలో నిలబడి స్వాతంత్ర్య

పోరాటం చేసాడు. జైలుకు పోయి కఠిన శిక్షననుభవించాడు. 1944లో పోలీసులు అరెస్టు చేయటానికి వస్తే పారిపోయి అడవుల్లో దాచుకున్నాడు. తర్వాత పట్టుబడి జైలు పాలయ్యాడు.

"దగాకోరు బడాచోరు రజాకారు పోషకుడు వూళ్ళకూళ్ళు అగ్గిపెట్టి ఇళ్ళన్నీ కాలబెట్టి పెద్దరికం చేస్తావా" అంటూ ధైర్యంగా నిజాంను ఎదిరించిన విప్లవ కవి దాశరథి. అతని కవిత్వం బలంగా వుంటుంది. ఆవేశం వుంటుంది. చైతన్యం కలిగిస్తుంది. అతనిది కేవలం కుర్చీలో కూర్చొని బల్లమీది కాగతంపై వ్రాసిన కవిత్వం కాదు. విప్లవజ్వాలలో కాలి కఠిన శిక్షణల నుంచి వచ్చిన కవిత్వం. 1987లో రష్యా పర్యటన చేసి వచ్చిన తర్వాత గుండెపోటుతో మరణించాడు. అతని జ్వాలాలేఖిని ఎప్పటికి ఆరిపోనిది.

## వట్టికోట ఆళ్వారుస్వామి

ఆళ్వారుస్వామి (1915–61) సామాన్య వ్యక్తి నుంచి ఉద్యమకారునిగా రచయితగా ఎదిగాడు. 19వ శతాబ్దారంభం నుంచి 1950 వరకు అర్ధశతాబ్ద కాలం తెలంగాణ విమోచన పోరాటంలో పాల్గొనని కవి రచయితలు లేరు. జైలు పాలు కానివాళ్ళు లేరు. అన్ని వర్గాల నుంచి నిజాంను రజాకార్లను వ్యతిరేకించే పోరాటంలో పాల్గొన్నారు. పోరాటంలోకి దిగిన వాళ్ళు ఉద్యమంలో పనిచేస్తూ ఉద్యమాన్ని ప్రజల పోరాటాలను చిత్రించే పాటలు, కథలు, నవలలు రచించారు. వట్టికోట ఆళ్వారుస్వామి మొదట గ్రంథాలయోద్యమం చేత ప్రభావితుడై స్వయంగా చదువుకొని విజ్ఞానవంతుడయ్యాడు. 1941 నుంచి రచనలు చేయటం ఆరంభించాడు. వ్యాసాలు, సమీక్షలు, కథలు, నవలలు వ్రాసాడు. 1944లో ఆంధ్ర మహాసభ చీలిపోయినప్పుడు ఆళ్వారుస్వామి కమ్యూనిస్టులతో రావి నారాయణరెడ్డి, బద్దం ఎల్లారెడ్డి పక్షంలో ఉండి పనిచేసాడు. నిజాం వ్యతిరేక పోరాటంలో పాల్గొన్నాడు. 1942–43లో 1946–51 కాలంలో కఠినమైన జైలు శిక్షననుభవించాడు. మనం మండేలా, పాబ్లో నెరుడాలను గురించి వాళ్ళ జైలు శిక్షలను గురించి ప్రజలను మేలుకొలిపిన వృత్తాంతాల గురించి చెప్పుకుంటాం. కాని మనవాళ్ళయిన దాశరథి కృష్ణమాచార్యులు, ఆళ్వారుస్వామి,

కాళోజి వంటి వాళ్ళు కఠినమైన కారాగారవాస శిక్షననుభవించి రాళ్ళు, సిమెంటు, పురుగులు కలిపిన అన్నం తిని కష్టాలపాలయి జైలు నుంచి వచ్చిన తర్వాత తమ రచనలతో ప్రజలను చైతన్యవంతులను చేసిన వృత్తాంతాలను గురించి గొప్పగా చెప్పుకోము.

జైలులో దాశరథి "ఓ నిజాము పిశాచమా..." అన్న పద్యాన్ని బొగ్గుతో గోడమీద వ్రాస్తే అధికారులు చెరిపేసేవారు. అప్పుడు ఆళ్వారుస్వామి బొగ్గు తీసుకొని జైలు గోడల నిండా ఆ పద్యాన్ని చెరిపేసే కొద్ది వ్రాసేవాడట. జైలులో వున్నప్పుడు జైలు శిక్షననుభవించే ఖైదీల జీవిత వృత్తాంతాలను తీసుకొని ఆళ్వారుస్వామి "జైలులోపల"" కథలు వ్రాసాడు. అవి 1952లో అచ్చయ్యాయి.

ఆళ్వారుస్వామి 1938లో దేశోద్ధారక గ్రంథమాల స్థాపించి 10 సంవత్సరాలలో 30 వరకు పుస్తకాలు అచ్చువేసి తానే స్వయంగా భుజానికి పుస్తకాల సంచి తగిలించుకొని తిరిగి అమ్మేవాడు. కాశీనాథుని నాగేశ్వరరావుకు దేశోద్ధారక బిరుదముంది. దాన్నే ఆళ్వారుస్వామి తన గ్రంథమాలకు పేరుగా పెట్టుకున్న దేశభక్తుడు. తెలంగాణలోని ప్రజలకు చదవడం అలవాటు చేయించాలె, విజ్ఞానాన్ని పంచి చైతన్యపరచాలె అని అతని ఉద్దేశం. గ్రంథమాలను నడపటం సులభమైన పనికాదు. కష్టనష్టాలకోర్చి ఆళ్వారుస్వామి ఈ గ్రంథమాలను నడిపాడు. ఇంట్లో ఒక మంచి గ్రంథాలయాన్ని కూర్చుకున్నాడు. 1952లో "ప్రజల మనిషి" నవలను అచ్చువేసాడు. 1938కి పూర్వం కాంగ్రెసు పార్టీ ఏర్పడక పూర్వం నైజాంలోని ప్రజల పరిస్థితులను పేదరికం, వెట్టిచాకిరి, దొరల దౌర్జన్యం, మతం మార్పిడుల, భూమి సమస్యలనెన్నిటినో వాస్తవికంగా చిత్రిస్తూ ఆళ్వారుస్వామి ఈ నవలను రచించాడు. తెలంగాణ పోరాట చరిత్రను మూడు సీక్వెల్ నవలలుగా వ్రాయాలని ఆయన ప్లాను వేసుకున్నాడు. "గంగు" రెండో నవల సగంలో ఉండగా మరణించాడు.

దేశోద్ధారక గ్రంథమాల తరఫున ""జీవనరంగం" పేరుతో నాటికలను రెండు సంపుటాలుగా వేసాడు. "ఉదయ ఘంటలు" పేరుతో కవితాగేయాల సంకలనాన్ని తెచ్చాడు. 1956లో "పరిసరాలు" పేరుతో రెండు సంపుటాలు తెలంగాణ రచయితల

కథలు ప్రచురించాడు. "తెలంగాణ" పేరుతో తెలంగాణ చరిత్ర సంస్కృతికి సంబంధించిన వ్యాసాలు అచ్చువేసాడు. ప్రచురణలను కూడా ఆళ్వారుస్వామి ఒక ఉద్యమంగా నడిపాడు. ఆళ్వారుస్వామి దేశోద్ధారక గ్రంథమాల తరఫున మొట్టమొదట అచ్చువేసిన పుస్తకం సురవరం వారి "ప్రజాధికారములు". భారతదేశంలో అప్పుడప్పుడే అడుగుపెడుతున్న ప్రజల ప్రజాస్వామ్య హక్కుల ఉద్యమంను దృష్టిలో పెట్టుకొని ఆళ్వారు స్వామి ఈ పుస్తకం అచ్చువేసాడు. "అవకాశమిస్తే.." కథలో ఆళ్వారుస్వామి స్త్రీల ఇంటి చాకిరి వాళ్ళ ప్రతిభ కార్యనిర్వహణ కౌశలాన్ని ఎట్లా హరించి వేస్తుందో చెప్పి పాఠకుల దృష్టిని స్త్రీల సమస్యలను ఆలోచించించేటట్లు చేసాడు. స్త్రీవాదం రాకముందే ముప్పై ఏండ్ల ముందే ఆయన ఆ విధంగా ఆలోచించి వ్రాయటం ఆశ్చర్యం కలిగిస్తుంది. తెలంగాణలో కవులు రచయితలు ఉద్యమాల్లో పాల్గొని కఠిన జైలు శిక్షలననుభవించి కవిత్వం, పాటలు, కథలు, నవలలు రచించిన వాళ్ళున్నారు. భారతదేశంలో మరెక్కడా రాని విప్లవోద్యమం సాయుధపోరాటం రావటం కవులు, రచయితలు రక్తతర్పణం చేయటం తమ రచనలతో ప్రజలను జాగృతం చేయటం తెలంగాణ మాగాణంలో జరిగిన అపురూప విషయం.

ఆళ్వారుస్వామి సామాజిక రాజకీయ దురాచారాలను విమర్శిస్తూ "రామప్ప రభస" వ్యాసాలు వ్రాసాడు. అవి "తెలుగు విద్యార్థి" మచిలీపట్నం నుంచి వచ్చే పత్రికలో ధారావాహికంగా అచ్చయి తర్వాత పుస్తక రూపంగా వచ్చాయి. ఇంకా పుస్తకంగా రాని ఆళ్వారుస్వామి కథలు పత్రికల్లో పడివున్నాయి. ఆళ్వారుస్వామి అరసం సభల్లోను పాల్గొన్నాడు. సికింద్రాబాదు రిక్షాకార్మికోద్యమం, గుమాస్తాల ఉద్యమం నడిపాడు. పౌరహక్కులు స్త్రీల హక్కుల గురించి ఆలోచించిన ఉద్యమకారుడు ఆళ్వారుస్వామి, తెలంగాణ వైతాళికుడు.

### కాళోజీ

కాళోజీ నారాయణరావు 1914లో జన్మించాడు. కాళోజీలో బాల్యం నుంచే నాయకత్వ లక్షణాలు కన్పించాయి. ఆంధ్ర మహాసభలన్నిటిలో పాల్గొన్నాడు. 1944లో కమ్యూనిస్టులను ధిక్కరించాడు. తర్వాత కాలంలో కమ్యూనిస్టు అయ్యాడు. ప్రజల

పక్షాల నిలబడ్డాడు. ప్రజాకవి అనే పేరును తెచ్చుకున్నాడు. తెలంగాణ వైతాళికుల్లో ఒకడు. 1946లో వరంగల్ కోటలో జాతీయజెండాను ఎగురవేసిన వాళ్ళల్లో కాళోజీ వున్నాడు. రజాకార్లు కత్తులతో వాళ్ళమీద దాడిచేసారు. మొగిలయ్య అనే దేశభక్తుడు రజాకార్లను ఎదుర్కొని పారదోలాడు. కాళోజీ ఎన్నోసార్లు జైలుకు పోయాడు. 1953లో కాళోజీ కవితలను "నా గొడవ" పేరుతో ఆళ్వారుస్వామి దేశోద్ధారక గ్రంథమాల తరఫున అచ్చువేసాడు. కాళోజీ గొడవ ప్రజల గొడవ. 'నా గొడవ'లో ప్రజల గొడవ కష్టాలున్నాయి. అన్యాయాన్ని ఎదుర్కోవటం తిరుగుబాటు కాళోజీ స్వభావం. ప్రజల కోసం జీవితం అంకితం చేసినవాడు. మరణం తర్వాత శరీరాన్ని కూడా దవాఖానాకు దానం చేసిన ఘనుడు. కొన్ని కథలు వ్రాసాడు. అవి శిల్పం చాలా బాగా వున్న కథలు. ప్రజాస్వామిక పౌరహక్కుల కోసం చివరవరకు పోరాడాడు. లోకనాయక జయప్రకాశ్ నారాయణ గురించి కాళోజీ

*పుట్టుక నీది*
*చావు నీది..*
*బతుకంతా దేశానిది*

అన్నాడు. కాళోజీ జీవితం కూడా అంతే! కాళోజీ జీవితమే ఉద్యమం. ఉద్యమమే కాళోజీగా బతికాడు.

*అధికృత హింసాకాండే*
*పరిపాలన అయినప్పుడు*
*ప్రతిహింస తప్పదు*

అని కాళోజీ ప్రకటించాడు. హింసను ఎదిరిస్తూ ప్రతిహింస చేసే వాళ్ళను నరసింహులుగా భావించాడు. తెలంగాణ ప్రత్యేక రాష్ట్ర పోరాటంలోనూ కాళోజీ పాల్గొన్నారు.

1943లో అణాగ్రంథమాల వారు కాళోజీ మూడు కథలను ప్రచురించారు. "మనమే నయం" పశుహింసను గురించి కథ. "తెలియక ప్రేమ తెలిసి ద్వేషము"

కుల విభేదాలు దేవాలయ ప్రవేశం గురించి వ్రాసిన కథ. “విభూతి” ఆధునికత వేలం వెర్రి వెయ్యటాన్ని విమర్శించే కథ. “లంకా పునరుద్ధరణ” కథ మిలటరీ ప్రభుత్వం 1948లో తెలంగాణలో చేసిన ఆగడాలను వర్ణించే కథ. “ఆగస్టు పదిహేను” దేశ స్వాతంత్ర్యానంతరం కాంగ్రెసును రద్దు చేయాలని చెప్పే కథ. కాళోజీ కథల శైలి సరళంగా సూటిగా వుంటుంది. కథన శిల్పం బాగుంటుంది. ముగింపులో చమత్కార పూర్ణమైన మలుపు వుంటుంది. అన్యాయం జరిగితే ప్రశ్నించటం కాళోజీ స్వభావం. ఆ స్వభావమే ఈ కథల్లో ఉంది. కాళోజీ “ఆత్మకథ” కూడా వ్రాసుకున్నాడు. ఆయన చమత్కారంగా మాట్లాడేవాడు. కాళోజీ అన్న రామేశ్వరరావు ఉర్దూలో కవిత్వం వ్రాసాడు. పేరున్న కవి.

## గంగుల శాయిరెడ్డి

తెలంగాణ విమోచనోద్యమంలో పాల్గొని జైలుకు పోయిన మరో కవి గంగుల శాయిరెడ్డి. గ్రంథాలయోద్యమంలో ఆంధ్ర మహాసభల్లో క్రియాశీలుడై పాల్గొన్నాడు. 1927–34 మధ్యకాలంలో “కాపుబిడ్డ” కావ్యాన్ని రచించాడు. ఇది ఖండకావ్యం. తెలంగాణ పోరాటానికి గల కారణాలేమిటో ఈ కావ్యంలో కన్పిస్తాయి. రైతుల కష్టాలను కవి వాస్తవికంగా చిత్రించాడు. “భావికాలము యోచించి చాటపట్ట కర్షకాలెమ్ము! కనువిప్పి కట్టు నడుము!” అని కవి కర్షకులను మేల్కొల్పాడు. తెలంగాణ భాష యాసలో కావ్యం సుందరంగా నడిచింది. శాయిరెడ్డి దళితుల పక్షం వహించి వాళ్ల కోసం స్కూళ్ళు నడిపిన సంఘ సంస్కరణ భావాలు గల ఉద్యమ కవి.

## గార్లపాటి రాఘవరెడ్డి

గార్లపాటి రాఘవరెడ్డి ‘సావిత్రి, రతీ విలాపం’ వంటి పద్య కావ్యాలు వ్రాసాడు. పి.వి.నరసింహారావు, కాళోజీలు ఇతన్నితమ గురువుగా పేర్కొన్నారు. వరంగల్ వాసి. ఆంధ్రాంగ్ల ఉర్దూ భాషలు నేర్చిన వాడు. అనేక పద్య సంపుటాలు, గేయాలు, శతకాలు రచించాడు.

## కాంచనపల్లి చిన వెంకటరామారావు

“తెలంగాణ రైతాంగ విప్లవ పోరాటంతో వివిధ దశలలో ఉడుతాభక్తి సంబంధం

కొంత..." నాకు ఉంది అని కాంచనపల్లి తన కథల సంపుటి "మా ఊళ్ళో కూడానా..." ముందు మాటలో చెప్పుకున్నాడు. తెలంగాణ ప్రజల విప్లవ పోరాటాన్ని ప్రజా జీవితాన్ని కథల్లో తగినంతగా కోరుకున్నంతగా చూచినంతగా చిత్రించలేకపోయానని అతని మనోవేదన. "తెలంగాణాను విరివిగాను విశాలంగానూ" చిత్రించలేక పోయానని ఆయన రచయిత హృదయం ఆవేదన పడింది. 1921లో జన్మించిన కాంచనపల్లి 1992లో మరణించారు. 1960 దశకంలో నల్లగొండలో యువ రచయితలకు ఆదర్శంగా నిలిచి 'దర్పణం' పత్రిక నడిపారు. "దర్పణం" పత్రికకు సంపాదకుడిగా ఉన్నాడు. ఆయన వ్రాసిన తొమ్మిది కథల్లో ఆరు కథలు 1947కి ముందు వ్రాసినయి. మిగిలిన మూడు 1970 తర్వాత వ్రాసినయి. ఆయన కండ్లకు కట్టేట్లుగా కథనం చేసాడు. తాను చూసిన సంఘటనలనే కథలుగా మలిచాడు.

## అయోధ్య రామకవి

"తెలంగాణ మంటల్లో" కథల సంపుటిని 1948లో విజయవాడ నుంచి ప్రచురించాడు. రజాకార్ల అల్లర్లతో పుస్తకాన్ని ఇక్కడ ప్రచురించలేక రచయిత అక్కడ ప్రచురించి వుంటాడు. ఈ పుస్తకంలో రజాకార్ల ఆగడాలను, హింసలను, మారణకాండ, మానాపహరణాలను చిత్రించే కథలున్నాయి. అయోధ్య రామకవి వరంగల్ నివాసి. బుర్రకథలు రచించి ఊరూరా తిరిగి చెప్పి ప్రజలను ఉద్యమోన్ముఖులను చూసేవాడట. 1922లో జన్మించిన అయోధ్య రామకవి ఆంధ్రకేసరి, ఘంటారావం, దీపావళి వంటి ఖండకావ్యాలు వ్రాసాడు. గేయాలు, నాటికలు వ్రాసాడు. శతకాలు వ్రాసాడు. 1949-50లో 'భాగ్యనగర్' పత్రిక నడిపాడు. కాంగ్రెసు కార్యకర్తగా ఊరూరా తిరిగి గాంధీజీ సిద్ధాంతాలను ప్రచారం చేసాడు. శ్రావ్యమైన గొంతుతో పాడేవాడట. "విజ్ఞాన గ్రంథమాల"ను పెట్టి పది వరకు పుస్తకాలు ప్రచురించాడు.

## ఆవుల పిచ్చయ్య

తెలంగాణ పోరాటంలో ప్రత్యక్షంగా పాల్గొని కథలు వ్రాసిన మరో రచయిత ఆవుల పిచ్చయ్య. సూర్యాపేటలో జన్మించాడు. మీజాన్ పత్రికలో పని చేసాడు. ఆయన కథలు ఆ పత్రికలోనే అచ్చయ్యాయి. 1944లో ఆంధ్ర మహాసభ చీలినప్పుడు

పిచ్చయ్య అతివాదుల్లో చేరాడు. రైతాంగ సాయుధ పోరాటంలో పాల్గొని కఠిన కారాగార శిక్షననుభవించాడు. సామాన్య కుటుంబంలో జన్మించిన పిచ్చయ్య కమ్యూనిజం సుఖశాంతులు తెస్తుందని విశ్వసించాడు. అంతగా చదువుకోని పిచ్చయ్య ఆరేడు కథల వరకు వ్రాసాడు. తాను సందర్శించిన పోరాట ఘట్టాలనే కథలుగా వ్రాసాడు. సరళమైన శైలిలో యథార్థ సంఘటనలను కథలుగా చెప్పాడు. 2010 పిచ్చయ్య కథలను సంగిశెట్టి సేకరించి పుస్తకంగా అచ్చు వేసాడు.

తెలంగాణ వీర పోరాటంలో ప్రజల్లో చైతన్యం తేవటానికి పాట చాల ప్రముఖమైన పాత్ర ధరించింది. సుద్దాల హనుమంతు, బండి యాదగిరి, తిరునగరి రామాంజనేయులు మొదలైన వారు పాటలు వ్రాసి పాడారు. ప్రజల్లో పోరాట పటిమను పెంచారు. సుద్దాల హనుమంతు పోరాటానికి కేంద్రభూమి అయిన నల్లగొండ జిల్లా పాలడుగులో 1910లో పుట్టాడు. అతని పాటలు "పల్లెటూరి పిల్లగాడ" పేరుతో పుస్తకరూపంగా వచ్చాయి. "బండెనక బండికట్టి పదహారు బండ్లు కట్టి... నైజాం సర్కారోడ నాజీల మించినోడ!" మొదలైన ప్రసిద్ధమైన పాటలను కట్టిన కవి యాదగిరి. రజాకార్ల చేతిలో అమరుడైనాడు. తెలంగాణలో తర్వాత కాలంలో గద్దర్, గోరటి వెంకన్న, అందెశ్రీ, గూడ అంజయ్య, సంధ్య, జండా రాజన్న, మాస్టార్జీ వంటి వాళ్ళు పాటలు కట్టి పాడేవాళ్ళు. పాటలు పాడే వారసత్వాన్ని కొనసాగిస్తున్నారు.

## పొట్లపల్లి రామారావు

రామారావు తొమ్మిది కథలు "జైలు" పేరుతో అచ్చయ్యాయి. సామాన్య ప్రజలపై జరిగే దౌర్జన్యాలను కథలుగా వ్రాసాడు. వ్యాసాలు, కవిత్వం నాటికలు వ్రాసాడు. చక్కని రమ్యమైన కవితాశైలిలో రచించాడు.

## పెండ్యాల శేషగిరిరావు

పెండ్యాల శేషగిరిరావు (1925 జననం) "దాంపత్యం" పేరుతో కథల సంపుటిని వరంగల్‌లోని "విజ్ఞాన గ్రంథమాల" వారు 1943లో ప్రచురించారు. కొమర్రాజు, ఒద్దిరాజు సోదరుల కాలం నుంచి తెలంగాణలో ఎన్నో గ్రంథమాలలు నెలకొల్పబడి

పుస్తకాలను అనేక సంఖ్యలో ప్రచురించటం విశేషం. శేషగిరిరావు వరంగల్ జిల్లాలో సాహితీ సామాజిక చైతన్యానికి మార్గదర్శిగా నిలిచాడు. ఈయన 'శ్రావణి' అనే కథల పుస్తకం వేసాడు. అది అలభ్యం. 1945 ఉగాది సందర్భంగా పెండ్యాల చిన రాఘవరావు విశేష సంచికగా కథానికల సంకలనాన్ని తెచ్చాడు. దీనిలో మంచి కథలున్నాయి.

## భండారు అచ్చమాంబ

ప్రసిద్ధ పరిశోధకుడు, తెలంగాణలో శ్రీకృష్ణదేవ రాయాంధ్ర భాషా నిలయము" అనే గ్రంథాలయాన్ని 1901లో ప్రారంభించటానికి మూలకారకుడైన హైద్రాబాదులో "విజ్ఞాన చంద్రికా గ్రంథమాల" పేరుతో ప్రచురణ సంస్థను ప్రారంభించిన తెలంగాణ వైతాళికుడని పేరుగాంచిన కొమర్రాజు వేంకట లక్ష్మణరావు సోదరి భండారు అచ్చమాంబ. ఆంధ్రదేశ చరిత్ర వ్రాయాలంటే తెలంగాణ గని వంటిదని అభిప్రాయం ప్రకటించి తెలంగాణ చరిత్ర శాసనాల పరిశోధనకు పూనుకున్నాడు కొమర్రాజు. కృష్ణా మండలంలో అచ్చమాంబ 1874లో జన్మించింది. ఆమె తండ్రి వెంకటప్పయ్య మునగాల సంస్థానంలో దివాన్‌గా పని చేసాడు. మునగాల సంస్థానంలో చాలా భాగం నైజాంలో వున్నా కొన్ని గ్రామాలు కృష్ణా జిల్లాలో వుండేయి. భర్త మరణానంతరం అచ్చమాంబ తల్లి ఇద్దరు పిల్లలను తీసుకొని నల్లగొండ జిల్లా దేవరకొండలో ఉద్యోగి అయిన సవతి కొడుకు కొమర్రాజు శంకరరావు దగ్గరికి వచ్చింది. ఆ విధంగా అచ్చమాంబ బాల్యం దేవరకొండ ఆ తర్వాత భోనగిరిలో గడిచింది.

తల్లి ఆమెకు పదేళ్ళ వయస్సులో తన సోదరుడు మాధవరావుకిచ్చి రెండో పెండ్లి జరిపించింది. అప్పట్నుంచి అచ్చమాంబ నాగపూర్‌లో నివసించింది. అక్కడే ఆమె మరాఠీ, గుజరాతీ, హిందీ, ఇంగ్లీషు, సంస్కృతం ఆది భాషలు నేర్చుకుంది. స్త్రీ సమాజం నడిపి స్త్రీలకు విద్యా విజ్ఞానం బోధించేది. సోదరునితో పాటు బొంబాయిలో జరిగిన కాంగ్రెసు మహాసభలకు పోయింది. వీరేశలింగం శిష్యురాళ్ళతో సమకాలికురాలైన అచ్చమాంబ స్త్రీ విద్య స్త్రీ వ్యక్తిత్వం గురించి ఆధునిక భావాలు

గల రచయిత్రి. "అబలా సచ్చరిత్ర రత్నమాల" సాహసవంతులైన గొప్ప స్త్రీల జీవిత చరిత్రలను వ్రాసింది. వ్యాసాలు కూడా వ్రాసింది. అవి పత్రికల్లో అచ్చయ్యాయి. ఆమె పన్నెండు వరకు కథలు వ్రాసింది. ఇతర భాషల పరిచయంతో ఆమెకు ఆధునిక కథ స్వరూపం బాగానే పట్టుబడ్డది. ఆమె బాల్యం తెలంగాణలో గడపటమే కాక మునగాల సంస్థానంతో సంబంధముంది. మునగాల రాజానాయని రంగారావు తెలంగాణలో గ్రంథాలయోద్యమం ఆంధ్ర జనసంఘం స్థాపనలో వున్నాడు. కొమర్రాజు తెలంగాణ వైతాళికుడు. అచ్చమాంబ తన కథల్లో "కచ్చె, పారి, తేప, అత్త" మొదలైన తెలంగాణ పదాలను ప్రయోగించింది. కాబట్టి భండారు అచ్చమాంబ తెలంగాణ రచయిత్రి. తెలుగులో మొట్టమొదటి కథ రచించిన గౌరవం ఆమెకే దక్కుతుంది.

అచ్చమాంబ తెలుగులో మొట్టమొదటి కథ "ప్రేమపరీక్షణము". ఇది 1898 జులైలో వ్రాసింది. రాయసం వెంకటశివుడు నిర్వహించే "తెలుగు జనానా"లో అచ్చయింది. 1898 సెప్టెంబరులో "ఎరువు సొమ్ము పరువు చేటు" కథ అచ్చయింది. ఈ రెండు ఇప్పుడు దొరకటం లేదు. 1901 నుండి 1904లో అంటే మరణించేంత వరకు అచ్చమాంబ వ్రాసిన కథలు దొరుకుతున్నాయి. ఆమె 10 కథలు అచ్చయి లభిస్తున్నాయి. వాటిల్లో 1901లో వ్రాసిన "గుణపతియగు స్త్రీ" దశకుమార చరిత్రలోని కథకు అనుకరణ. ఇక 1901లోనే వ్రాసిన "లలితా శారద" తెలుగులో మొట్టమొదటి కథ అవుతుంది. అచ్చమాంబ వ్రాసిన "ధనత్రయోదశి, దంపతుల ప్రథమ కలహము, బీద కుటుంబము" మంచి కథా శిల్పం వున్న కథలు. అచ్చమాంబ స్త్రీ విద్య, స్త్రీల వ్యక్తిత్వం నిర్మాణాలను వస్తువుగా తీసుకొని కథలు వ్రాసింది. సరళమైన గ్రాంధిక శైలిలో వున్నాయి.

## భాగ్యరెడ్డివర్మ

భాగ్యరెడ్డివర్మ దళితుడు. సంఘసంస్కర్తగా హరిజనోద్ధరణకు కృషి చేసాడు. "వెట్టిమాదిగ" 1932లో ఆయన వ్రాసిన దళితుని కథ. తెలుగులో దళితుడు వ్రాసిన మొదటి దళిత కథ ఇది. తెలుగు సాహిత్యంలోనే ఇది మొదటి దళిత కథ.

1914లో భాగ్యరెడ్డి వర్మ హైద్రాబాదులో బ్రహ్మసమాజం స్థాపించాడు. 1915లో సంఘ సంస్కార నాటకమండలిని స్థాపించి హరిజనులచేత నాటకాలు వేయించాడు. నాటక ప్రదర్శనలలో సంఘ సంస్కరకణల భావాలను ప్రచారం చేసాడు. 1922లో 'ఆది హిందూ సాంఘిక సేవా సమితి' స్థాపించాడు. 1931లో "భాగ్యనగర్" పత్రికను పెట్టి నడిపి విజ్ఞానాన్ని పంచిపెట్టాడు. 1937లో భాగ్యనగర్ పత్రిక "ఆది హిందూ పత్రిక"గా మారింది. ఆ విధంగా సామాన్య జనుల్లో చైతన్యం భావ విప్లవం తేవటానికి అనేక సంస్థలను స్థాపించి కృషి చేసాడు. తెలంగాణలో ఈ విధంగా ఆర్య సమాజం వారు భాగ్యరెడ్డి వర్మ, రాజబహద్దర్ వెంకటరామారెడ్డి వంటి వాళ్ళు సంఘ సంస్కరణలను ప్రవేశ పెట్టారు. ఆర్య సమాజం వాళ్ళు అంటరానితనం, స్త్రీల విద్య, వితంతు వివాహాల విషయంలో విగ్రహారాధన వంటి మూఢ విశ్వాసాలను ఖండించటం వంటి కార్యక్రమాలు చేపట్టారు. నిజాంకు వ్యతిరేకంగా పోరాడారు. ఆ రోజుల్లో ప్రతి ఒక్కరూ తెలంగాణలో రావి నారాయణరెడ్డి మొదలుకొని కాళోజి, పి.వి., కొండా వెంకటరంగారెడ్డి వాళ్ళెందరో ఆర్య సమాజం చేత ప్రభావితులయ్యారు.

## పర్సా దుర్గాప్రసాదరావు

కొన్ని కథలు వ్రాసి కనుమరుగైన మంచి కథకులెందరో తెలంగాణలో ఉన్నారు. ఊటుకూరు రంగారావు, ఇరివెంటి కృష్ణమూర్తి, ముకురాల (మంద) రామారెడ్డి, మురళి, చరుకుపల్లి సోదరులు, గుండవరము, హనుమంతరావు, బడారు శ్రీనివాసరావు, జి.రాములు, కె.రాములు, వెదిరె చెన్నకేశవులు, చిన్న రాఘవరావు వ్రాసే కథల్లో రొమాంటిసిజం కన్పిస్తుంది. ఎందరెందరో గొప్ప కథకులు కనుమరుగయిన వాళ్ళున్నారు. బోలెడంత వైవిధ్య పూర్వకమైన కథా సాహిత్యం తెలంగాణ నుంచి 1912-1956 మధ్య కాలంలో వచ్చింది. అవి కేవలం పోరాట కథలే కావు. సామాజిక చారిత్రక, హాస్య కథలున్నాయి. సామాజిక సూత్రాలను చిత్రించే కథలు కూడా వున్నాయి.

తెలంగాణ సాయుధ పోరాటంలో పాల్గొని కథలను వ్రాసిన వాళ్ళు ఇంకా

కొంతమంది కన్పిస్తున్నారు. **బి.ఎన్.రెడ్డి** 'ఆయువుపట్టు' అనే పెద్ద కథను **పి.వి.నరసింహారావు** "గొల్లరామవ్వ" కథను వ్రాసారు. **కె.ఎల్.ఎన్., కవి రాజమూర్తి** మొదలైన వాళ్ళు కథలు వ్రాసారు.

**ఎన్.బి.సీతారామారావు** 1939లో వ్రాసిన "గరీబోణ్ణి" కథంతా తెలంగాణ మాండలికంలో వ్రాసిన కథ. తెలుగులో మొత్తం మాండలికంలో వ్రాసిన మొదటి కథ ఇది. తెలంగాణ విమోచనోద్యమ కాలంలో ఎందరో రచయితలు తెలంగాణ మాండలికంలో రచించారు. తర్వాత కాలంలో 1950 దశకంలో **గూడూరి సీతారాం, సురమౌళి, యశోదారెడ్డి** తెలంగాణ మాండలికంలో చక్కని కథలు వ్రాసారు. తెలంగాణ పోరాటం కాలంలో తెలంగాణలో జరిగే దౌర్జన్యాలను, పోరాటాలను చిత్రించే కథలు ఎక్కువగా వచ్చినా పల్లె ప్రజల జీవితాన్ని యథార్థంగా చిత్రించే కథలు కూడా వచ్చాయి. పట్టణ జీవితాన్ని చిత్రించే కథలు, సంఘసంస్కరణ కథలు, ప్రేమ కథలు, చారిత్రక కథలు, హాస్యకథలు, స్త్రీల సమస్యలను చిత్రించే కథలు, సైన్స్‌ఫిక్షన్ కథలు, డిటెక్టివ్ కథలు వంటి ఎంతో వస్తువైవిధ్యంతో కథలు వచ్చాయి. ఆంధ్ర ప్రాంతాల నుంచి మధ్యతరగతి వాళ్ళ, పట్టణవాసుల జీవితాలను, సమస్యలను చిత్రించే కథలు ఎక్కువగా వస్తే తెలంగాణ పల్లె ప్రజల కింది వర్గాల సమస్యలను, పోరాటాన్ని చిత్రించే కథలు ఎక్కువ సంఖ్యలో వచ్చాయి. తెలంగాణలో వస్తు వైవిధ్య పూర్ణమైన కథలు వచ్చాయి. తెలంగాణ చరిత్రనంతా కథా సాహిత్యం ప్రతిబింబింప జేస్తున్నది. తెలంగాణ ప్రజల సాంస్కృతిక సామాజిక ఉద్యమాల చరిత్రను ఆనాటి కథకులు వ్రాసిన కథల ఆధారంగా నిర్మించవచ్చును. ఆ విధంగా తెలంగాణ సాహిత్యంలో కథ ఒక ప్రముఖ పాత్ర వహించింది.

తెలంగాణలో కాల్పనిక వాదం అంటే రొమాంటిసిజంకు సంబంధించిన సాహిత్యం రాలేదన్న అపోహ ఒకటి ఉన్నది. తెలంగాణ నిరంకుశ పాలనలో ప్రజలపై జరుగుతున్న అన్యాయాలను చిత్రించే సాహిత్యం వచ్చినా మరోవైపు హైద్రాబాదులోని రచయితలు కొందరు రొమాంటిసిజం కథలు కవిత్వం వ్రాసారు. గోలకొండ కవుల సంచికలో మనకు రొమాంటిసిజం కవితలు కన్పిస్తాయి. హైద్రాబాదులో బూర్గుల రంగనాథరావు, నెల్లూరు కేశవస్వామి, నందగిరి ఇందిరాదేవి వంటివాళ్ళు "సాధన

సమితి" స్థాపించి రొమాంటిసిజం కథలు వ్రాసారు. వాళ్ళు కథల పోటీలను నిర్వహించి కథా రచనను తెలంగాణలో ప్రోత్సహించారు.

1919లో తల్లావఝ్ఝల శివశంకర శాస్త్రి, చింతా దీక్షితులు, నోరి నరసింహశాస్త్రి ఆంధ్ర ప్రాంతంలో "సాహితీ సమితి"ని స్థాపించి భావకవుల నవ్య సాహిత్య ప్రచారానికి వ్యవహారిక భాషోద్యమానికి ప్రచారం కల్పించారు. ఆ "సాహితీ సమితి" ఆశయాలనే సాధన సమితి వాళ్ళు తీసుకున్నారు. వాళ్ళ భాష, శైలి, భావజాలం, ఇతివృత్తాల వంటివే ఈ కథకుల కథల్లో కన్పిస్తున్నాయి. కాని పుస్తకంగా ఎక్కువగా వేసుకోలేదు. బూర్గుల రంగనాథరావు తన కథలను "వాహ్యాళి" (1943) పేరుతో అచ్చువేసుకున్నాడు. 1949లో ధరణికోట శ్రీనివాసులు "మా యింట్లో" కథల సంపుటి వేసాడు. నెల్లూరు కేశవస్వామి కథలు "చార్మినారు" పేరుతో చాల తర్వాత కాలంలో అచ్చయ్యాయి. నందగిరి ఇందిరాదేవి, నందగిరి వెంకట్రావు దంపతులు సాధన సమితి సభ్యులు. చాలా కథలు వ్రాసారు. కాని పుస్తకంగా అచ్చువేసుకోలేదు. హీరాలాల్ మోరియా 15 కథలను "బతుకుబాట" పేరుతో దేశోద్ధారక గ్రంథమాల వారు అచ్చువేసారు.

1940 దశకంలో ఊటుకూరు రంగారావు, ఇటికాల నీలకంఠరావు, వెల్దుర్తి మాణిక్యరావు మొదలైన ఎందరో కథలు వ్రాసారు. కాని, పుస్తకంగా తీసుకురాలేదు. వీళ్ళ కథలు ప్రేమ వృత్తాంతాలతో హాస్య సంఘటనలతో రొమాంటిసిజం అంటే కాల్పనిక వాదం భావకవుల భావాలు గల కథా రచయితలు అని చెప్పదగిన వాళ్ళు. మునిమాణిక్యం కథల్లో "కాంతం" పాత్రలాంటి పాత్ర కనకం పేరుతో సృష్టించి ధరణికోట శ్రీనివాసులు కథలు వ్రాసాడు. ఈ కథలు సంపుటానికి మునిమాణిక్యం "మున్నుడి" పేరుతో ముందుమాట వ్రాసాడు. రొమాంటిసిజం రచయిత అని చెప్పుకోదగిన రచయిత భాస్కరభట్ల కృష్ణారావు (1918-1966) ఈయన కథలు 3 సంపుటాలుగా వచ్చాయి – 'చంద్రలోకానికి ప్రయాణం, కృష్ణారావు కథలు, వెన్నెల రాత్రి'. దాదాపు 40 కథలు వ్రాసాడు. ఆంధ్ర సారస్వత పరిషత్తు స్థాపకులలో ఒకడు. నాటికలు కూడా వ్రాసాడు. 'వెల్లువలో పూచిక పుల్లలు, యుగసంధి" నవలలు వ్రాసాడు. 1922-48ల నాటి హైద్రాబాదు నగర జీవితం ఆయన నవలలో కన్పిస్తుంది. ఈ నవలల్లో సమకాలిక నగర సమాజ చిత్రణే కాక

రొమాంటిసిజం ఛాయలు చాలా వున్నాయి.

వెల్దుర్తి మాణిక్యరావు గోలకొండ పత్రికకు సహ సంపాదకుడుగా వున్నాడు. 'దయ్యాల పన్గడ' మాండలిక భాషలో వ్రాసిన నాటిక. ఈయన కథలు కూడా రచించాడు. 'మాణిక్యవీణ' అనే కవితా సంకలనం అచ్చువేసాడు. ఆ రోజుల్లో నిజాం ప్రభుత్వం దీన్ని నిషేధించింది.

ఆ కాలంలో కోదాటి రామకృష్ణారావు "సుమ విలాపం" (1925) కరుణశ్రీ పుష్ప విలాపాన్ని తలపించే కవితలు వ్రాసాడు. కోదాటి నారాయణరావు గ్రంథాలయోద్యమంలో పని చేయటమే కాక అనేక వ్యాసాలు వ్రాసాడు. 'ప్రగతి, బాల సరస్వతి' వంటి పత్రికలను నడిపాడు. కథలు, గేయాలు, పద్యాలు, నాటికలు రచించాడు. పులిజాల రంగారావు ఉద్యమంలో పాల్గొన్నాడు. కవిత్వం వ్రాసాడు.

ఏలె ఎల్లయ్య 'బీదరైతు' వంటి నాటకాలు రచించాడు. మంత్రి ప్రెగడ వెంకటేశ్వరరావు (1934) జాతీయ గేయాలు వ్రాసాడు. షబ్నవీసు (1896-1926) భార్య స్మృతితో 'రాజ్యలక్ష్మి' కావ్యాన్ని రచించాడు. ఆయన 'బాలికా విలాపము' కథ సంఘ సంస్కరణ భావాలను చిత్రిస్తున్నది. 1922లో నీలగిరి పత్రికను నల్లగొండ నుంచి నడిపాడు.

ధవళా శ్రీనివాసరావు (1918) 'ధవళశ్రీ' అనే కవితా సంపుటిని ప్రచురించాడు. 1946లో అచ్చయిన 'తొలి సంజ'లో భావ కవిత్వ ఛాయలు కన్పిస్తున్నాయి. తెలంగాణ విమోచనాన్ని ప్రబోధించే కవిత్వం, గేయాలు వ్రాసాడు.

పాశం నారాయణరెడ్డి (1909-1982) 'దయానంద సరస్వతి జీవిత చరిత్ర' 'త్యాగమూర్తులు' వ్రాసాడు. సదాశివరెడ్డి పద్య కావ్యం రచించాడు. నిజాంను ఎదిరించిన వీరుడు సదాశివపేట పాలకుడు 'సదాశివరెడ్డి' వీరుని చరిత్రను నారాయణరెడ్డి కావ్యంగా రచించాడు. ఇది 'శివభారతం, రాణా ప్రతాపసింహ చరిత్ర'ల వంటి జాతీయ భావాలు గల కావ్యం. తెలంగాణ విమోచనోద్యమం కాలంలోనే పల్లా దుర్గయ్య, "గంగిరెద్దు" ఖండకావ్యం రమ్యమైన పద్యశైలిలో అలంకారిక శైలిలో రచింపబడింది.

## వానమామలై వరదాచార్యులు

తెలంగాణ నుంచి ఆధునిక కాలంలో "పోతన చరిత్ర" అనే మహాకావ్యం రచించిన వానమామలై వరదాచార్యులు వరంగల్లు దగ్గరున్న మడికొండ నివాసి. వరదాచార్యుల కవిత్వం మృదు మధురమైంది. రసవంతమైంది. పోతన మహాకవి జీవిత వృత్తాంతాన్ని వరదాచార్యులు రమ్యమైన శైలి వర్ణనలతో రచించాడు. పోతన తెలంగాణ గర్వించదగిన కవి. వరదాచార్యుల సోదరుడు జగన్నాథాచార్యులు 'రైతు రామాయణం' అనే ఆధునిక ఇతివృత్తం గల కావ్యాన్ని రచించాడు.

అసఫ్ జాహీల కాలంలో తెలంగాణలో ఆధునికత ప్రవేశించింది. గ్రంథాలయోద్యమం, తెలంగాణ విమోచనోద్యమం, రైతాంగ సాయుధ పోరాటం కాలంలో విస్తృతంగా కథలు, వ్యాసాలు, కవిత్వం ఆధునిక ప్రక్రియలో విస్తృతంగా వ్రాయబడి ప్రజలను పోరాటోన్ముఖులుగా చేసాయి. పాట, బుర్రకథలు, నాటకాల ప్రక్రియలు చదువురాని వాళ్ళను కూడా చాలా ప్రభావితం చేసాయి. సుంకర వాసిరెడ్డి జంటగా వ్రాసిన 'మా భూమి' నాటకం తెలంగాణలో 1000 ప్రదర్శనలు జరిగాయి. రాజారావు వ్రాసిన 'వీరనారి' నాటకం తెలంగాణలో నారీమణులు చేసిన వీరోచిత పోరాటాలను చిత్రించే నాటకం. పొట్లపల్లి రామారావు పగ, న్యాయం వంటి భూస్వాముల దౌర్జన్యాలను వెట్టిచాకిరీ దోపిడీలను చిత్రించే నాటికలు వ్రాసారు. అంతకుముందు ఒద్దిరాజు సోదరులు నాటికలు వ్రాసారు. నాటికల నాటకాల రచన అనేక సంఖ్యలో జరిగినా నాటక ప్రదర్శన కళ తెలంగాణలో వికసించ లేదు. దానికి రెండు కారణాలున్నాయి – ఒకటి – ముస్లిం సంస్కృతిలో సంగీత నాటక వినోదాలకు తావులేదు. రెండోది – తెలంగాణ ఆ సమయంలో ఉద్యమాలతో మండిపోతున్నది. నాటకాలు ప్రదర్శించే సమయం, తీరిక, ధనం లేదు. నటులు ముందుకు వచ్చే శాంతి వాతావరణం లేదు. కింది వర్గాల్లో వున్న ఒగ్గు కథ, చిందు బాగోతాలు ఆదరణను పొందాయి. కాబట్టి తెలంగాణ పోరాట కాలంలో నాటక ప్రదర్శనలకు అవకాశం లేకుండా పోయింది. ఇప్పుడిప్పుడే నాటకాల రచన, నాటక సమాజాలు, నాటక ప్రదర్శనలు తెలంగాణలో వికసిస్తున్నాయి. ఆ విధంగా పాటలు, ప్రజానాట్యమండలి వారి నాటక ప్రదర్శనలు ప్రజలను ఉద్యమోన్ముఖులను చేసాయి.

సాహిత్యం తెలంగాణ విమోచనోద్యమంలో చాలా పెద్దపాత్ర ధరించింది. గ్రంథాలయోద్యమంతో ఆరంభమైన తెలంగాణ జాగృతి పునరుజ్జీవనోద్యమం క్రమంగా ఆంధ్ర మహాసభలతో తెలంగాణ విమోచనోద్యమంగా రైతాంగ సాయుధ పోరాటంగా రూపొంది తెలంగాణ ప్రాంతాన్నే కాదు మొత్తం నైజాం రాష్ట్రాన్ని నిరంకుశ పాలన కోరల నుంచి విడిపించింది.

# విశాలాంధ్రయుగం

ఒకవైపు తెలంగాణలో నిజాం వ్యతిరేక పోరాటం భాషా సాంస్కృతిక పునరుజ్జీవనం కోసం గ్రంథాలయోద్యమం నడుస్తున్న తరుణంలో మద్రాసు రాష్ట్రంలో వున్న ఆంధ్రులు తమిళుల అణచివేత ఆధిపత్యాన్ని, అన్యాయాలను సహించలేక ఆంధ్రులకొక ప్రత్యేక రాష్ట్రం కావాలనేకాంక్షతో 1910 ప్రాంతంలో ఆంధ్రోద్యమానికి నాంది పలికారు. 1910లో మొదటి ప్రపంచ యుద్ధం కారణంగా అప్పటికి గాంధీజీ ప్రవేశం జరగని కాలంలో జాతీయ రాజకీయాల్లో ఒక స్తబ్ధత ఏర్పడింది. ఇంకోవైపు బెంగాల్‌లో ఉవ్వెత్తున లేచిన వందేమాతరం ఉద్యమం ప్రభావంతో చైతన్యం పొంది ఆంధ్ర నాయకులు భోగరాజు పట్టాభి సీతారామయ్య, కొండా వెంకటప్పయ్య, ఉన్నవ లక్ష్మీనారాయణ, కోపల్లె హనుమంతరావు వంటి ఆంధ్రాభిమానులు ఆంధ్రోద్యమానికి నాంది పలికారు. 1911లో గుంటూరు నుంచి 'దేశాభిమాని' పత్రిక ఆంధ్రులకు ప్రత్యేక రాష్ట్రం ఉండాలని సంపాదకీయం వ్రాసింది. 1907-08లో బందరులో నైజాం, కోస్తా ప్రాంతానికి చెందిన ఆంధ్రులు సంయుక్త సమావేశం జరిపారు. కోస్తా, రాయలసీమ, తెలంగాణ ప్రాంతాలతో ఆంధ్రరాష్ట్ర పటం తయారు చేసారు. ఆంధ్రుల జాతీయ చరిత్ర అంటే అభిమానాన్ని కలిగించే నవలలు వచ్చాయి. చిలుకూరి వీరభద్రరావు 'ఆంధ్రుల చరిత్ర' 2 భాగాలు వ్రాసారు. కాశీనాథుని నాగేశ్వరరావు, ముట్నూరి కృష్ణారావు తమ ఆంధ్రపత్రిక, కృష్ణా పత్రికల్లో ఆంధ్రోద్యమాన్ని బలపరిచారు. 1913లో బాపట్లలో ప్రథమాంధ్ర మహాసభ జరిగింది. మాతృభాష ప్రాముఖ్యతను గురించి కొండా వెంకటప్పయ్య ఉపన్యసించారు. విద్యాబోధన మాతృభాషలో జరగాలన్నారు.

జాతీయోద్యమం బలపడిన తర్వాత గాంధీజీ నాయకత్వంలో స్వాతంత్ర్యోద్యమం జరుగుతున్న కాలంలో ముందుగా దేశ స్వాతంత్ర్యం రావాలి తర్వాత ఆంధ్రరాష్ట్ర అవతరణమన్న భావం బలపడింది. 1947లో దేశ స్వాతంత్ర్యం వచ్చిన తర్వాత ఆంధ్రులు ఆంధ్ర రాష్ట్రావతరణను కోరారు. ప్రజాస్వామ్య ప్రభుత్వం ఏర్పడిన తర్వాత దేశ ప్రధానమంత్రి నెహ్రూ భాషా రాష్ట్రాల అవసరాన్ని గుర్తించారు. ఆంధ్రరాష్ట్రం కావాలని పొట్టి శ్రీరాములు నిరాహారదీక్ష చేసి పరమపదించటంతో కేంద్ర ప్రభుత్వం విశాలాంధ్ర ఏర్పాటుకు అంగీకరించింది. ఆ సమయంలో నైజాం ప్రజలు, నాయకులు విశాలాంధ్ర భావనకు విముఖత చూపారు. కాని నెహ్రూ అందరినీ సమాధాన పరచటంతో విశాలాంధ్ర 1956 నవంబరు 1వ తారీఖున అవతరించింది. విశాలాంధ్రకు రాజధాని హైద్రాబాదు నగరం. రాజధాని నగరానికి కావలసిన హంగులన్నీ ఉండటంతో విశాలాంధ్ర అవతరణకు ఎక్కువ ధన కాల వ్యయం జరగలేదు. తెలుగువారు ఉద్యోగులు రాజకీయ నాయకులు మద్రాసు నుంచి తాత్కాలిక రాజధాని కర్నూలు తరలివచ్చి అక్కడి నుంచి హైద్రాబాదు తరలివచ్చారు. ఆంధ్రుల కాలనీలు ఏర్పడ్డాయి. నగరం విస్తరించింది.

విశాలాంధ్ర భావనను అప్పుడు దేవులపల్లి రామానుజరావు, దాశరథి కృష్ణమాచార్యులు, కాళోజి, సి.నారాయణరెడ్డి వంటి కవులు, రచయితలు సమర్ధించారు. ఆంధ్రుల ఐక్యతను ఆహ్వానించారు. 1956 నుంచి 1970 వరకు విశాలాంధ్ర అవతరణతో తెలంగాణ ప్రాంతంలో సాహిత్యం అంతగా రాలేదని అనుకునే వాళ్ళు ఉన్నారు. విప్లవోద్యమం అంటే 1970 దశకంలో నక్సలిజం వచ్చేంత వరకు తెలంగాణలో సాహిత్యమే లేదని అభిప్రాయం ఒకటి ఏర్పడింది. ఇది తెలంగాణను ఉపేక్షించటం వల్ల ఏర్పడిన అభిప్రాయం! ధోరణి! పట్టించుకోకపోవటం, అధ్యయన లోపం వల్ల ఏర్పడింది. తెలంగాణ భాష యాసను కించపరచటం, తెలంగాణ భాషలో వున్న అసలు సిసలైన తెలుగు పదాలను, నుడికారాన్ని గుర్తించక హేళన చేయటం, ఆంధ్ర ప్రాంతంలో తెలుగులో ఉర్దూ పదాలున్నా వాటిని పట్టించుకోకుండా తెలంగాణ భాషలోని ఉర్దూ పదాలను విమర్శించటం వంటి వివక్ష ఉపేక్షలు జరిగాయి. చరిత్ర తెలియని అజ్ఞానాన్ని బయటపెట్టుకున్నారు. పునరుజ్జీవనకాలంలోనే పోతన

రాయలసీమ వాడని అనటం, మొల్ల కవయిత్రి ప్రబంధయుగం నాటి కవయిత్రి నెల్లూరు వాసి అనటం, వీరశైవ సాహిత్యాన్ని కాకతీయుల పరిపాలనను చరిత్రలో పట్టించుకోకపోవటం వంటి అన్యాయాలెన్నో తెలంగాణకు జరిగాయి. విశాలాంధ్ర ఏర్పడిన తర్వాత కూడా వివక్ష ఉపేక్షల వల్ల ఈ భావన కొనసాగింది. అయినా విపరీత పరిస్థితుల మధ్య 1956–2000 మధ్య కాలంలో విశాలాంధ్ర పాలనలో తెలంగాణలో చాలా సాహిత్య సృజన జరిగింది.

తెలంగాణలోని పత్రికలేవీ లేకుండ అయ్యాయి. గోలకొండ పత్రిక కొన్నాళ్ళు నడిచినా నిస్తేజంగా ఉండిపోయింది. ఆంధ్రుల ఆంధ్రప్రభ, ఆంధ్రజ్యోతి, ఆంధ్రపత్రిక, యువ, జయశ్రీ వంటి పత్రికలే నడిచాయి. తెలంగాణ భాషకు సంస్కృతికి ఒక వాహిక లేకుండా అయింది. మొదలే వివక్షకు లోనయ్యారంటే అక్షరాస్యత తక్కువగా వున్న తెలంగాణలో పత్రికల తోడు లేకుండా అయింది. అక్షరాస్యత తక్కువగా ఉండటం చేత పాఠకుల సంఖ్య తక్కువే. ఇక్కడ మధ్యతరగతి చదువుకున్న వాళ్ళు ఎక్కువ లేకపోవటంతో చాలా ఉద్యోగాల్లో ఆంధ్రులు నిండిపోయారు. ఇది తెలంగాణకు ఒక దెబ్బ అయింది. విశాలాంధ్రలో అక్షరాస్యత తక్కువయినా నైజాం వ్యతిరేక పోరాటం ప్రభావం వల్ల సాహిత్య సృజన కొనసాగింది. సమకాలిక ఉద్యమాలను సామాజిక, రాజకీయ పరిస్థితులను ప్రతిబింబించే మంచిసాహిత్యమే ఇక్కడి నుంచి వచ్చింది. ఒక్కటే లోటు ఏమిటంటే తెలంగాణ ముద్ర లేకపోవటం. వాళ్ళకు ప్రత్యేకమైన గుర్తింపు లేకపోవటం వల్ల ఈ కాలంలో తెలంగాణ నుంచి సాహిత్యం అంతగా రాలేదన్న ఒక అభిప్రాయం ఏర్పడుతున్నది. కాని అది అసత్యం.

1950 దశకంలో తెలంగాణలో అభ్యుదయ వాద సాహిత్యం ప్రవేశించింది. అంతకుముందు తెలంగాణ నిజాం నిరంకుశ పాలనను ఎదుర్కొని జరిగిన పోరాటాలను చిత్రించే కవిత్వం, పాటలు, కథలు, నవలలు, నాటకాలు వచ్చాయి. తెలంగాణ విమోచనం జరిగిన తర్వాత 1950 దశకంలో నెహ్రూ ప్రబోధించిన సోషలిజం ఆధారంగా అభ్యుదయ వాదం ప్రవేశించింది. తెలంగాణ పోరాటం కాలంలో తిరుగుబాటు కవిత్వం వ్రాసిన దాశరథి, కాళోజి వంటి వాళ్ళు మానవతా

వాదం, ప్రజాస్వామ్యం, సమసమాజంవైపు దృష్టి నిలిపి సాహిత్యాన్ని సృజించారు. దీన్ని తెలంగాణ సాహిత్య చరిత్రలో అభ్యుదయ యుగంగా పేర్కొనాలి.

## అభ్యుదయ వాదం

అరసం ఆరంభ కాలంలోనే తెలంగాణలో అడుగు పెట్టింది. తెలంగాణ అరసంకు వట్టికోట ఆళ్వారు స్వామి ఆద్యుడు. 1943లో తెనాలిలో జరిగిన తొలి అరసం మహాసభలకు ఆళ్వారుస్వామి పోయి వచ్చాడు. అభ్యుదయ భావాల మీద అతనికున్న అభిమానం అటువంటిది. మళ్ళీ 1944లో విజయవాడలో జరిగిన రెండో అరసం మహాసభలకు కూడా ఆళ్వారుస్వామి పోయాడు. అప్పుడతన్ని హైద్రాబాదు సికింద్రాబాదులో అరసం విస్తరింజేయాలని అతన్ని కార్యవర్గ సభ్యునిగా చేసి ఆ బాధ్యతను అప్పజెప్పారు. 1944-46ల్లో అరసం భావాలతో నడిచే 'తెలుగు తల్లి' పత్రికను నిర్వహించాడు. 1943, 44ల్లో అరసం కార్యదర్శిగా వున్న చదలవాడ పిచ్చయ్యను జంటనగరాలకు ఆహ్వానించి సభలు, సమావేశాలు జరిపించాడు. అరసం ఉద్దేశాలకు తెలంగాణలో ప్రచారం కల్పించాడు. అడవి బాపిరాజు, బిదురు వేంకట శేషయ్య మొదలైన వాళ్ళతో కలిసి జంటనగరాల అరసం నిర్మించాడు. ఆ విధంగా ఆరంభ దశలోనే తెలంగాణలో అరసం వచ్చింది. అంతేగాక తెలంగాణ రచయితలకు ప్రేమ్‌చంద్ మీదున్న అభిమానంతో కమ్యూనిస్టు పార్టీ నిర్మాణంతోను తెలంగాణ వాళ్ళకు రచయితలకు అభ్యుదయ భావాలు పరిచయమయ్యాయి కూడా.

హైద్రాబాదులో 6-10-1944 నాడు థియోసాఫికల్ సొసైటీ హాలులో అరసం మహాసభ అడవి బాపిరాజు అధ్యక్షతలో జరిగింది. ఈ సభకు కీలక పాత్ర వహించింది ఆళ్వారుస్వామియే. ఈ విధంగా అరసం మొదటి దశలోనే హైద్రాబాదులో ప్రవేశించింది. వెల్దుర్తి మాణిక్యరావు, భాస్కరభట్ల కృష్ణారావు ఇక్కడి రచయితలెందరో అరసంలో సభ్యులయ్యారు. నిజాం వ్యతిరేక పోరాటోద్యమం సాయుధ పోరాటంగా మారటంతో శాంతి స్థిరతలు లేక తెలంగాణలో అరసం ముందుకు పోలేకపోయింది. 1950లో తెలంగాణ రచయితల సంఘం ఏర్పడటంతో అరసం పూర్ణ రూపంలో తెలంగాణలో ఆవిర్భవించిదని భావించవచ్చును.

1950 దశకంలో అభ్యుదయ వాదుల దృక్పథంలో మార్పు వచ్చింది. 1935 నుంచి 1949 వరకు అభ్యుదయ కవిత్వంలో ఒక దశ అయితే స్వాతంత్ర్యానంతరం 1950 నుంచి రెండో దశగా చెప్పాలె. ఈ దశలో కవుల మీద అంతర్జాతీయం కన్నా జాతీయ ప్రభావాలెన్నో పని చేసాయి. యం.యన్.రాయ్ నవ్య మానవతా వాదం నెహ్రూ సోషలిస్టు భావాలు, అభివృద్ధి పథకాలు భారతదేశాన్ని ఒక శక్తిగా మార్చాలనే అతని ఆకాంక్ష కవులకు ప్రేరణనిచ్చింది. ఒక జాతీయ దృక్పథం, సత్యం, అహింసల మీద అభిమానం, శాంతి కాముకతలు కవులకు ఆదర్శంగా నిలిచాయి. భారతదేశ ప్రజలకు పేదరికతనం పోయి అభివృద్ధి వస్తుందనే ఆశ కలిగింది. భారతదేశం ఒక శక్తిగా శాంతిస్థాపన చేసి విశ్వమానవ చైతన్యాన్ని తెస్తుందనుకున్నారు. దేశ ప్రాచీన సంస్కృతి వైభవం వైపు మొగ్గు చూపారు. అభ్యుదయ యుగంలోని రెండవ దశలోని ఈ కవులకు రష్యా విప్లవం ప్రేరణనియ్యడం కాక నెహ్రూ ఆదర్శాలు వాళ్లకు ప్రేరణనిచ్చాయి. దానికి ఎర్రగులాబి ప్రతీక. జాతీయ దృక్పథం, సంప్రదాయం మీద అభిమానం పెరిగింది. అట్లా అని వాళ్ళు హేతువాదం శాస్త్రీయ దృక్పథం నుంచి తొలగలేదు. వాళ్ళ ముఖ్య ధ్యేయం మానవతా వాదం, అభివృద్ధి శాంతి సమానతలు. అంతర్జాతీయంగా రెండో ప్రపంచ యుద్ధం ముగిసిన తర్వాత 1945లో 'లీగ్ ఆఫ్ నేషన్స్' ఐక్యరాజ్యసమితి ఏర్పడి 1948లో మానవ హక్కుల పరిరక్షణకు నడుం కట్టింది. మానవత్వానికి మరో రూపం మానవహక్కులు. ఈ హక్కులు ప్రపంచ పౌరులందరికి కోసం ప్రకటించబడినాయి. విశ్వమానవ హక్కుల ప్రకటన విశ్వమానవుని కల్పనకు వసుధైక కుటుంబ భావనకు దోహదం చేసింది. ఇది 1950 దశకంలోని కవులకు ప్రేరణనిచ్చింది.

నెహ్రూ పంచవర్ష ప్రణాళికలతో దేశంలో సమృద్ధి ఏర్పడుతుందని అతని పంచశీల సూత్రాలతో ప్రపంచ శాంతిభద్రతలు సమానతలు వస్తాయని అణచివేత పీడన దోపిడి దౌర్జన్యాలు వలసశక్తులు నశిస్తాయని స్వేచ్ఛా స్వాతంత్ర్యాలు నెలకొంటాయని కవులు ఆశించి ఆ భావజాలంతో కవిత్వం వ్రాసారు. సామ్రాజ్య తృష్ణతో జాత్యహంకారంతో ఐశ్వర్య దాహంతో యుద్ధం వచ్చి వినాశనాన్ని తెచ్చింది. మారణాయుధాలు ప్రయోగించబడినాయి. అదంతా చూసిన ఈ కవులు యుద్ధాన్ని

వ్యతిరేకించారు. శాంతిని కాంక్షించారు. ప్రధానంగా 1950 దశకంలో కవిగా స్థానం ఏర్పర్చుకున్న సి.నారాయణరెడ్డి కవిత్వంలో ఈ భావజలాన్నంతా దర్శించవచ్చును. అతని నాగార్జునసాగరం కావ్యంలో ఇదే ప్రతిఫలించింది.

తెలంగాణా పోరాటకాలంలో మార్క్సిస్టు దృక్పథంతో ఉద్యమంలోకి దూకిన దాశరథి కూడా శాంతిగానం చేసాడు. అతని 'మహాంధ్రోదయం'లో 'కపోతీసందేశము' నెహ్రూ శాంతి సందేశమే. కపోతం శాంతికి ప్రతీకగా గ్రహించబడింది. నెహ్రూ ఎర్రగులాబీని పొడగాటి కోటుకు అలంకరించుకొని తెల్లని కపోతాన్ని ఎగరేసిన చిత్రం ఈనాటి కవుల కాదర్శమైంది.

*"కాస్త పశ్చిమాద్రికడకేగి నాబంధు,*
*జాలమునకు గూడ శాంతినేర్పి,*
*ఇలను కాచుమోయి ఈ అణుప్రోద్గత*
*ప్రళయవహ్నినుండి పక్షిరాజ"*

అంటాడు దాశరథి. సి.నారాయణరెడ్డి – "అమృతం పండించే అణుబీజాల నుండి, విషపూరిత మృత్యు సస్యాలను మొలిపిస్తున్న, శాస్త్రజ్ఞులారా పరమాణువుల రగిల్చి, చరిత్రను పొగచూరనీయకండి" – అంటాడు. రెండో ప్రపంచ యుద్ధ బీభత్సం, భారత స్వాతంత్ర్య ఉద్యమం నాటి అశాంతి పేదరికం నుంచి బయటపడటం ఈ కవుల ధ్యేయం. అహింసను కాంక్షించారీనాటి కవులు. యుద్ధం మాకొద్దని చాటారు. 1930, 40 దశకంలోని అభ్యుదయ కవులవలె ఈ కవులు తిరుగుబాటులు, విజృంభణలను ప్రబోధించలేదు. శ్రీశ్రీ ఓజోగుణంతో కూడిన కవిత్వం వంటి కవిత్వాన్ని చేపట్టలేదు. దాశరథి వంటి విప్లవాన్ని ఆశించిన కవులు కూడా ఈ కాలంలో శాంతి గీతాలు రచించారు.

ఈనాటి అభ్యుదయ కవులు శాంతి నన్వేషించారు. ఈ కవులు హింసను రక్తపాతాన్ని నిరసించారు. ఒకనాడు విప్లవశంఖాన్ని పూరించిన దాశరథి బుద్ధుని బోధనలను ప్రబోధిస్తూ 'మహాబోధి' ఖండకావ్యం వ్రాసాడు. 1910 నాటి నుంచి సాగిన ఆంధ్రుల ఉద్యమం ఫలించి 1956లో విశాలాంధ్ర ఏర్పడింది. దాంతో

ఈనాటి కవులు విప్లవ ధోరణిని హింసామార్గాన్ని విడనాడి అభివృద్ధిని సాధించాలనే దృక్పథం కలిగి వున్నారు. "ఏది విప్లవం" కవితలో దాశరథి హింసను విడనాడాలని చెప్పాడు. రక్తపాతం లేని విప్లవం కావాలన్నాడు.

*"విప్లవమంటే మృత్యువు/విలయతాండవం కాదు*
*విప్లవమంటే బాంబుల/వికటాట్ట హాసం కాదు*
*విప్లవమంటే రక్తం/ వెదజల్లటం కాదర్రా*
*పీన్గుల గుట్టల నుండి/ విప్లవాలు రావర్రా"*

అంటాడు దాశరథి.

## డా॥సి.నారాయణరెడ్డి

ఈ కాలం కవులది కారుణ్యావాద దృక్పథం. అంతేగాక ఈనాటి కవులు పీడిత వర్గం మీద కన్నా మధ్యతరగతి వాళ్ళ సమస్యలను పట్టించుకున్నారు. సి.నారాయణరెడ్డి "మధ్యతరగతి మందహాసం" మధ్యతరగతి వాళ్ళ బాధలను చిత్రించే ఖండకావ్యం. ఈనాటి నవలల్లో కథానికల్లో కూడా మధ్యతరగతి వాళ్ళు ఆర్థిక బాధలు నిరుద్యోగ సమస్యలే చిత్రింపబడినాయి. నారాయణరెడ్డి తెలంగాణా పోరాటం తర్వాత కవి. సి.నారాయణరెడ్డి కరీంనగరం జిల్లా వేములవాడ సమీపంలోని హనుమాజీపేటలో జన్మించాడు. బాల్యంలో అతన్ని గాంధీజీ ఆకర్షించాడు. స్కూలులో విద్యార్థిగా వున్నప్పుడే నిజాంకు వ్యతిరేకంగా పోరాటం జరుగుతూ వుంది. స్కూలు విద్యార్థులు నైజాంకు స్వాతంత్ర్యం రావాలని సత్యాగ్రహం చేసారు. వాళ్ళలో నారాయణరెడ్డి కూడా వున్నాడు. కాలేజీ విద్యార్థిగా వున్నప్పుడు గురజాడ, కృష్ణశాస్త్రి, జాషువా కవితలు చదివేవాడు. చిన్ననాడే గాంధీజీ మీద గేయాలు వ్రాసారు. తర్వాత మానవతా వాదాన్ని విశ్వసించాడు. ప్రేమించాడు. మహాకావ్య రచనకు గేయాన్ని ఎన్నుకొని కర్పూర వసంత రాయలు, నాగార్జున సాగరం వంటి రమ్యమైన గేయకావ్యాలు రచించాడు. కర్పూర వసంత రాయల నుంచి విశ్వంభర వరకు ఆయన వస్తువు మానవుడు మానవతా వాదమే.

*మనిషినా పల్లవి / మనిషి నా పతాక*

మనిషి నా అవధి / మనిషి నా ఆకాశం
మనిషి నా ఉచ్ఛ్వాసం / మనిషి నా విశ్వాసం

అని "కవిత సాక్షిగా చెబుతున్నాను" కవితలో చాటాడు సినారె.

అందుకే నేను మనిషి కమ్మేసే
అతిలోక శక్తులకు అతిరిక్తున్ని
దేవుడా మనిషా ఎన్నుకోమంటే
మనిషికే ఓటేసిన విచిత్ర భక్తున్ని

అని ఆత్మవిశ్వాసంతో కవి తాను మనిషిని నమ్ముకున్న కవినని చెప్పాడు. మనిషి అభివృద్ధిని కోరుకునే వాన్ని అని చాటాడు. ఏడవ తరగతిలో ఉన్నప్పుడే సీస పద్యం వ్రాసిన సినారె ఇప్పటికీ వ్రాస్తూనే వున్నాడు. తెలంగాణలో పుట్టిన అతని మీద ఉద్యమ ప్రభావం భావకవితా సౌందర్యం అభ్యుదయవాద ప్రభావాలు కన్పిస్తాయి. నెత్రూరా కలలతో పుట్టిన కవి నారాయణరెడ్డి. నారాయణరెడ్డి "మనిషి", "విశ్వంభర", "భూమిక" ఖండకావ్యాల్లో వస్తువు మనిషి, మనిషిలో అతర్నిహితంగా వుండే శక్తి పేరు చైతన్యం. ఆ చైతన్య శక్తి మనిషి, పురోగమనానికి పునాది–భూమిక అంటాడు నారాయణరెడ్డి. "మనిషి ఆరిపోని పరిణామ జ్యోతి", "చైతన్యమే భూమిక సకల జీవన సంస్కృతి" అంటాడు నారాయణరెడ్డి. సినారె అభ్యుదయ కవిత్వంలో గేయానికి ప్రాధాన్యం కన్పిస్తుంది. అంటే తర్వాత విప్లవ కవిత్వంలో పాట ప్రధానమైంది. అభ్యుదయ కవుల్లో సి.నారాయణరెడ్డి 'కర్పూర వసంత రాయలు', 'నాగార్జున సాగరం' వంటి గేయ కావ్యాలు రచించాడు. గేయాలు వచన కవిత్వం వలె కాక ఛందో లక్షణాలు కలిగినవి. గేయాన్ని కావ్య రచనకు ఛందస్సుగా తీసుకొని సినారె కొత్తదనాన్ని చూపాడు. భారతదేశంలో నోబెల్ పురస్కారమంత సమున్నతమైన జ్ఞానపీఠ సాహిత్య పురస్కారం చేత సి.నారాయణరెడ్డి సన్మానింపబడినాడు.

## తెలంగాణ రచయితల సంఘం

1950 ప్రాంతంలో తెలంగాణ రచయితల సంఘం స్థాపించబడింది. దాశరథి,

కాళోజి, రామరాజు, వట్టికోట ఆళ్వారు స్వామి యువకవి సినారె, కోవెల సంపత్కుమారాచార్య వంటి వాళ్ళెందరో దానిలో వున్నారు. ఈ కవులు జిల్లాల్లో తిరిగి కవితాగానం చేసి తెలంగాణలో తెలుగు కవితాభిమానం వెలిగించారు. యువకవులకు కవితాగానం చేసే ఉత్సాహాన్ని పంచిపెట్టారు. ఈ కవితాగానాలతో ఎందరో యువకులు కవిత్వం వ్రాయాలనే ప్రేరణను పొందారు. ఆ విధంగా ఒక విధమైన కవితా చైతన్యాన్ని ఈ తెలంగాణ రచయితల సంఘం తీసుకువచ్చింది. సాహిత్యాభిమానాన్ని యువకుల్లో ఉత్పన్నం చేసింది. సాహిత్య వాతావరణాన్ని తీసుకువచ్చింది.

## అంపశయ్య నవీన్

ఒకవైపు కవితోద్యమం నడుస్తుంటే మరోవైపు యువ రచయితలు వచన ప్రక్రియలో రచనలు చేయాలని ఉత్సాహం చూపించారు. ఈ కాలంలో నవీన్ 'అంపశయ్య' అనే ప్రయోగాత్మక నవల రచించాడు. మనో వైజ్ఞానిక శాస్త్రం మీద ఆధారపడిన మనస్సులోని ఆలోచనలను ధారగా చెప్పే 'చైతన్య స్రవంతి' శైలిలో నవీన్ 'అంపశయ్య' నవల రచించాడు. ఒక విద్యార్థి పట్టణ వాతావరణంలో ఏ విధంగా న్యూనతా భావానికి గురవుతాడో నవీన్ ఆసక్తికరంగా చిత్రించాడు. కొన్ని గంటల ఇతివృత్తాన్ని నవీన్ ఈ నవలలో చెప్పాడు. తెలంగాణ విమోచనోద్యమాన్ని చిత్రిస్తూ ఈ కాలంలో తెలంగాణ నుంచి తెలంగాణ రచయితలు వ్రాసిన నవలలు రావటం విశేషం. 'కాలరేఖలు, 'రక్తసారం', 'బాంధవ్యాలు' మూడు తెలంగాణ పోరాటాన్ని చిత్రించే నవలలను నవీన్ రచించాడు. నవీన్ కథలు కూడా వ్రాసాడు. 1970లో ఇందిరాగాంధీ విధించిన ఎమెర్జన్సీని చిత్రిస్తూ 'చీకటి రోజులు' నవలను నవీన్ రచించాడు. తాడిగిరి పోతరాజు ఎమెర్జన్సీ కథలు "కిటికి" కథలుగా రచించగా నవీన్ నవలను వ్రాసాడు. తెలంగాణ రచయితలు మాత్రమే ఎమెర్జన్సీ అమానుషాలను గురించి వ్రాసారు. ఏ ప్రాంతపు రచయితలు వ్రాయలేదు.

## దాశరథి రంగాచార్యులు

దాశరథి రంగాచార్యులు తెలంగాణ నిజాం పాలనను నైజాం విమోచనోద్యమాన్ని

చిత్రిస్తూ "చిల్లర దేవుళ్ళు", "మోదుగుపూలు", "జనపదం" నవలలు రచించాడు. దాశరథి కృష్ణమాచార్యుల సోదరులు సంస్కృతాంధ్ర భాషల్లో పండితులు. వేదాలను తెనిగించారు. పోరాటకాలంలో జైలు శిక్షననుభవించారు. దాశరథి తెలంగాణ పోరాటాన్ని చిత్రిస్తూ "చిల్లరదేవుళ్ళు, మోదుగుపూలు, జనపదం" నవలలను 1970 దశకంలో రచించాడు. ఇవేగాక "పావని, రానున్నది ఏది నిజం, మానవత, శరతల్పం" సాంఘిక నవలలు రచించాడు. "జీవనయానం" ఆయన ఆత్మకథ.

నిజాం పాలనలో తెలంగాణ విమోచనోద్యమాన్ని ప్రజల బాధలను వాస్తవికంగా చిత్రిస్తూ తెలంగాణ నుంచి నవలలు వచ్చాయి. వీటిల్లో పార్టీ సిద్ధాంతాలకన్నా పోరాట కాలం నాటి యథార్థ పరిస్థితుల చిత్రణకు ప్రాధాన్యం కన్పిస్తుంది. కందిమళ్ళ ప్రతాపరెడ్డి 'బందూక్', కృష్ణారెడ్డి 'ఉప్పెన', బి.ఎన్.శాస్త్రి 'విప్లవజ్వాల', తిరునగరి 'సంగం', ముదిగంటి సుజాతారెడ్డి 'మలుపు తిరిగిన రథచక్రాలు, ప్రాణ్‌రావు 'మలగని బత్తి' మొదలైన నవలలు 21వ శతాబ్దంలో కూడా వ్రాయబడుతూనే వున్నాయి. తెలంగాణ పోరాటం ప్రపంచం దృష్టిని ఆకర్షించింది. భారతదేశ చరిత్రలో అపూర్వ ఘట్టం. ఈ పోరాటాన్ని చిత్రిస్తూ కిషన్ చందర్, వ్యాస్‌లు ఉర్దూలో హిందీలో కథ, నవలలుగా అఘోర ఛటోపాధ్యాయ ఇంగ్లీషులో రచించారు. ఇప్పటికీ రచయితలు తెలంగాణ విప్లవ పోరాటాన్ని వివిధ కోణాల నుంచి చిత్రిస్తూ నవలలు రచయితలు వ్రాస్తూనే ఉన్నారు.

తిరుపతయ్య "జీవన సమరం", "బతుకు" సామాజిక నవలలు తెలంగాణ ప్రజా జీవితాన్ని చిత్రించే నవలలు. వృత్తి పనులు నశించటం దాంతో వృత్తి పనుల వాళ్ళ జీవితాలు ఆగం కావటం వాళ్ళు వలసలు పోవటం అక్కడ వాళ్ళు పడే కష్టాలను చిత్రించే నవలలు, కథలు తెలంగాణ నుంచి మాత్రమే వచ్చాయి. అక్షరాస్యత ఎక్కువ కావటంతో కింది వర్గాల వాళ్ళు వాళ్ళ జీవితాలను వాళ్ళే చెప్పుకున్నారు. పల్లెల, వృత్తి పన్నుల విధ్వంసాన్ని చిత్రిస్తూ పెద్దింటి అశోక్ కుమార్ 'దాడి', నేరెళ్ళ శ్రీనివాసగౌడ్ 'బ్రతుకుతాడు', దిలావర్ 'సమిధలు' ఇంకా జాతశ్రీ 'బలిపశువు' నవలలు రచించారు. వీళ్ళు కథలు కూడా వ్రాసారు.

## స్త్రీల రచనలు

1960 దశకంలో తెలుగు సాహిత్యంలో స్త్రీలు విస్తారంగా రచనలు చేస్తున్నప్పుడు తెలంగాణ నుంచి యశోదారెడ్డి, మాదిరెడ్డి సులోచన, కథలు నవలలు రచించారు. యశోదారెడ్డి "ఎచ్చమ్మ కథలు, మావూరి ముచ్చట్లు" ప్రసిద్ధమైన కథా సంపుటాలు. మాదిరెడ్డి సులోచన 80 వరకు నవలలు, 150 వరకు కథలు వ్రాసింది. తెలంగాణ పల్లె జీవితం కొన్ని నవలల్లో కథల్లో ప్రతిబించింది. కొన్ని నవలలు వ్యాపార నవలలు. ఆమె ఐదారు నవలలు సినిమాలుగా కూడా వచ్చాయి. 1960 దశకంలో పోల్కంపల్లి శాంతాదేవి, బోమ్మా హేమాదేవి ఒక్కొక్కరు 60, 70 నవలలు రచించారు. వాళ్ళ నవలల్లో కుటుంబ సమస్యల చిత్రణ, స్త్రీ ఆత్మగౌరవ చిత్రణలు కన్పిస్తాయి. ఈ రచయిత్రులు నవలల్లో శైలి ధారాళంగా ఉంది. కథన శైలి చదివించేటట్లుగా ఉంది.

## అభ్యుదయానంతర ధోరణులు - వాదాలు

*దిగంబర కవులు*

దేశ స్వాతంత్ర్యంతో సౌఖ్యమయ జీవితం వస్తుందని ఆశించారందరూ. అభివృద్ధి జరుగుతుందనుకున్నారు. కాని భారతదేశానికి స్వాతంత్ర్యం వచ్చి చాన్నాళ్లయినా అభివృద్ధి ఎక్కడ వేసిన గొంగడి అక్కడే వుందన్నట్టు అయిపోయింది. నెహ్రూ ప్రణాళికలు కన్న కలలు ఫలించే కాలం వస్తుందనుకున్న వాళ్లకు నిరాశ ఎదురయింది. భారత ప్రభుత్వం 1957–58ల్లో ప్రపంచ బ్యాంకు అంతర్జాతీయ ద్రవ్యనిధుల నుంచి తీసుకున్న డబ్బును చెల్లించే మార్గం కనపడలేదు. ఆహార పదార్థాల కొరత ఏర్పడింది. దారిద్ర్యం పెరుగుతూ వుంది. భూదానోద్యమాలు భూసంస్కరణలు పేరుకే నడిచాయి. కాని పేదవాళ్ళ ఉద్ధరణ జరుగలేదు. భూస్వాముల, ధనికుల దౌర్జన్యాలతో పాటు రాజకీయ నాయకుల స్వార్థాలు దోపిడీలు పెరిగిపోయాయి. ఈ ఆర్థిక సంక్షోభం అవినీతిని ప్రతిఘటిస్తూ దిగంబర కవులు తమ కవిత్వంలో అసంతృప్తిని ప్రకటించారు. సమాజంలోని కృత్రిమతను, మోసాలను ఖండించారు. అసలు రూపంతో ముసుగు లేకుండా బతకాలనడమే సత్యాన్ని అనాచ్ఛాదితం చేయడమే - దిగంబర కవుల దిగంబరత్వం. సమాజంలోని కుష్ఠు వ్యవస్థ మార్చాలన్నది వాళ్ల ఆశయం.

1965–68 మధ్య దిగంబర కవులు కవిత్వం వ్రాసారు. మూడు కవితా సంపుటాలు ప్రచురించారు. 1965లో మొదటి సంపుటాన్ని హైద్రాబాదులో ఒక రిక్షావానిచేత, రెండో సంపుటాన్ని విశాఖపట్టణంలో బిచ్చగత్తెచేత అర్ధరాత్రి ఆవిష్కరింపజేసి సంచలనాన్ని సృష్టించారు. తమ కవితా ఖండికలను 'దిక్'లని పిలవాలన్నారు. నగ్నముని, నిఖిలేశ్వర్, చెరబండరాజు, జ్వాలాముఖి, మహాస్వప్న, భైరవయ్య–అనే ఆరుగురు (అవి వాళ్ళ కలం పేర్లు) దిగంబర కవులుగా ఏర్పడి కవితా సంపుటాలు ప్రచురించారు. ఆరుగురు కవుల్లో నిఖిలేశ్వర్, చెరబండరాజు, జ్వాలాముఖి తెలంగాణ కవులు. సమాజం అసమానతలకు, అన్యాయాలకు నిలయమని దాని స్థానంలో సమానత, న్యాయమున్న వ్యవస్థ రావాలని అభ్యుదయ కవులు కోరుకున్నారు. శిథిలమైపోతున్న నాటి సమాజం నశించి ఉజ్జ్వలమైన సమాజం సృష్టింపబడుతుందని కలలుగన్నారు. కాని ఆ కలలన్నీ కల్లలైపోయాయి. దిగంబర కవులు ఆ అసంతృప్తి ఫలితంగా కలిగిన కోపంతో తిట్లకు పరుష పదప్రయోగాలకు దిగారు.

*పుళ్ళుపడి కుళ్ళిపోయిన వక్షం, పుచ్చిపోయిన పిండం,*
*మెదడు పురుగు తినేసింది. చర్మం కుళ్ళిపోయింది,*
*అవయవం పుచ్చిపోయింది, కళ్ళకి కన్నం పడింది –*

వంటి పదజాలం వాళ్ల కవిత్వంలో వుంది. దిగంబర కవుల కవిత్వంలో సౌందర్యం కాని శ్రవణ సుభగమైన పదయోజనగాని లేదు. దిగంబర కవులు ప్రజల అంతరంగంలో వ్యాపించిన ఆరాటానికి, విసుగుకు, విషాదానికి స్పందించారు. సమాజంలోని రాజకీయాల్లోని కుళ్ళును దిగంబరం చేసి చూపారు. షాక్ ట్రీట్‌మెంటు పద్ధతిలో బూతులతో తిడుతూ వాళ్ళు కవిత్వం వ్రాసారు. వాళ్ళ కవిత్వంలో ఆవేశం వేగం వుంది. వచన కవిత్వాన్ని వాడుకున్నారు. అయినా తమ కవిత్వంలో 'వచనం లేదు, కవిత్వం అంతకంటే లేదు' అని ప్రాచీన కవిత్వం నుంచి వచన కవిత్వం వరకు తెలుగు కవిత్వం మీద ధ్వజమెత్తారు.

1950ల్లో అమెరికాలో బీట్నిక్స్ కవుల ఉద్యమం ప్రపంచ యువకుల నాకర్షించింది. బ్రిటన్‌లో "ఆంగ్రీ యంగ్‌మన్', "నేకెడ్ పోయట్స్" పేరుతో కవితా

ధోరణులొచ్చాయి. 1958లో బెంగాల్‌లో ఆకలితరం కవులు తిరుగుబాటు చాటారు. దిగంబర కవులు వాళ్ళ నుంచి ప్రేరణ పొంది వుంటారు. అందుకే కోపంతో సమాజంలోని కుళ్ళును కసితో బయటపెట్టిన "ఆంగ్రీ యంగ్‌మెన్" అయినారు. ఈ కవుల మీద మార్క్స్ సిద్ధాంతాల, సార్త్రే అస్తిత్వవాదం ప్రభావాలు కన్పిస్తాయి. ప్రాచీనత దేనిమీదా – ప్రాచీన సమాజం మీద గాని ప్రాచీన సాహిత్యం మీద గాని వాళ్ళకు అభిమానం లేదు. దిగంబర కవుల మొదటి కవితా సంపుటి 1965లో వచ్చింది. ఆతర్వాత రెండు సంపుటాలు వచ్చాయి. ఆ తర్వాత ఆ కవుల మార్గాల్లో విభేదాలు వచ్చాయి. చెరబండరాజు, నగ్నముని, జ్వాలాముఖి, నిఖిలేశ్వర్‌లు విప్లవ రచయితలుగా మారారు. మహాస్వప్న భైరవయ్యల మార్గం వేరే అయింది. దాంతో దిగంబర కవిత్వం ఝంఝానిలా వీచి ఆగిపోయింది.

దిగంబర కవులు సమాజంలోని నిస్తబ్ధతను సంప్రదాయాలను నిరసించి విరుచుకుపడ్డారు. ఈ విషయంలో పఠాభికి వీళ్లకు సామ్యం కన్పిస్తున్నది. పదవుల కోసం డబ్బుకోసం తెగించే వాళ్ళను ఈ కవులు నిరసించారు. కుష్ఠు వ్యవస్థను దుర్గంధ సంస్కృతిని వ్యాపింప జేస్తున్న వాళ్ళను నిరసించారు. దాన్నంతా ధ్వంసం చేయమని యువతరానికి పిలుపునిచ్చారు. పాత విలువలను ధ్వంసం చేయాలన్నది వాళ్ళ ఆకాంక్ష–

*"అంటు వ్యాధిలాంటి/ అజగరం లాంటి*
*గొంగళి పురుగు భావాలు భస్మం చేయాలి*
*నిర్మలమైన భావవీచికల్ని/ హాయిగా ప్రసరింజెయ్యాలి"* అంటారు.

సమాజంలోని నల్లబజార్లను, అవినీతి దోపిడీని ఆత్మవంచన పరవంచనలను అసహ్యించుకున్నారు. "వందేమాతరం" కవితలో చెరబండరాజు ఆవేదనతో "అమ్మా భారతీ నీ గమ్యం ఏమిటి తల్లీ!" అని ప్రశ్నించాడు. సాంస్కృతికంగా సమాజం పొందిన కృత్రిమ రూపాన్ని ఈ కవులు ప్రశ్నించారు. మత మౌఢ్యాన్ని గురువుల మోసాలను ప్రశ్నించారు. ఆధునిక నాగరికతలోని దుర్మార్గానికి అక్రమాలకు బాధపడ్డారు. వాళ్ళకు భావంలో దాపరికం లేదు. వాళ్ళ కవిత్వం చదివినప్పుడు

సమాజంలోని హేయమైన మనుషుల మీద వాళ్ళు సృష్టించిన పరిస్థితుల మీద జుగుప్స కల్గుతుంది.

దిగంబర కవులు లైంగిక ప్రతీకలను వాడి కొంత అశ్లీలతను సృష్టించారు. లైంగికం అశ్లీలం కాదు. కాని దాన్ని చెప్పే తీరులో అశ్లీలతను సృష్టించి ఈ కవులు గ్రామ్య సంస్కృతిని తెచ్చి సమాజం మీదనే కాక ప్రాచీన కవుల సంప్రదాయాల మీద కూడా నిరసనను ప్రకటించారు. అభ్యుదయ సాహిత్యంలో ఏర్పడిన స్తబ్ధతను వదిలించి దిగంబర కవులు సాహితీ లోకాన్ని ఒక ఊపు ఊపారు. వాళ్ళ కవిత్వంలోని తిట్లు బూతులు ఆటవిక ఆవేశం కవిత్వం కాదని రారా వంటి విమర్శకులు విమర్శించినా, శిల్పం లోపించిందని అన్నా వాళ్ళ ఆశయాలు లక్ష్యాలు మంచివే అని వాళ్ల కవిత్వంలోని నిజాయితీని ధర్మక్రోధాన్ని కొందరు శ్లాఘించారు. దిగంబర కవులననుకరిస్తూ పైగంబర కవులు వచ్చారు. 1969–71 మధ్యకాలంలో గుంటూరులో కిరణ్‌బాబు, దేవీప్రియ, ఓల్గా, కమలనాథ్ పైగంబర కవులుగా ఏర్పడ్డారు. తిరుగబడు కవులు 1968–70 మధ్యకాలంలో వరంగల్‌లో కిషన్‌రావు, సుదర్శన్‌రావు, లోచన్, యాదగిరిరావు, వరవరరావు, టంకశాల అశోక్, యన్.కె.తిరుగబడు కవులుగా ఏర్పడ్డారు. చేతనావర్త కవులు, అనుభూతి కవులు బయలుదేరారు. వీళ్ళేగాక ఉషస్సు రచయితలు (1969–73) హైదరాబాద్ పాతబస్తీలో ఏర్పడ్డారు. చిత్తూర్‌లో నిశికవులు (1980–85), విశాఖపట్టణంలో నిరసన కవులు (1982–84) కవితా సంకలనాలు ప్రచురించారు.

అభ్యుదయ కవిత్వంలో జడత ఏర్పడిందని భావించిన పైగంబర, తిరగబడు కవులు దిగంబర కవులవలెనే ఆవేశం, ఆక్రోశంతో వ్యవస్థ మీద, రాజ్యం మీద తమ నిరసనను, విరక్తిని, కోపాన్ని ప్రకటించారు. వీళ్ళకు మార్క్సిజం మీద నమ్మకం వుంది. చేతనావర్త, అనుభూతి కవులు సమస్యలకు భావ చైతన్యం వ్యక్తి విజ్ఞానంలో పరిష్కారం వుంటుందని చెప్పారు. వీళ్ళకు మానవత కన్నా మానవుని మీద నమ్మకం ఎక్కువ. మార్క్సిజం మీద వీళ్ళకు విశ్వాసం లేదు. నవ్యసంప్రదాయం కూడా మార్క్సిజంను అంగీకరించదు. నవ్య సంప్రదాయం విజాతీయ లేదా విదేశీయ

సాంస్కృతిక, ఆర్థిక దాడులను ఎదిరించాలని అభివృద్ధి జాతీయత స్వావలంబనలోనే వుందని అంటారు. 1970లో విప్లవ కవిత్వం ఆవిర్భావంతో దిగంబర కవిత్వం దానిలో లీనమై పోయింది. 1970లో విరసం ఏర్పడినప్పుడు నగ్నముని, చెరబండరాజు, జ్వాలాముఖి, నిఖిలేశ్వర్‌లు విప్లవ రాజకీయాలను అంగీకరించారు. అరసం కవుల ఆరాటం దిగంబర కవుల ఆవేదన విప్లవ కవుల సాయుధ విప్లవంగా మారింది.

## నవ్య సంప్రదాయ వాదం

నవ్య సంప్రదాయ సాహిత్యం, విమర్శనా ధోరణులు భావకవిత్వం కాలం నుంచి మొదలుకొని ఇప్పటివరకు కొనసాగుతూనే వున్నాయి. కాబట్టి దీనికి ఒక కాల నిర్ణయం చేయడానికి వీల్లేకుండా వుంది. అనేక ధోరణులు, వాదాలు ఒకదాని తర్వాత ఒకటి తెలుగు సాహిత్యంలో వస్తున్నా మరోవైపు సంప్రదాయ రీతులను అనుసరించడం అందులో నవ్యత ఆధునికతలను చూపడం సమాంతరంగా కొందరు చేస్తున్నారు. పాశ్చాత్య ప్రభావం, మరో ప్రభావం, విజాతీయత వాళ్ళకిష్టం లేక సంప్రదాయ పద్ధతులను ప్రేమిస్తూ అందులో నవ్యతను తేవాలని అభిప్రాయపడ్తున్నారు. నవ్య సంప్రదాయ "యుగం"ను వేరేగా చెప్పి దీనికి విశ్వనాథను యుగకర్తగా చెప్తే బాగుంటుందని కొందరి విమర్శకుల అభిప్రాయం.

నవ్య సంప్రదాయవాదంలో సాహిత్యం, విమర్శలు కన్పిస్తున్నాయి. కొందరు నవ్య సంప్రదాయవాదం ఒక రూపాన్ని పొందలేదంటారు. నవ్య సంప్రదాయవాదులు మాత్రం నవ్య సంప్రదాయవాదం సంపూర్ణంగా వికసించిన మార్గమంటారు. "నవ్యసంప్రదాయ" పదానికి "నియో ట్రాడిషనిలిజం" అని అర్థం కాక "నియోక్లాసికల్" అని అర్థం అంటారు. ఇంగ్లీషు సాహిత్యంలో వచ్చిన నియోక్లాసికల్ యుగ లక్షణానికి నవ్యసంప్రదాయానికి సంబంధం లేదని దాని చరిత్ర దీని చరిత్ర వేరని అంటారు. 1920-75 మధ్య వచ్చిన భావ, అభ్యుదయ కవులు మాత్రాఛందస్సులు గేయాలు వచన కవిత్వాలు వ్రాస్తుండగా నవ్యసంప్రదాయవాదులు మహాకావ్య ఖండకావ్య ప్రక్రియల నెన్నుకొని ఛందోపద్యాలు వ్రాసారు. వీరేశలింగం కాలంలోనే శ్రీపాద, వడ్డాది వంటి కవులు భారతాది కావ్యాలననువదించారు. నన్నయ కావ్యమార్గం ఆ

విధంగా 20వ శతాబ్దం వరకు కొనసాగుతూనే వుంది. కాని విశ్వనాథ వంటి కవులు ఆధునిక దృక్పథంతో సాంస్కృతిక, ఆర్థిక రంగాల్లో విజాతీయతను తోసిపుచ్చి జాతీయ దృక్పథంతో వ్రాసారు. అదే నవ్య సంప్రదాయ వాదమని చెప్పాలి. వీరేశలింగం యుగంలోని కావ్య కవుల రచనలవలె వీళ్ళ రచనలు సంస్కృతానువాదాలు కావు. అయితే ఈ యుగంలోను వస్తు నవ్యతతో శివభారతం, రాణా ప్రతాప చరిత్ర, పోతన చరిత్ర, తిరుపతి వేంకట కవుల బుద్ధ చరిత్ర, వేదాంతాచార్యుల జగదీశ చంద్రబోసు చరిత్ర వంటి కావ్యాలు వ్రాయబడినాయి.

మహాకావ్య ప్రక్రియ పాతబడిన ప్రక్రియ. గతించిన గతానికి, ఫ్యూడల్ వ్యవస్థకు చిహ్నం అని కొందరు తలంచగా దుర్భాక రాజశేఖర కవి, గడియారం వేంకటశేష శాస్త్రి, వానమామలై వరదాచార్యులు వస్తువులో నవ్యతను, భావాల్లో ఆధునికతను ఆధునిక సామాజిక బాధ్యతను, స్పృహను ప్రదర్శిస్తూ మహాకావ్య రచనలు చేసారు. పద్య రచనను చేపట్టి వస్తు నవ్యతతో జాషువా, తిరుపతి వేంకటకవులు, పింగళి కాటూరి కవులు, జగన్నాథాచార్యులు, పల్లా దుర్గయ్య, గంగుల శాయిరెడ్డి, తుమ్మల సీతారామమూర్తి కరుణశ్రీ, ఇంద్రగంటి, వేముగంటి నరసింహాచార్యులు మొదలైన వాళ్ళు ఖండకావ్యాలు వ్రాసారు. తిరుమల శ్రీనివాసాచార్యులు 1938లో కరీంనగర్ జిల్లా నారాయణపురంలో జన్మించాడు. "ఉదయరాగం" (1970) ఖండకావ్యం "కావ్యపు షరిణి" కవితా సంకలనం, ప్రాచీన పద్యాలకు వ్యాఖ్యానాలు వ్రాసాడు. తెలుగులో గేయనాటికల మీద పరిశోధన చేసాడు. "సి.నారాయణరెడ్డి సాహితీమూర్తి" (1981) తిరుమల విమర్శనా గ్రంథం పద్య రచనలో విమర్శలో సంప్రదాయ ఛాయలు కన్పిస్తాయి. 1967లో "చేతనావర్తకవులు" పేరున్న పేర్వారం జగన్నాథం, కోవెల సంపత్కుమార, కోవెల సుప్రసన్న, నరసింహారెడ్డి అనే నలుగురు కవుల్లో నవ్యసంప్రదాయ ఛాయలున్నాయి. నవ్యసంప్రదాయంలో చెళ్ళూరి శ్రీనివాసరావు "వివేకానంద చరిత్ర" వజ్జల కాళిదాసు "ఆంధ్రమహావిష్ణువు" (ద్విపద)లు చెప్పుకోదగినయి. దేవులపల్లి రామానుజరావు, ఉత్పల సత్యనారాయణాచార్యులు, బోయి భీమన్న మొ॥ కవులెందరో నవ్యసంప్రదాయంలో పద్యరచన చేసిన ఎన్నదగిన కవులున్నారు. 20వ శతాబ్దం ఆరంభంలో మహాకావ్యం అంతరించి పోయే ప్రమాదం నుంచి సాహిత్యాన్ని రక్షించాలనే

తపన నవ్య సంప్రదాయంలో కన్పిస్తున్నది.

నవ్యసంప్రదాయం విమర్శలో బాగా బలంగా కన్పిస్తున్నది. కట్టమంచి పాశ్చాత్య విమర్శ పద్ధతులను, ఆలోచనలను పదజాలాన్ని తెలుగు విమర్శలోకి తెచ్చి కాల్పనిక విమర్శకు ఆధునిక విమర్శకు పునాదులు వేసాడు. ఆ తర్వాత మార్క్సిస్టు విమర్శ వంటి నూతన విమర్శనా ధోరణులు వచ్చాయి. అయితే అవన్నీ ప్రాచీన భారతీయ సంప్రదాయానికి చెందిన అలంకారాలు రసం ధ్వని మొదలయిన అంశాలను పట్టించుకోలేదు. అది కొందరికి నచ్చలేదు. భారతీయ విమర్శనా సూత్రాలు సిద్ధాంతాలు నిత్యనూతనమైనయి. మారుతున్న కవితాధోరణులకు ప్రక్రియలకు వాటిని ఇంకా ముందుకు తీసుకెళ్ళి అన్వయించవచ్చునని నవ్యసంప్రదాయవాదుల అభిప్రాయం. అటువంటి విమర్శలోను విశ్వనాథ ముందు నడిచాడు. అతని మార్గంలో కురుగంటి, జి.వి.కృష్ణారావు, వింజమూరి మొదలయిన విమర్శకులు వున్నారు.

"సాహిత్య చరిత్రలో చర్చనీయాంశాలు" గ్రంథంలో జి.వి.సుబ్రహ్మణ్యం నవ్య సంప్రదాయాన్ని గురించి చాలా చర్చించారు. నవ్యసంప్రదాయం స్వరూప స్వభావాలను నిర్దేశించారు. నవ్యసంప్రదాయాన్ని ముందుకు తెచ్చిన వాళ్ళల్లో కోవెల సుప్రసన్నాచార్య, జి.వి.సుబ్రహ్మణ్యం ప్రముఖమైన విమర్శకులున్నారు. "వీరరసం, రసోల్లాసం" వంటి విమర్శ గ్రంథాలను వ్రాసి జి.వి.సుబ్రహ్మణ్య రస సిద్ధాంతానికున్న ప్రాముఖ్యాన్ని వివరించారు. కోవెల సుప్రసన్న విశ్వనాథ వారి నవ్యసంప్రదాయాలను వివరించిన విమర్శకుడు.

ప్రపంచం భిన్నజాతులతో భాషా సంస్కృతులతో కూడింది. ఒక్కొక్క జాతికి దాని భౌగోళిక నేపథ్యంలో దానికి స్వంతమైన జీవనతాత్త్వికత ఎదుగుతుంది. మార్క్స్ ఆర్థికశక్తి దాన్ని మార్చివేస్తుందని ఏ ఎల్లలు లేని ప్రపంచ మానవత సృష్టింపబడ్తుందని చెప్పాడు. అతని ఊహలు కల్లలయినాయి. తూర్పు యూరోపు దేశాలు రష్యా 1980 దశకంలో భాష జాతి మతం ప్రాతిపదికగా చీలిపోయాయి. స్వతంత్ర రాజ్యాలు ఏర్పడినాయి. రష్యా సోషలిస్టు సామ్రాజ్యం కూలిపోయింది. 1990 దశకంలో ఆర్థిక రంగంలో వచ్చిన ఓపెన్ మార్కెటులు, గ్లోబలైజేషన్, టెలికమ్యూనికేషన్ల అభివృద్ధితో

భూగోళంలో సరిహద్దులు దగ్గరై దూరాలు అధిగమించడం వంటివి కూడా "జాతి" భావనను చంపలేకపోయాయి. ఏ విధంగాను విజాతీయ "డామినేషన్'ను ఒక జాతి అంగీకరించడం లేదు. అటువంటప్పుడు ఆధునికత పేరుతో ఇతరుల సిద్ధాంతాలను, కవిత్వాలను దిగుమతి చేసుకుంటే ఆ జాతి మనుగడకే ముప్పు వస్తుంది. ప్రపంచ వ్యాప్తంగా ఒకేసారి ప్రసారం చేయబడుతున్న దూరదర్శన్ ప్రోగ్రాములు, సినిమాలు తమ జాతి సంస్కృతిని నాశనం చేస్తున్నాయని ఎన్నో దేశాల ప్రజలు ఎదిరిస్తున్నారు. ఆలోచన లేకుండా సిద్ధాంతాలను, భావజాలాన్ని దిగుమతి చేసుకుంటే జాతి సృజనాత్మకత నశిస్తుంది.

భారతజాతి ప్రాచీనమైంది. దానికి ప్రాచీనమైన సాహిత్యం, విమర్శ సూత్రాలు అభివృద్ధి చెందాయి. మన ప్రాచీన విమర్శ విజ్ఞానంతో పాశ్చాత్యులు ప్రభావితమవుతుండగా వాళ్ళ విమర్శ సూత్రాలను మనం దిగుమతి చేసుకుంటుంటే జాతి ఆలోచనా సూత్రంలో "కంటిన్యుటీ" – ఏకసూత్రత అనేది లేక జాతి మేధస్సు సృజనాత్మకతలు నశించే అవకాశముంది. కాబట్టి మన సంప్రదాయంలోని విమర్శ సూత్రాల కనుగుణంగా నూతన పద్ధతులను వికసింప జేసుకోవాలన్నది నవ్య సంప్రదాయ విమర్శ ముఖ్యోద్దేశం. ప్రాచీన భారతీయ విమర్శ సిద్ధాంతాలను వికసింప జేశారు కూడా. రసధ్వని అలంకారాల వంటి ప్రాచీనాచార్యుల సిద్ధాంతాల మీద అనురక్తితో సామాజిక స్పృహ మానవతావాదంతో కూడిన నవ్యసంప్రదాయ విమర్శ సాగుతున్నది. అది ప్రగతికి విరుద్ధం కాదు. ఛాందసవాదం కాదు. వాళ్ళది జాతీయవాద దృక్పథం. తద్వారా విశ్వ దృక్పథం. వాళ్ళ దృష్టిలో సాహిత్యం భౌతిక ఆధ్యాత్మిక స్థితులకు వారధి. సమాజ దర్శనాన్ని మార్చే శక్తి సాహిత్య దర్శనానికుందని వాళ్ళంటారు. సమకాలిక పరిస్థితుల కతీతంగా ఆలోచించి భవిష్యద్దర్శనాన్ని చేయాలనే భారతీయ సాహిత్య దృక్పథమే వాళ్ళ దృక్పథం.

కవిత్వం రచనలు ఏవైనా భావకవిత్వం నుంచి విప్లవవాద స్త్రీవాద దళిత వాదాల కవిత్వం వరకు దేనినైనా సంప్రదాయ విమర్శనా దృష్టితో చూడవచ్చునని నవ్య సంప్రదాయవాదులంటారు. రామాయణ కల్పవృక్షం నుంచి కొయ్యగుర్రం

వరకు ఏదైనా మహాకావ్యమే. జాతికి స్వతఃసిద్ధంగా వుండే కళాసంస్కారంతో ఆవిష్కరించాలని వాళ్ళంటారు. కవిత్వంలో ఏ కొత్త ప్రయోగమైనా జాతి జీవనాడిని స్పందింప జేయాలన్నది వాళ్ళ ఆశయం. సాహిత్య సాంస్కృతిక సంరక్షణ భారం బాధ్యతలు విప్లవం, హింస, హత్యలను మార్గంగా బోధించే వాళ్ళ మీదనే వుందనే భావజాలాన్ని వ్యతిరేకిస్తుంది నవ్యసంప్రదాయం. ఇది మరో ప్రపంచానికి మరోమార్గం. లింగవివక్షత కులతత్త్వం తలెత్తిన నేపథ్యంలో ప్రగతివాదంతో కూడిన నవ్యసంప్రదాయం జాతి అభ్యుదయానికి చాలా అవసరం. నవ్యసంప్రదాయ విమర్శలో కోవెల సుప్రసన్నాచార్య, కోవెల సంపత్కుమారాచార్య విమర్శ వ్యాసాలు, ముదిగొండ వీరభద్రయ్య "రావిశాస్త్రి ధర్మేతిహాసం" '(మూడు కథల బంగారం నవల మీద విమర్శ, (అనుమాండ్ల భూమయ్య "వేయిపడగలు – ఆధునికేతిహాసం", సుజాతారెడ్డి "నవల – రస సిద్ధాంతం" వంటి విమర్శ గ్రంథాలు వ్యాసాలు చెప్పుకోదగినవి.

## చేతనావర్త కవులు

సమాజంలో జరిగే అన్యాయాలకు అవినీతికి ఈ కవులు స్పందించారు. కాని వీళ్ళు మార్క్సిస్టు దృక్పథాన్ని స్వీకరించలేదు. ఈ కవులకు సంప్రదాయ స్పృహ ఎక్కువ. వ్యవహారిక భాషను ప్రాంతీయ నుడికారాన్ని ఈ కవులు గ్రహించారు. చేతనావర్త కవులు 1968–70లో ఏర్పడ్డారు. సుప్రసన్న, పేర్వారం జగన్నాథం, సంపత్కుమార, వే.నరసింహారెడ్డి వీళ్ళందరు వరంగల్లు వాసులు. వచన కవితను స్వీకరించారు. వీళ్ళు "చేతనావర్తం" పేరుతో (1967) రెండు కవితా సంపుటాలు వేసారు. అభ్యుదయ కవులు సమాజంలో మార్పుకు తిరుగుబాటు అవసరమని గుర్తించగా చేతనావర్త కవులు మానవుడు తన విజ్ఞాన బలంతో చైతన్యవంతుడై తన ఉనికిని గుర్తించి తోటి మానవునికి తోడ్పడాలని భావించారని చేతనావర్త కవులను గురించి రామ మోహన్ రాయ్ సమీక్షించాడు. మానవుడు తన దివ్యత్వం పొంది చైతన్యవంతుడవుతాడని వాళ్ళంటారు. సుప్రసన్న కవిత్వంలో వేదాంత, తాంత్రిక, మనోవైజ్ఞానిక శాస్త్ర విషయాలుంటవి. "తేజశ్చక్రం, దుఃఖయోగిని, ఆధునీకం" అనే కావ్యాలను ప్రచురించాడు. పేర్వారం కవిత్వంలో వ్యంగ్య చమత్కారాలు, సామాజిక స్పృహ వుంటవి. 'సాగర సంగీతం' అనే కావ్యాన్ని ప్రచురించాడు. సంపత్కుమార

ఛందస్సులు తెలిసిన కవి. ఆధునిక సమస్యలను తాత్త్వికంగా వ్యక్తీకరించాడు. అలెగరీ పద్ధతి ఈయన కవిత్వంలో కన్పిస్తుంది. మానవుని సమగ్ర వికాసం సంప్రదాయం పునాదుల మీద జరుగుతుందని ఆశించే పద్య వచన కవి. వే.నరసింహారెడ్డిది వాస్తవిక దృష్టి. చేతనావర్తకవులు ఉమ్మడిగానే కాక వ్యక్తిగతంగా కావ్యాలు ప్రచురించారు. ప్రగతివాదం కన్నా అంతరాత్మ ప్రబోధమే ఉన్నత విలువలకు ప్రేరణనిస్తుందని చేతనావర్త కవులు విశ్వసించారు. మానవుడు విజ్ఞానబలంతో చైతన్యవంతుడై తోటి మానవులకు తోడ్పడుతాడని సంపత్కుమారాచార్య 'చేతనావర్తనం-అనుశీలనం' వ్యాసంలో అంటాడు. ఆధునిక భావ చైతన్యం వ్యక్తిని అభ్యుదయ పథంలో నడిపిస్తుందంటాడు. కొంతవరకు అరవిందుని తాత్త్వికత వీళ్ళకు పునాది అనవచ్చునేమో!

## విప్లవవాదం

1956 నుంచి రష్యాలో కమ్యూనిస్టు పార్టీలో 'రివిజనిజం' ప్రవేశించింది. కమ్యూనిస్టు పార్టీలోని రివిజనిజాన్ని, పెట్టుబడిదారీ మార్గానుయాయులను అంతమొందించాలనే ఉద్దేశంతో చైనాలో 1966లో శ్రామిక వర్గ సాంస్కృతిక విప్లవం వచ్చింది. అసలు 1949 నుంచే చైనాలో సోషలిస్టు ఆర్థిక విధానాన్ని సాధించే ప్రయత్నాలు జరుగుతూ వున్నాయి. ఆ ప్రయత్నాలే క్రమంగా 1966లో కార్మిక వర్గానికి రాజ్యాంగ యంత్రం మీద అధికారం ఏర్పడి విప్లవం సంపూర్ణమైంది. ఆ సమయంలోనే భారతదేశంలో రివిజనిస్టు మార్గంలో పార్లమెంటరీ పంథాలో పడిపోయిన కమ్యూనిస్టు పార్టీ నుంచి విప్లవ శక్తులు వేరయిపోయి నక్సల్బరీ శ్రీకాకుళోద్యమాలు లేచాయి. 1967లో పశ్చిమ బెంగాల్‌లో డార్జిలింగు జిల్లాలోని సిలిగుడి డివిజన్‌లోని నక్సల్బరీ గ్రామంలో రైతులు సాయుధులై భూస్వాముల భూములను ఆక్రమించు కొన్నారు. ఆ గ్రామం పేరుతో ఉద్యమానికి నక్సల్బరీ పోరాటమని నక్సలిజం అని పేర్లు వచ్చాయి. అప్పులను రద్దు చేస్తూ దళాలుగా సంఘటితమై పోరాడారు. మేధావి వర్గం, విద్యార్థులు కూడా ఈ పోరాటానికి మద్దతును ప్రకటించారు. కలకత్తా కళాశాల విద్యార్థులు ఈ పోరాటాన్ని సమర్థించారు. కమ్యూనిస్టు పార్టీలో చీలిక వచ్చి సాయుధ పోరాటాన్ని సమర్థించే మార్క్సిస్టు లెనినిస్టు పార్టీ అనుయాయులు నక్సల్బరీ ప్రాంతంలో పోరాటం మూడు సంవత్సరాలకే

బలహీనపడినా ఆ నక్సల్బరీ రైతుల సాయుధ పోరాటాన్ని ఇతర ప్రాంతాలకు వ్యాపింపచేసారు.

భారతదేశంలో స్వాతంత్ర్యానంతరం అభివృద్ధి అంతగా జరుగకపోగా 1960-67లో పారిశ్రామిక రంగంలో స్తబ్ధత ఏర్పడింది. ఆర్థికంగా సంక్షోభం ద్రవ్యోల్బణం ఏర్పడింది. అమెరికా తన పెట్టుబడులతో అప్పుల రూపంగాను మన దేశంలోకి ప్రవేశించింది. వలస సామ్రాజ్యవాదం స్థానంలో కొత్త సామ్రాజ్యవాదం ప్రారంభమైంది. ప్రపంచ బ్యాంకు అప్పులతో దేశం దేశ ప్రయోజనాలకు విరుద్ధమైన చర్యలకు పూనుకుంది. ఈ పరిస్థితుల్లో విద్యార్థుల్లో నిరుద్యోగులైన యువకుల్లో అశాంతి ప్రవేశించింది. విద్యార్థుల ఆందోళనలు పెరిగాయి. ఆ తరుణంలో నక్సల్బరీ సాయుధ పోరాటం వాళ్ళ నాకర్షించింది. ఎంతోమంది యువకులు తమ ఉన్నత విద్యలను విడిచిపెట్టి పోరాటంలో చేరిపోయారు. 1969 ఏప్రిల్ 22వ తేదీ నాడు లెనిన్ జయంతి రోజు మార్క్సిస్టు పార్టీ అవతరించింది. భూస్వాముల పెట్టుబడిదారుల చేతుల్లో రాజ్యాధికారం ఉందని దున్నే వానికే భూమి కావాలని, వ్యవసాయ విప్లవం, ప్రజా విప్లవం రావాలని, దీర్ఘకాలిక సాయుధ పోరాటంతో అది సాధింపబడుతుందని పార్టీ తీర్మానం జరిగింది. 1970 మే నెలలో కలకత్తాలో జరిగిన పార్టీ సమావేశంలో ఆంధ్రప్రదేశ్ నుంచి కొందరు వ్యక్తులు పాల్గొన్నారు. ఆ వ్యక్తుల్లోవెంపటావు సత్యనారాయణ, ఆదిభట్ల కైలాసం, మల్లికార్జునుడనే వాళ్ళు శ్రీకాకుళ పోరాటానికి నాయకత్వం వహించారు.

నక్సల్బరీ గ్రామంలో ప్రారంభమైన సాయుధ పోరాటం బీహార్, మధ్యప్రదేశ్, ఆంధ్రప్రదేశ్, కేరళ, పంజాబ్ మొదలైన రాష్ట్రాలకు వ్యాపించింది. 1967లో ఆంధ్రప్రదేశ్‌లో సాయుధ విప్లవం శ్రీకాకుళం జిల్లాలోని పార్వతీపురం ఏజన్సీ ప్రాంతంలో ప్రారంభమైంది. 1968లో సాయుధ విప్లవం గెరిల్లా యుద్ధ తంత్రాలతో ఇతర ప్రాంతాలకు కూడా వ్యాపించింది. ప్రభుత్వం సాయుధ విప్లవం జరిగే ప్రాంతాలను కల్లోలిత ప్రాంతాలుగా ప్రకటించి ఉద్యమాన్ని అణచివేయడానికి పూనుకుంది.

నక్సల్బరీ శ్రీకాకుళ పోరాటం తెలంగాణాలోని గిరిజన ప్రాంతాలైన ఆదిలాబాదులో ప్రవేశించి క్రమంగా కరీంనగర్, నిజామాబాద్, వరంగల్ మొదలైన ఉత్తర తెలంగాణా ప్రాంతాలకు పాకింది. నిజాం కాలంలో తెలంగాణా సాయుధ పోరాటాన్ని కమ్యూనిస్టు పార్టీ నడిపింది. 1948 సెప్టెంబరులో పోలీసు చర్యతో ఆ పోరాటం విరమింపబడడం సమర్థించని వాళ్ళు అసంతృప్తి చెందిన వర్గం నక్సల్బరీ పోరాటాన్ని సమర్థించి సాయుధ పోరాటాన్ని కొనసాగించారు. పార్లమెంటు పంథాను ఛేదించాలనే ఉద్దేశంలో సాయుధ పోరాటంతో రాజ్యాధికారాన్ని చేజిక్కించుకోవాలనే లక్ష్యంతో నక్సల్బరీ పోరాటం మావో ఆలోచనా విధానాన్ని అనుసరించింది. నక్సల్బరీ శ్రీకాకుళ ఉత్తర తెలంగాణ ఉద్యమం స్ఫూర్తితో తెలుగులో విప్లవ కవిత్వం వెలువడింది. 1968లో శ్రీకాకుళ ఉద్యమం ప్రారంభం నుంచి 1977లో అత్యవసర పరిస్థితి ఎత్తేసేంతవరకు ఒక దశగా అత్యవసర పరిస్థితి ఎత్తేసిన తర్వాత నుంచి చైనాలో మావో మరణం వరకు రెండో దశగా చెప్పవచ్చును. విప్లవ కవులు కొందరు సాయుధ పోరాటంలో స్వయంగా పాల్గొన్నారు. దాంతో నిబద్ధతే కాదు నిమగ్నత అవసరమన్న ఆలోచన సాహిత్యంలో ప్రవేశించింది.

సోషలిస్టు విప్లవ గమ్యానికి ప్రజా పోరాటానికి సాయుధ మార్గాన్ని ఎన్నుకున్న రచయితలు మార్క్స్ లెనిన్ మావోల ఆలోచనల మీది విశ్వాసంతో విప్లవ రచయితల సంఘం "విరసం" పేరుతో హైద్రాబాదులో 1970 జులై 4వ తేదీన సంఘటితమైనారు. మార్క్సిస్టు సిద్ధాంతాలను విశ్వసించిన అభ్యుదయ రచయితలు క్రమంగా ఆ మార్గానికి దూరమై ప్రభుత్వాన్ని పొగిడేవాళ్ళుగా మారారని విరసం వాళ్ళు తమ అసంతృప్తి వెలిబుచ్చారు. అభ్యుదయ కవులు రచయితలు మార్క్సిజం పట్ల తమ అభిమానాన్ని బాహాటంగా చాటలేదని విప్లవ కవులు, రచయితలు అంటారు. 1943లో అభ్యుదయ రచయితల సంఘం – అరసం ఏర్పడినప్పుడు తమది రాజకీయ సంఘం కాదు కాని రాజకీయాలను స్పృశించడం మహాపరాధంగా భావించమని అన్నారు. అయితే సాహిత్యం, రాజకీయాలు వేరుకావని విరసం వాళ్ళు చాటారు. సాహితీవేత్తలు అంతః పురాల్లో కాక ఆచరణలో వుండాలని అన్నారు. చాలామంది అరసం కవులు పార్టీతో సంబంధం లేకుండా వ్రాసిన వాళ్ళే అని అరసంను విమర్శించారు. క్రమంగా ఏ

కాస్తో కూస్తో అభ్యుదయ భావాలున్న వాళ్ళంతా అభ్యుదయ రచయితలుగా చలామణి అయ్యారని విరసం అరసం వాళ్ళను నిరసించింది. ప్రపంచ శాంతి, అంతర్జాతీయ సంఘటన, సర్వతోముఖమైన జాతీయాభివృద్ధి, కార్మికుల శ్రేయస్సు, సమానత సాధన, సోషలిస్టు సమాజ స్థాపన, మానవతా దృక్పథం, హేతువాదం, సాంఘిక ప్రయోజనం గల కళల అభివృద్ధి, సాంఘిక సామరస్యం, జీవకారుణ్యం – మొదలైనయి అరసం ఆశయాలు. ఆ ఆశయాలు బాగానే వున్నాయి కాని మహత్తరమైన మరో వ్యవస్థను ఏర్పరిచేయి కావని సాయుధ పోరాటమే మరో ప్రపంచానికి చేరుస్తుందని విరసం ప్రకటించింది.

పార్లమెంటు లాంటి సంస్థలు బూర్జువా వ్యవస్థను నిలబెట్టే మాయోపకరణాలని దాన్ని కూలదోస్తేనే మార్పు వస్తుందని విరసం వాళ్ళంటారు. అందుచేత వాళ్ళు బాహాటంగా విప్లవాన్ని తమ లక్ష్యంగా ప్రకటించారు. సాహిత్యం కూడా విప్లవాన్ని చిత్రించాలని విప్లవానికి తోడ్పడాలని వాళ్ళంటారు. సాహిత్యం జీవితాన్ని నిర్వచించేది కాక అస్తవ్యవస్తమైన జీవితాలను సమాజాన్ని మార్చేదిగా వుండాలని అరసం ఆశయం. అరసం కాలంతో పాటు నడువలేక వెనుకబడిపోయిందని అరసం వాళ్ళకు సోషలిస్టు భావస్పర్శలేదని విరసం ఆరోపణ. అరసం పాలక వర్గాన్ని ఎదుర్కోలేదు. స్వాతంత్ర్య పోరాటం తెలంగాణా విమోచనోద్యమం కాలంలో అభ్యుదయ రచయితలు ఉచ్ఛస్థితిలో వున్నారు. 1952 ఎన్నికల్లో కమ్యూనిస్టు పార్టీ గెలుపు అరసంకు గౌరవ ప్రతిష్టలను తెచ్చింది. అదే 1957 నాటి ఎన్నికల్లో పార్టీ ఓటమితో అరసం క్షీణదశ ఆరంభమైందని చెప్పాలి. అభ్యుదయ రచయితలు సినిమాల నాశ్రయించడంతో అరసం నిర్వీర్యమైంది. 1970 వరకు అభ్యుదయత్వం, మానవతావాదం, దిగంబర కవిత్వం రూపాలతో కొనసాగింది. 1970లో విరసం శ్రీశ్రీ అధ్యక్షతలో అవతరించింది. విప్లవ కవి మాకారాధ్యుడు అన్నాడు శ్రీశ్రీ. కాబట్టి విరసంకు కూడా యుగ ఆరంభకుడు, యుగ నాయకుడు, యుగకర్త శ్రీశ్రీయే అయినాడు.

1943లో ఆంధ్రదేశంలో అరసం ఏర్పడినప్పుడు అందులోని కవులకు, రచయితలకు మార్క్సిస్టు అవగాహన, నిర్మాణ క్రమం, కార్యాచరణ లేదనిఅవగాహన

చైతన్య దృక్పథం లేకుండానే ఎంతోమంది అరసంలోకి రావడం జరిగిందని అరసం పేరులోనే అభ్యుదయం వుంది కాని పీడిత వర్గ దృక్పథం లేదని అట్టడుగు వర్గాన్ని అంతగా పట్టించుకోలేదని అరసం విమర్శకు గురయింది. మధ్యతరగతి దృక్పథం అరసంలో బాగా చోటు చేసుకుందని చైతన్యం భౌతిక శక్తిగా మారి ఆచరణ రూపాన్ని అరసం పొందలేదని విరసం విమర్శించింది. 1970లో విరసం విశాఖపట్టణంలో జరిగిన శ్రీశ్రీ షష్టిపూర్తి సభలో విశాఖ విద్యార్థులు 'రచయితలకు సవాల్' పేరుతో పంచిన కరపత్రంతో పుట్టిందని చెప్పాలి. "శ్రీకాకుళ విప్లవ పోరాటంలో వీరమరణం చెందిన సుబ్బారావు పాణిగ్రాహిలా సాహిత్యం జీవితాన్ని మార్చే శక్తిగా మీరెందుకు చెయ్యలేదు" అని ఆ కరపత్రం రచయితలను ప్రశ్నించింది. ఆ కరపత్రం సాహితీవేత్తల్లో ఒక పెద్ద సంచలాన్ని సృష్టించింది. శాంతితో మరో ప్రపంచాన్ని సృష్టించలేము. సాయుధపోరాటం కొత్త వ్యవస్థను సృష్టిస్తుందని కరపత్రం చాటింది. దాంతో శ్రీశ్రీ అరసం సభను బహిష్కరించి విరసంకు 1970 జులై 4వ తేదీనాడు శ్రీకారం చుట్టాడు. విప్లవ కవులకు నాయకుడయ్యాడు.

1970 జులై 4, 5 తేదీల్లో అభ్యుదయ సాహిత్య సదస్సు నిర్వహించడానికి నిర్ణయమైంది. అదే విరసం ఆవిర్భావానికి ముహూర్తమైంది. విరసంలో కొకు, రావిశాస్త్రి, కారా, కె.వి.ఆర్. మొ॥ వాళ్ళు చేరారు. సాహితీ మిత్రులు నడిపే 'సృజన' పత్రిక విరసం వాణిగా మారింది. ప్రభంజనం, అరుణతార, జీవనాడి, పిలుపు, విద్యుల్లత వంటి పత్రికలు విరసంకు ప్రచార సాధనాలు అయ్యాయి. జన నాట్యమండలి, అరుణోదయ వంటి సంస్థలు అండగా నిలిచాయి. 1970 అక్టోబర్‌లో విరసం మొదటి మహాసభలు ఖమ్మంలో జరిగాయి. 1996 జనవరిలో విరసం నాల్గవ మహాసభలు హైద్రాబాదులో జరిగాయి. దళితవాదులు, స్త్రీవాదులు సక్రియులై పాల్గొనలేదు. "సాహిత్యం ఒక ఆయుధ విశేషం. సమగ్రమైన మానవ స్వాతంత్ర్యం వైపే విప్లవ సాహిత్యం జరిపే మహాప్రసస్థానం" అని ప్రథమ మహాసభల్లో విరసం తన పంథాను చాటింది శ్రీశ్రీ సాయుధ పోరాటాన్ని సమర్థిస్తూ విరసంకు అధ్యక్షుడయ్యాడు. "సాయుధ విప్లవ బీభత్సుని సారథినై భారత కురుక్షేత్రంలో నవయుగ భగవద్గీతా ఝుంఝుని ప్రసరిస్తాను" అని శ్రీశ్రీ తన దీక్షను ప్రకటించి విప్లవ సాహిత్య యుగకర్త అయ్యాడు.

విరసం కవులకు రచయితలకు మార్క్సిజం-లెనినిజం ఆదర్శం. మావో ఆలోచనా విధానం ఆచరణీయం. చైనాలో మావో 'లాంగ్‌మార్చ్' పేరుతో నడిపిన విప్లవ పోరాటం వీళ్ళకు ధ్యేయమైంది. మావో నడిపిన 'లాంగ్‌మార్చ్' లాగానే భారతదేశంలో విప్లవం దీర్ఘకాలికమైన సాయుధ పోరాటం వల్ల సిద్ధిస్తుందని వీళ్ళ నమ్మకం. ఎన్నికలు, సంస్కరణల వల్ల మరో ప్రపంచం రాదని వీళ్ళ విశ్వాసం. దోపిడి నుంచి విముక్తిని కలిగించే మార్గం విప్లవ మార్గమని వీళ్ళు నమ్ముతారు. ఏ తిరుగుబాటునైనా సమర్థిస్తారు. క్యూబాలో ఫిడెల్ కాస్ట్రో నాయకత్వంలో విప్లవ పోరాటం విజయవంతం కావడం వీళ్ళకు ధైర్యానిచ్చింది. అర్జంటీనాలోని గెరిల్లా పోరాటం వీళ్ళకు ఆవేశాన్నిచ్చింది. జాతీయ సమస్యలకన్నా అంతర్జాతీయ ఆదర్శాల మీద వీళ్ళకు దృష్టి ఎక్కువ.

1950 దశకంలో మానవ హక్కుల ప్రకటన నెహ్రూ పంచవర్ష ప్రణాళికలు పంచశీలల మీద నమ్మకం పెట్టుకున్న కవులు విప్లవ రచయితలకు నిస్తబ్ధతగా కన్పించాయి. శాంతికాముకత యుద్ధ విముఖతలను వీళ్ళు తిరోగమనంగా భావించారు. భావకవులు ప్రేమ, సౌందర్యం, గోపికా అన్వేషణ, గోపికా విరహం, గడ్డిపోచ అందాలను వస్తువుగా చేసుకున్నారు. ఇక అభ్యున్నతి సమానతలను అభ్యుదయ కవులు కాంక్షించినా రావలసిన చైతన్యాన్ని వాళ్ళు తేలేకపోయారు. భావ కవిత్వం కవుల మత్తు వదిలింది. అభ్యుదయ కవులు రెండో దశలో మధ్యతరగతి మీద సానుభూతి చూపుతూ కవిత్వం వ్రాసారు. అట్టడుగు వర్గాలను వాళ్ళను వదిలేసారు. విప్లవం సాయుధ పోరాటం రక్తపాతం-ఇవే దోపిడీని పీడనను దౌర్జన్యాన్ని బానిసత్వాన్ని అసమానతలను నశిపంజేస్తాయని విప్లవ రచయితలు విశ్వసించారు. విప్లవ కవిత్వానికి ఆద్యులుగా చెప్పదగిన వాళ్ళు సుబ్బారావు, పాణిగ్రాహి, వెంపటావు సత్యం. వాళ్లు విప్లవాన్ని ప్రబోధిస్తూ పాటలు వ్రాసారు. ఆ తర్వాత శివసాగర్, చెరబండరాజు, గద్దర్, వంగపండు ప్రసాదరావు, నగ్నముని, జ్వాలాముఖి, కె.శివారెడ్డి, వరవరరావు, నిఖిలేశ్వర్, విప్లవకవులు వ్రాసిన పాటలు పల్లెపల్లెలకు వ్యాపించాయి. సుబ్బారావు పాణిగ్రాహి 'కష్టజీవులం మేము కమ్యూనిస్టులం ఔనన్నా కాదన్నా అదే ఇష్టులం' అని వ్రాసిన 'మార్చింగ్ సాంగ్' చాలా ప్రచారాన్ని అందుకుంది. విప్లవ సిద్ధాంతాలను, ఆశయాలను పాణిగ్రాహి సరళమైన మాటల్లో పాటగా వ్రాసాడు. శివుడు, శివసాగర్,

రెంజిమ్ మొదలయిన పేర్లతో కె.జి.సత్యమూర్తి కవిత్వం వ్రాసాడు. జానపద రీతుల్లో ఆయన పాటలు వ్రాసి విప్లవ భావాలను ప్రచారం చేసాడు. ఆయన కూడా పాణిగ్రాహి లాగానే స్వయంగా గిరిజన పోరాటంలో పాల్గొన్న కవి. 'నా చెల్లీ చెంద్రమ్మ, తోట రాముడు, ఏటి కెదురీదు వాళ్ళమురా' మొదలయిన ఆ కవి పాటలు ప్రసిద్ధమైనాయి. "నగ్రెంకచెట్టు కింద నరుడో భాస్కరుడా" అనే శివసాగర్ పాటతో విప్లవ గేయాలకు శ్రీకారం చుట్టబడిందంటారు. ఈ పాటను శివసాగర్ విప్లవ వీరుడు చాగంటి భాస్కర్ మీద వ్రాసాడు. శివసాగర్ కవితలు "ఉద్యమం నెలబాలుడు, నెలవంక" పేర్లతో సంపుటాలుగా వచ్చాయి.

విప్లవ కవుల మొదటి కవితా సంకలనం 'ఝంఝ' విరసం మొదటి మహాసభల నాటికే వచ్చింది. ఇది శ్రీకాకుళ గిరిజనోద్యమంలో మరణించిన సుబ్బారావు పాణిగ్రాహి స్మృతికి అంకితమియ్యబడింది. దీనిలో శ్రీకాకుళం సాయుధ పోరాటంలో మరణించిన నక్సలైట్ నాయకుల మీద వ్రాసిన స్మృతి గేయాలు వున్నాయి. ఆ తర్వాత 'మార్చ్, లే' అనే కవితా సంపుటాలు వెలువడినాయి. వాటిని ప్రభుత్వం దేశద్రోహకరమని నిషేధించింది. దానిలోని కవితలు యువకులను విప్లవ కవిత్వంవైపు ఆకర్షింప చేసాయి. అన్యాయాలను ఎదిరిస్తూ సాయుధ పోరాటాన్ని సమర్థిస్తూ యువకులు ఆవేశంతో కూడిన కవితలు వ్రాసారు.

విరసంకు అధ్యక్షత వహించిన తర్వాత శ్రీశ్రీ జట్కావాలా, భూమ్యాకాశాలు, తుది పయనం, తొలి విజయం మొదలయిన విప్లవ గీతాలు రచించాడు. "తెల్లవాడు నిన్ను నాడు భగత్సింగు అన్నాడు. నల్లవాడు నువ్వు నేడు నక్సలైటువన్నాడు. ఎల్లవారు నిన్ను రేపు వేగుజుక్క అంటారు" అని శ్రీశ్రీ 'ఊగరా ఊగరా ఉరికొయ్య అందుకొని ఊగరా' అనే గేయంలో అన్నాడు. చెరబండరాజు 'దిక్సూచి, ముట్టడి, గమ్యం, పల్లవి,ఊరుమేలుకుంది, గౌరమ్మ కలలు, శాంతియుద్ధం' మొదలయిన కవితా సంపుటాలు రచించాడు. చెరబండరాజు వలెనే దిగంబర కవుల్లో ఒకడైన నగ్నముని 'తూర్పుగాలి, కొయ్యగుర్రం' కావ్యాలను ప్రచురించాడు. ప్రభుత్వ వ్యవస్థ కొయ్యగుర్రం వంటిదని చెప్తూ నగ్నముని 'కొయ్యగుర్రం' కావ్యాన్ని రచించాడు. కొయ్యగుర్రం

ఆధునిక 'మహాకావ్య'మని పీఠికలో చేకూరి రామారావు (చేరా) అన్నాడు. గద్దరు 'రాజకీయ వీధి భాగోతం' ప్రచారం పొందిన రూపకం. తెలంగాణా మాండలికంలో అయన వ్రాసిన పాటలు ప్రజల్లో వ్యాపించాయి. అభినయంతో, గొంగడి, గజ్జెల వేషంతో ఆయన పాడే పాటలు ప్రజలను బాగా ఆకర్షించాయి. ఉత్తేజ పరిచాయి. గద్దరు ఆధ్వర్యంలోని జననాట్యమండలి రాష్ట్రమంతటా పర్యటించి అనేక ప్రదర్శనలిచ్చింది. డప్పు రమేశ్ డప్పు పాటలు ప్రచారాన్నందుకున్నాయి. విప్లవం పాటల్లో డప్పు, చిందులు ప్రాధాన్యం వహించాయి. విప్లవ భావాలతో కె.శివారెడ్డి 'రక్తం, సూర్యుడు, ఆసుపత్రి గీతం' మొదలయిన కవితా సంపుటాలు ప్రచురించాడు. వరవరరావు తిరుగబడు కవుల్లో ఒకడుగా వుండి విరసంలో చేరి జైలు కెళ్ళాడు. "శిశి రోషస్సు, జీవనాడి, స్వేచ్ఛ' కావ్య సంపుటాలుగా అతని కవితలు వచ్చాయి. వరవరరావు 'సృజన'కు సంపాదకుడుగా పని చేసాడు.

విరసం కవులతో గేయం పాడుకోడానికి వీలైన పాటగా ప్రచారంలోకి వచ్చింది. తెలంగాణ విమోచనోద్యమంలోను పాట ప్రముఖ పాత్ర వహించింది కదా! తమ భావాలు సిద్ధాంతాలు ప్రజల వరకు చేరాలంటే సరళమైన భాష, పాట అనువైనవని తెలంగాణ ఉద్యమ కవులు వలెనే విప్లవ కవులు గుర్తించి ఆ విధంగానే వ్రాసారు. ప్రాచీన శివకవులు కూడా ఇదే విధంగా తమ మత ప్రచారానికి జానుతెనుగును, ద్విపదలను చేపట్టారు. ఎంతోమంది భక్తి తత్త్వ కవులు తమ భావాలను ప్రజలకు చెప్పడానికి గేయాలను, పాటలను మాధ్యమంగా తీసుకున్నారు. ఆ మార్గంలోనే విరసం కవులు పాటను తూటాలాగా మార్చుకొని వ్రాసారు. స్వాతంత్ర్య పోరాటం సమయంలో తెలంగాణా పోరాట కాలంలో చాలా వరకు పాట ప్రధాన పాత్ర వహించింది. ఉద్యమాలతో పుట్టి పెరిగిన పాట నక్సల్బరీ ఉద్యమం కాలంలో బాగా ఆదరణను సంపాదించుకుంది. విప్లవ కవులు మాత్రా ఛందస్సులనుగాని వచన కవిత్వాన్ని గాని వాడలేదు. అభ్యుదయ కవులు గేయాన్ని, పాటలను ప్రయోగించారు. విప్లవ కవులు పాడుకోడానికి వీలైన జానపదుల బాణీల్లో వుండే పాటను గేయాన్ని ప్రయోగించారు. సుబ్బారావు పాణిగ్రాహి, వంగపండు, గద్దరు

వంటి కవుల పాటలు జానపదుల బాణీలో భాషలో వుండి అతి ప్రచారాన్నందుకున్నాయి. గద్దరు శ్రీకాకుళం నుంచి ఉత్తర తెలంగాణం వరకు పయనించి పాటలు వ్రాసాడు. వ్రాయడమే కాక అతనికి మంచిగా పాడే గొంతు వుంది. జానపదుల బాణీలో పాడే అతని పాటలను చాలామంది అనుకరించారు కూడా. శ్రీశ్రీ, రారా, కెవిఆర్ తర్వాత వరవరరావు, మార్క్సిస్టు విమర్శకునిగా పేరొందారు.

విప్లవోద్యమం ప్రభావంతో పులుగు శ్రీనివాస్ 'అన్నలు, అడవితల్లి' నవలలు రచించాడు. 'శ్వేతరాత్రులు, రుతుపవనాలు' పేరుతో విప్లవ కథల సంకలనాలు ఉత్తర తెలంగాణా నుంచి వచ్చాయి. అల్లం రాజయ్య, సాహూలు రచించిన 'కొమరం భీము' నవల గోండు జనుల ఉద్యమాన్ని చిత్రిస్తున్నది. అల్లం రాజయ్య "కొలిమి అంటుకుంది, ఊరు, భూమి, అగ్ని, కణం, వసంత గీతం" వసంతరావు దేశపాండే 'అడవి', సాధన 'సరిహద్దు', ఉద్యమస్ఫూర్తితో వ్రాసిన నవలలు. చెరబండరాజు 'నిప్పురాళ్ళు, మాపల్లె, ప్రస్థానం దారిపొడుగునా' విప్లవ నవలలు ఇంకా అనేక విప్లవ కథలు వ్రాసాడు. పి.చంద్ 'శేషగిరి', 'మహేంద్ర' నవలలను సింగరేణి కార్మికోద్యమాలను చిత్రిస్తూ వ్రాసాడు. కథలు కూడా వ్రాసాడు. సాహు విప్లవ వీరుడే కాక కథలు పాటలు వ్యాసాలు ఆదివాసుల పోరాటాలను గురించి వ్రాసాడు. తెలంగాణ నుంచి అల్లం రాజయ్య, తుమ్మేటి రఘోత్తమరెడ్డి, విప్లవ కథలు వ్రాసారు. బి.ఎస్.రాములు, వుప్పల నరసింహం, బోయ జంగయ్య, కాలువ మల్లయ్య కథలు కొన్ని విప్లవ చైతన్యాన్ని, పేదరికాన్ని, భూస్వాముల అధికారుల దౌర్జన్యాలను, అన్యాయాలను, దోపిడిలను చిత్రిస్తున్నాయి. సృజనాత్మక ప్రక్రియలన్నిటిలోను విప్లవ ఉద్యమ చైతన్యం విశ్లేషించబడింది. ప్రబోధింపబడింది. విప్లవ రచయితల వ్యాసాలు, సాహిత్య విమర్శలు భావతీవ్రతతో తెలుగు నుడికారంతో చక్కని వచన శైలి వికాసానికి దోహదం చేసాయి. తెలంగాణా, ఉత్తరాంధ్ర నుంచే విప్లవ సాహిత్యం బాగా వచ్చిందని చెప్పాలి. ఇక్కడి రచయితలు వాళ్ళ వాళ్ళ మాండలికాలను ప్రయోగించి బలమైన రచనలు చేసారు. దౌర్జన్యాలను తమ సాహిత్యంలో చిత్రించి ప్రజాస్వామ్యంలో చైతన్యం

తేవాలని చూసారు.

*"ఈ దొంగల రాజ్యాంగం / రచనే ఒక కుట్ర అనీ*
*శ్రమ జీవుల శ్వాసలతో / పాడుతాం పాడుతాం"*

అంటాడు చెరబండరాజు. 'సోషలిజం సామ్రాజ్యవాదం ముద్దు పేరని, ఆగస్టు 15 రాకపోతే, మాకు అర్థమయ్యేది కాదు' అంటారు వరవరరావు.

*"పాపాలకు మేలి ముసుగు/ పార్లమెంటు అసెంబ్లీలు*
*మోసానికి మారు పేరు/ దగా కోరు ఎలక్షన్లు"*

అని విప్లవ కవుల అభిప్రాయం. మతంలోని కర్మ సిద్ధాంతం పూర్వజన్మలు వర్ణాశ్రమ ధర్మాల పేరుతో భూస్వాముల దోపిడీని కొనసాగించారు. దున్నేవాడిదే భూమి కావాలి.

*"విద్రోహుల మట్టు పెట్టి రైఫిళ్ళను చేతబట్టి,*
*ఎర్రసేన నిర్మించదగ్గ ఎర్ర ప్రాంతమేర్పరచగ*
*అన్నలతో చేయి కలిపి నేల తల్లి చెరను విడిపించగ*
*రావాలోయో తమ్ముడా జాగేలోయ్ తమ్ముడా?"*

అని శివసాగర్ పోరాటానికి ఉత్తేజాన్ని కలిగిస్తూ పిలుపునిచ్చాడు. విప్లవ పోరాటంలో మరణించిన విప్లవ వీరుల సంస్మరణ కవిత్వాన్ని పోరాటం ఉద్దీప్తి కోసం విప్లవ కవులు చాలా వ్రాసారు. కమ్యూనిస్టు పార్టీలో ప్రవేశించిన రివిజనిజమే తెలంగాణా సాయుధ రైతాంగ పోరాటం విరమణకు కారణమని విరసం భావించింది. అందుకే విరసం కవులు రివిజనిజంను నిందించారు.

*జడత్వం జరీ అంచుచీర కట్టినవారు*
*ఆయుధం చేపట్టలేరు*
*విప్లవాన్ని ముస్తాబు చేసి*
*ఎన్నికల దొమ్మరి సంతలో అమ్ముకోనేర్చిన బేహారులు, బారికేడ్లు కట్టలేరు'*

అంటాడు శివసాగర్. రష్యాలో రివిజనిజం ఏర్పడిన ప్రమాదాన్ని గుర్తించి మావో చైనాలో సాంస్కృతిక విప్లవానికి పిలుపునిచ్చాడు. రష్యా సోషలిస్టు సామ్రాజ్యవాదంగా పరిణమించినప్పుడు చైనా ప్రపంచ విప్లవ కేంద్రంగా ఉత్తేజాన్నిచ్చింది.

*'ఓల్గా ఘనీభవించెను/ యాంగ్సీనది పొంగెను'* అని శివసాగర్ దీన్ని దృష్టిలో పెట్టుకునే అన్నాడు.

'అదనపు విలువల దొంగలు రాజ్య భవిష్యత్తును నిర్ణయించారు. మానవ జాతి భవితవ్యం సమస్తం, పిడికెడు మంది చేతుల్లో చిక్కిపోయింది...' అంటాడు విప్లవ కవి.

*దిక్కుమొక్కులేని జనం/ ఒక్కొక్కరు అగ్ని కణం*
*సింహకంఠనాదంతో/ వస్తారిక కాచుకొండి*

అని విప్లవ కవి శంఖారావం చేసాడు.

1996 జనవరిలో విరసం తన నాల్గవ మహాసభలు జరుపుకున్నారు. 1980 దశకంలో రష్యాలో వచ్చిన మార్పులు 'రష్యాలో ప్రకటించబడిన 'పెరస్త్రోయికా'. రష్యా సోషలిస్టు సామ్రాజ్యవాదానికి దోపిడీకి వ్యతిరేకంగా తూర్పు యూరపు దేశాల్లో ఉద్యమాలు లేవడంతో మార్క్సిస్టు మూల సిద్ధాంతాలనే ప్రశ్నించడం జరిగింది. పార్టీ పేరుతో నియంతృత్వాన్ని నడపడం సవాలు చేయబడింది. జాతి భేదాలతో తూర్పు యూరపు దేశాలు చిన్న చిన్న దేశాలుగా విడిపోయాయి. మళ్ళీ జాతి భాషాభిమానాలు పడగలు విప్పాయి. పోలెండు మొదలయిన దేశాలెన్నో పెట్టుబడిదారీ విధానం ఫ్రీ మార్కెటు వైపు మళ్ళాయి. జర్మనీ ఏకీకరణంతో జాతీయవాదం ప్రబలింది. 1989లో బెర్లిన్ గోడ పగలకొట్టడం మార్క్సిజం కూల్చివేతకు ప్రతీకగా నిలిచింది. ఆ తర్వాత చైనాలో మావో మరణం నక్సలైటు ఉద్యమానికి గొడ్డలిపెట్టు అయింది. చైనా పెట్టుబడిదారీ విధానం ఫ్రీ మార్కెటు వైపు మళ్ళింది. 1989లో బీజింగులోని తియానమెన్ స్క్వయర్‌లో చైనా ప్రభుత్వం ప్రజాస్వామ్యాన్ని స్వేచ్ఛను అర్థించే విద్యార్థుల

హత్యాకాండను జరిపి స్వేచ్ఛ ప్రజాస్వామ్యాల గొంతు నులపడానికి ప్రయత్నించినా ఆర్థిక విధానాల్లో చైనా మార్క్సిస్టు దృక్పథం నుంచి దూరమవుతుందనటం ఎంతవరకు నిజమో చెప్పలేము.

## నానీలు

### *ఒక వినూత్న పద్య ప్రయోగం*

"సగటు శ్రోతకు హైకూల వల్ల కదలిక కనిపించ"దంటాడు కవి ఎన్.గోపి. 1990 దశకం ఉత్తరార్థంలో తెలుగులో "నానీ" అనే కవితా ప్రక్రియ జోరందుకుంది. ఉర్దూలో "నన్హే" అంటే చిన్నది అని అర్థం. నన్హే పదం నుంచి నానీ వచ్చిందని ఎండ్లూరి సుధాకర్ అంటాడు. చిన్న పిల్లల్ని నానీ అంటాం తెలుగులో. ఎన్.గోపీ నిజ ఆవేదన దుఃఖం నుంచే "నానీ"లనే మినీ కవితలు గోరుముద్దల్లాగ బయలు దేరాయి. నానీ పదంలో 'నా', 'నీ' అనే అక్షరాలు నా ఆవేదన, నీ ఆవేదన అని అర్థం కూడా వస్తుంది. గోపి సృష్టించిన నానీ కవితా రూపాన్ని ఎందరో యువకవులు అనుసరిస్తూ కవితలు వ్రాసారు. కొండను అద్దంలో చూపినట్లుగా గొప్ప అర్థాన్ని నానీలో సంక్షిప్తంగా 20 నుంచి 24 అక్షరాల్లో నాలుగు చిన్న పాదాల్లో చెప్పటమే "నానీ". గోపి నానీలలో సూటిదనం వుండటం వ్యర్థ పదం లేకపోవటం వంటి వేమన పద్యాల శిల్ప ప్రభావం కన్పిస్తున్నది. వచన కవితలో పాద నియమం ఉండదు. కానీ 'నానీ'ల్లో నాలుగు మినీ పాదాలుంటాయి. రెండేసి పాదాలకో భావాంశం ఉంటుంది. మొదటి దానికి రెండోది సమర్థకంగా ఉంటుంది. ఉదా:-

*కుండ ముక్కలైందా / కుమిలిపోకు*
*మట్టి మరో రూపం కోసం/ సిద్ధమౌతుంది*

అంటాడు గోపి. వేమన పద్యాల మీద పరిశోధన చేసిన గోపి తనకు వేమన ఆటవెలది కవిత్వమే నానీలకు ప్రేరణనిచ్చింది అంటాడు. అంబల్ల జనార్దన్, కోట్ల వెంకటేశ్వరరెడ్డి, ఎస్.రఘు, ఎస్.ఆర్.భల్లం, శిరీష, అనిశెట్టి రజిత, నల్లా నరసింహమూర్తి, నారాయణ శర్మ, త్రివేణి, అన్నవరం దేవేందర్‌లు నానీలు వ్రాసారు. తెలంగాణలో ఆరంభమైన నానీల ప్రక్రియ ఆంధ్రదేశమంతటా కవులునాకర్షించింది.

వందల సంఖ్యలో నానీల కవితా సంపుటాలు వచ్చాయి. వస్తున్నాయి.

అసలు నానీలు వ్రాయని కవులే లేరేమో! ఆంధ్రప్రాంతాల నుంచి కూడా చాలా మంది కొంచెం కవిత్వం చెప్పగలవారు సైతం నానీలు వ్రాసి పుస్తకాలుగా ప్రచురించారు.

*ఆన్‌లైన్‌లో/ శ్రీహరి దర్శనం*

*మత శాస్త్రం/ ముడిపడటమంటే ఇదేనా* – అంటాడు ఎస్.రఘు

నానీల్లో గాంభీర్యం, జీవిత వ్యాఖ్యానం, సమకాలీనత, విసుర్లు, వ్యంగ్యాలు, హాస్యం, తాత్త్వికతలుంటాయి.

## దళితవాదం

సంఘ సంస్కరణోద్యమాల కాలంలో కులభేదం నిరసించబడింది. కులభేదాన్ని నిరసించే బ్రహ్మ సమాజం ఆర్య సమాజం వంటి మత సంప్రదాయాలు వచ్చాయి. గాంధీజీ జాతీయోద్యమంతో పాటు జాతి వివక్షతను ముఖ్యంగా అస్పృశ్యతను నిరసించి హరిజనోద్ధరణ కార్యక్రమాలను చేపట్టాడు. అస్పృశ్యులుగా పంచములుగా నీచంగా చూడబడ్తూ పల్లెలకు దూరంగా నివసిస్తూ వుండే జనులను గాంధీజీ హరిజనులని పిలిచాడు. హరిజోద్ధరణోద్యమాన్ని గాంధీజీ నడిపాడు. గాంధీజీ సిద్ధాంతాలు నమ్మిన వాళ్ళు హరిజనోద్ధరణను చేపట్టారు. ఆంధ్రదేశంలో 12వ శతాబ్దంలో బ్రహ్మనాయుడు అన్ని కులాలు కలిసి భోజనం చేసే 'చాపకూడు'ను నడిపాడు. అదే పద్ధతిలో 1910లో ఆంధ్రపదేశ్ తెనాలిలో చాపకూడు జరిగి సంచలనాన్ని సృష్టించింది. ఉన్నవ గాంధీజీ సిద్ధాంతాల కనుగుణంగా హరిజనుల సమానతను ప్రబోధించాడు. జాషువా గబ్బిలం వంటి ఖండకావ్యాల్లో పంచముల దురవస్థను చిత్రించి సమానతను ప్రబోధించాడు. హైద్రాబాదులో భాగ్యరెడ్డివర్మ దళితోద్యమం నడిపాడు. 'భాగ్యనగర్' పత్రిక పెట్టి తన సంస్కరణ భావాలను ప్రచారం చేసాడు. స్వాతంత్ర్యానికి పూర్వం వచ్చిన పై ఉద్యమాలు కొంత పరిస్థితిని

మెరుగుపరిచాయి. కాని దేశాభివృద్ధి ఆర్థికాభ్యున్నతి కుంటుపడినట్లులాగానే దేశ జనాభాలో చాలా భాగమైన దళితుల పరిస్థితి కుంటుపడింది.

## తెలంగాణలో దళితోద్యమం

తెలంగాణలో దళితోద్యమం మహారాష్ట్రలో అంబేద్కరు, జాతీయోద్యమ కాలంలో గాంధీజీలు కొనసాగించటానికి పూర్వమే ఆరంభమైంది. తెలంగాణ నుంచి దళితులెందరో మిలటరీలో చేరారు. మిలటరీలో వున్నప్పుడు బ్రిటిషు వాళ్ళను చూసినంక వాళ్ళ జీవన పరిచయంతో వాళ్ళల్లో ఒక చైతన్యం వచ్చింది. తెలంగాణలో దళితుల్లో చైతన్యం నింపిన వాళ్ళల్లో భాగ్యరెడ్డి వర్మ, అరిగె రామస్వామి, ముత్తయ్య, శ్యాంసుందర్ టి.వి. నారాయణ, లక్ష్మయ్య, బాబయ్య, వెంకటస్వామి, సుబేదారు సాయన్న, పేసరి వీరన్న వంటి వాళ్ళెందరో వున్నారు. వాళ్ళు వివిధ సంస్థలు పెట్టి దళితోద్ధరణకు కృషి చేసారు.

భాగ్యరెడ్డివర్మ దళితోద్ధరణకు కృషి చేసి 1917లో సరోజినీ నాయుడు, గాంధీజీల ప్రశంసలను పొందాడు. దళితులు దేశ మూలవాసులు. ఆది హిందువులు అని అన్నాడు భాగ్యరెడ్డి వర్మ. 1906లోనే ఆయన “జగన్ మిత్రమండలి’ని స్థాపించాడు. అంటరాని కులాల్లో ఆత్మగౌరవం పెరిగి న్యూనతా భావం పోవాలంటే విద్య అవసరమని గుర్తించాడు. పేర్ల చివర ‘గాడు’ వుండకూడదన్నాడు. భాగ్యరెడ్డి వర్మ 1910లో ఇసామియ బజారులో, లింగంపల్లిలో ప్రాథమిక పాఠశాలలను స్థాపించాడు. క్రమంగా 26 స్కూళ్ళను పెట్టాడు. 1914 నుంచి భాగ్యరెడ్డివర్మ ఆర్యసమాజం చేత ప్రభావితుడై చాలా మంది దళితులు ఆర్య సమాజంలో చేరడానికి ప్రేరేపించాడు. అంటరాని వాళ్ళకు వేదపఠనమా అని అన్నారని దాన్ని నిరాకరించాడు. తర్వాత బ్రహ్మ సమాజంలోను చేరాడు. అక్కడకూడా అంటరాని వాళ్ళంటే వివక్ష కన్పించటంతో దాన్నీ వదిలాడు.

1917లో విజయవాడలో జరిగిన మొదటి పంచమ సభలో పాల్గొని భాగ్యరెడ్డి వర్మ “పంచమ” పదాన్ని విమర్శించాడు. వాళ్ళను ఆది ఆంధ్రులని అనాలన్నాడు. 1917లో కలకత్తాలో దివ్య విజ్ఞాన సదస్సులో గాంధీజీని కలిసి అంటరాని వాళ్ళ

బాధలను గురించి చర్చించాడు. బి.ఎస్.వెంకట్రావ్ పూనేలో వుండి ఫూలే భావాల చేత ప్రభావితుడైనాడు. హైద్రాబాదులో 1922లో "ద్రావిడ సంఘాన్ని"స్థాపించాడు. 1925లో భాగ్యరెడ్డి వర్మ అనంతపురంలో ఆది ఆంధ్ర సభకు అధ్యక్షత వహించి ఆర్య దేవతలను అంటరాని వాళ్ళు పూజించటం సరికాదన్నాడు. వాళ్ళ కోసం ఉచిత సంక్షేమ హాస్టళ్ళను నిర్మించాలన్నాడు. సుబేదారు సాయన్న (మాదిగ) 1925లో పెట్టిన ఆది హిందు బస్తీలో భాగ్యరెడ్డివర్మ అనేక సభలు పెట్టాడు. వాళ్ళ హక్కుల గురించి మాట్లాడాడు. జిల్లాల్లోను తిరిగి బాలయ్య మాల మాదిగలను చైతన్యపరిచాడు. 1927 వెంకట్రావు కృషితో ఆది హిందూ సభ ఏర్పడింది. 1931లో ఆంధ్ర మహాసభతో పాటు ఆది హిందువుల సభ జరిగింది. ఆ సభలో అస్పృశ్యత, వెట్టిచాకిరి నిర్మూలన, సర్వమానవ స్వాతంత్ర్యం, నిర్బంధ ఉచిత విద్య, దేవాలయ ప్రవేశం. బావులల్లో నీళ్ళు చేదుకునే హక్కు ఉండాలని తీర్మానాలు చేసారు. 1936లో వెంకట్రావ్ సికింద్రాబాదులో "అంబేద్కరు యూత్ లీగ్" పెట్టాడు. భాగ్యరెడ్డి వర్మ ఆది హిందువులకు ప్రత్యేక నియోజకవర్గాలను కేటాయించాలని తీర్మానం చేసాడు. యూరోపు పోయి వచ్చిన తక్కెళ్ళ వెంకయ్య హైద్రాబాదులో దళితుల పక్షం వహించి పోరాడాడు. ఐక్యరాజ్యసమితిలో నిజాం ప్రతినిధిగా వున్న శ్యామ్‌సుందర్ 'ది బర్న్' పుస్తకంలో ఆనాటి హైద్రాబాదు సంస్థానంలోని దళితుల స్థితిగతులను గురించి వ్రాసాడు. దళితులతో పాటు తెలంగాణలో ఇతర కులాల వారి చైతన్య సభలు జరిగాయి. విద్యార్జన జరగాలని హాస్టళ్ళ ఏర్పాటు జరిగాయి. ఆ విధంగానే 1918లో రాజబహద్దరు వెంకట రామారెడ్డి 'రెడ్డి హాస్టలు' ఆరంభించాడు. అదే విధంగా వెలమ, వైశ్య, పద్మశాలి, మున్నూరు కాపు, సుతారి, గౌడ హాస్టళ్ళు ప్రారంభమయ్యాయి. శ్యాంసుందర్ కళావంతుల సంస్కరణల కోసం కృషి చేసాడు. అదే విధంగా యాదవ, ముదిరాజు సాతానుల, నాయీ బ్రాహ్మణుల, విశ్వకర్మ, కుమ్మరి, సగర, విశ్వబ్రాహ్మణ మొదలైన కులాల సభలు జరిగాయి. వాళ్ళల్లో చైతన్యం రావాలని ప్రయత్నాలు జరిగాయి. మరోవైపు మహిళల్లో చైతన్యం తేవటానికి ఆంధ్రమహాసభలు కృషి చేస్తూనే ఉన్నాయి. ఈ విధంగా తెలంగాణలో కుల సంఘాలు తెలంగాణ పునరుజ్జీవనోద్యమంలో భాగస్వాములయ్యాయి. దళితోద్యమం ఇతర కులాల్లోనూ

చైతన్యాన్ని తెచ్చింది. తెలంగాణలో జరిగిన వివిధ వర్గాల వారి చైతన్యోద్యమం ఇంత వరకు పుస్తకాలకు ఎక్కలేదు. గాంధీజీ, అంబేద్కరుల కన్నా ముందే దళితోద్ధరణ కోసం భాగ్యరెడ్డి వర్మ వంటి వాళ్ళు ప్రకటించిన విషయాలు వెలుగులోకి రాలేదు. తెలంగాణ ఒక్క సాయుధ పోరాటంలోనే కాదు సామాజిక పోరాటంతోనూ ముందున్న విషయం చరిత్ర పట్టించుకోలేదు. ఇప్పుడైనా బయటపడి అందరికీ తెలియాలె. తెలంగాణ ఉద్యమ చరిత్రతో పాటు పునరుజ్జీవనోద్యమ చరిత్ర తిరగ వ్రాయవలసిన అవసరముంది.

ఆ తర్వాత కాలంలో పరిస్థితుల మీద అసంతృప్తితో పంచములు దళితులనే పేరుతో ఉద్యమాన్ని సాగించారు. గాంధీజీ పెట్టిన హరిజనులనే పేరు వాళ్ళకు నచ్చలేదు. అది పై వర్గాల ఉదారవాదంగా వాళ్ళకు కనిపించింది. పూర్వం దళిత శబ్దం దైన్యాన్ని హైన్యాన్ని సూచించేది. ఇప్పుడు దళితులంటే సాంఘిక శ్రమను చేసే వాళ్ళని అర్థంలో వాడబడుతున్నది. నిత్య పీడితులు నిత్య తాడితులు దళితులన బడుతున్నారు. 'దళిత' పదానికి బదులుగా 'బహుజను'లనే పదాన్ని కూడా ప్రయోగిస్తున్నారు. దానిలో హరిజనులే కాక మైనారిటీలు వెనుకబడిన వర్ణం వాళ్ళు, శ్రమ మీద ఆధారపడిన వాళ్ళంతా చేరుతారు. బహుజన శబ్దం బహుజనుల తాత్త్వికత విస్తృతార్థంలో చెప్తున్నా ఈ ఉద్యమంలో పంచములదే ప్రధాన పాత్రగా కన్పిస్తున్నది. దళితులకు ప్రధాన ప్రేరణ డా॥ అంబేద్కరు, మహాత్మా పూలేలు. 1924లో అంబేద్కరు అస్పృశ్యతా నివారణోద్యమాన్ని ఆరంభించాడు. 'దళితులు తమ స్థితిని తాము గుర్తెరిగి తమను తామే ఉద్ధరించుకోవాలి. తమ సమస్యలను తామే పరిష్కరించుకోగలగాలి. సవర్ణుల కన్నా తాము ఎందులోనూ తక్కువ కాదని గ్రహించా'లని అంబేద్కరు ప్రబోధం దళితోద్యమానికి మూలమంత్రమైంది.

దళితవాదంలో అంబేద్కరు దృక్పథం, మార్క్సిస్టు దృక్పథం, రెండు దృక్పథాలు కన్పిస్తున్నాయి. రెండింటినీ సమన్వయం చేయాలనే వాళ్ళున్నారు. ఇంకొక వర్గం వాళ్ళు రెండింటినీ నిరాకరించి కొత్త దృక్పథాన్ని, సిద్ధాంతాన్ని అన్వేషించాలనే వాళ్ళు కూడా వున్నారు. అంబేద్కరు సామాజిక విప్లవం వర్గ కుల దృక్పథాన్ని పునాదిగా

చేసుకునే తెలుగులో దళిత వాదుల తాత్త్వికత ఎక్కువగా సాగుతున్నది.

స్వాతంత్ర్యానంతరం స్వేచ్ఛ, సమానతలు వస్తాయని న్యాయం జరుగుతుందని ఆశించిన దళితులకు ఆశాభంగమైంది. విద్యావ్యాప్తి, నగర వాతావరణం, ఉద్యోగాలు మొదలయినయి సామాజిక సమానతను తెస్తాయని, ప్రజాజీవన స్రవంతిలో భాగమవుతామన్న వాళ్ళ ఆశ నెరవేరలేదు. ప్రభుత్వం రాజ్యాంగం ప్రకటించిన రిజర్వేషన్లు, రాయితీలు దళితుల జీవితంలో అభివృద్ధిని తేలేదు. వాళ్ళు ప్రతి దానికి అధికార వర్గంపైన ఆధారపడవలసి వచ్చింది. ఈ పరిస్థితి వాళ్ళను నిరాశకు గురి చేసింది. అందుకే దళితులు విప్లవోద్యమం వైపు దృష్టి సారించారు. విప్లవ పోరాటంతో తమకు సమానావకాశాలు సమాన ప్రతిపత్తి వస్తుందని ఆశించిన దళితులకు నిరాశ మళ్ళీ ఎదురైంది. విప్లవోద్యమం వర్గవినాశం కోసం పోరాడింది కాని వర్ణ విభేదాన్ని నాశనం చేయలేకపోయింది. పల్లెల్లో పట్టణాల్లో సజీవంవగా వున్న కుల భేదాన్ని, అస్పృశ్యతను వాళ్ళు గుర్తించలేదు. సామాజిక వ్యవస్థలో భాగంగా దళితుల సమస్యలను విప్లవోద్యమం చూపింది. కాని విప్లవోద్యమం దళితుల సమస్యలను ప్రత్యేకంగా తీర్చలేకపోయిందని సాహిత్యంలోను, ఉద్యమంలోను ప్రతి రంగంలోను పై వర్ణాల వాళ్ళు దళితుల కృషికి గుర్తింపు నియ్యడం లేదనే అసంతృప్తితో దళితులు ఆగ్రహానికి గురయినారు. ఇస్తే తీసుకోడం, ఎవరో ఉద్ధరిస్తారనే భావన నుంచి దళితులు దూరం కావాలని తమకు తాముగా ఉద్యమించి చైతన్యవంతులు కావాలని గుర్తించారు. దాంతో సామాజిక సాంస్కృతిక రంగంలో దళిత చైతన్యం విస్తరించింది. దళిత చైతన్యంతో దళిత సాహిత్యం వికసించింది. దళితులు తమ ఆవేదనను, ఆర్తిని యుగయుగాలుగా అనుభవించడాన్ని అక్షర రూపంలో పెట్టిందే దళిత సాహిత్యం అనబడుతున్నది. దళితుల మీద సానుభూతితో దళితేతరులు వ్రాసిన దాన్ని దళిత సాహిత్యంగా దళితులు పరిగణించడం లేదు. మా వేదికను మేమే నిర్మించుకుంటామంటున్నారు. దళిత అనుభవంతో దళిత స్పృహతో వ్రాసిందే నిజమైన దళిత సాహిత్యమంటున్నారు. అసత్య వాదాలన్నీ తమ వేదనను తామే వ్యక్తం చేసుకుంటామంటున్నాయి. తమ అస్తిత్వాన్ని అస్మితను గుర్తించినంతగా ఇతరులు గుర్తించలేరని వాళ్ళ వాదం.

మరాఠీ కన్నడ భాషల్లో దళితోద్యమం దళితుల సాహిత్యం ముందుగా వికసించింది. మరాఠీ దళిత సాహిత్యానికి మహాత్మాఫూలే ఆద్యుడుగా పరిగణింప బడ్తున్నాడు. 1950 దశకంలో బుద్ధ సాహిత్య పరిషత్తు ఏర్పడి మరాఠీ దళిత సాహిత్యోద్యమం పుట్టింది. 1967 వరకు మరాఠీలో దళిత సాహిత్యం తనదైన సిద్ధాంతాన్ని ఏర్పరుచుకుంది. జ్యోతిబా ఫూలే, శాహు మహారాజ్, డా॥ అంబేద్కరు, కార్ల్‌మార్క్స్, మావో ఆలోచనలు సిద్ధాంతాలతో ఇంకా అమెరికా నుంచి వచ్చిన బ్లాక్ లిటరేచర్ ప్రభావం ప్రేరణలతో మరాఠీలో దళిత సాహిత్యం పుట్టి వికసించింది. 1969 నుంచి దళిత సాహిత్యం అనే పదం విస్తృత వ్యవహారంలోకి వచ్చింది. ఔరంగాబాదులో మిళింద సాహిత్య పరిషత్తు ఏర్పడింది. అస్మిత అనే దళిత త్రైమాసిక పత్రిక దళిత తాత్త్వికత ప్రచారానికి దోహదం చేసింది. తర్వాత కన్నడం, హిందీ, బెంగాలీ భాషల్లో దళిత సాహిత్యం ఆవిర్భవించింది. దళిత సాహిత్య వ్యాప్తికి తోడ్పడే పత్రికలు వచ్చాయి. 1970 దశకంలో దళిత సాహిత్యం ఉద్యమ రూపంగా వికసించింది. 1980 దశకంలో పెద్ద ప్రవాహంగా రూపొందింది. తెలుగులో దళిత సాహిత్యం 1980 దశకంలో ఒక ఉద్యమ రూపాన్ని ధరించింది. ఆంధ్రదేశంలో దళితుల మీద జరిగిన కొన్ని అత్యాచారాలు విప్లవోద్యమం చేత నిరాశాతప్తులైన కార్యకర్తల ఆగ్రహం తెలుగులో దళిత సాహిత్యం ఉప్పొంగడానికి దోహదం చేసాయి. 1978లో కృష్ణా జిల్లా కంచికచర్లలో దొంగతనం చేసాడని దళితున్ని కట్టేసి కాల్చడం, కారంచేడు, చుండూర్లల్లో దళితులపై జరిగిన అత్యాచారాలు, దౌర్జన్యాలు తెలుగులో దళితోద్యమానికి దళిత సాహిత్య వికాసానికి ఊపునిచ్చాయి.

దళిత సాహిత్యం, భావ కవిత్వం, అభ్యుదయ కవిత్వంవలె వ్యక్తి అనుభూతిని కాక సామూహికానుభూతిని వ్యక్తం చేసింది. దళిత కవులు, రచయితలు ఉత్పత్తి రంగంలో జరిగే శ్రమ దోపిడిని ఎదుర్కోవడం సామాజికంగా, సాంస్కృతికంగా వున్న ఆధిక్య భావాన్ని అహంకారాన్ని బద్దలు కొట్టడం, సాహిత్యం కళల్లో వున్న వర్గ దృక్పథాన్ని విచ్ఛిన్నం చేయడం, భాష శిల్పంలో వున్న ఉచ్చ నీచ భావాలను ఎదిరించడం, సనాతన సంస్కృతి, ఉన్నత సంస్కృతి పేరుతో పై వర్గాల వాళ్ళ సంస్కృతిపై చలామణి కావడాన్ని దళితులు ప్రశ్నించారు. ఉన్నత వర్గ సంస్కృతిని ప్రతిఘటించడం, ఉన్నత

మధ్యవర్గాల సంస్కృతి ఆదర్శీకరణను ఎదిరించడం, కింది వర్గాల వాళ్ళ దృక్పథాలను సాహిత్యంలో ప్రతిబింబించడం దళిత రచయితలు చేసారు. ఇంతవరకు ఉన్నత వర్గాల, మధ్యతరగతి వర్గాల అనుభూతులు భావజాలం మాత్రమే తెలుగు కవిత్వంలో వచ్చింది కాని శ్రమించే అట్టడుగు వర్గాల దృక్పథం భావజాలం దళిత కవిత్వంలోనే వ్యక్తమయిందని దళితవాదులంటారు.

అనేక రాష్ట్రాల్లో రాష్ట్ర స్థాయిలో దళిత సాహిత్య అకాడమీలు ఏర్పాటై దళిత సాహిత్యాన్ని ప్రోత్సహించాయి. 1984లో ఢిల్లీలో భారతీయ దళిత సాహిత్య అకాడమీ ఏర్పాటయింది. వాళ్ళు దళిత సాహిత్యానికి అవార్డులను కూడా ప్రకటించారు. 1987లో హైద్రాబాదులో అఖిల భారత దళిత రచయితల ప్రథమ మహాసభలు జరిగాయి. "మానవ విలువలు స్వేచ్ఛ సమానతలు సౌభ్రాతృత్వం – వీటి మీద ఆధారపడిన వర్ణ రహిత సమాజ నిర్మాణం జరగా"లనేది ఈ మహాసభల్లో దళిత రచయితల ఆశయంగా ప్రకటించబడింది. "దళితులకు సమాజంలో సాహిత్యంలో సముచిత స్థానాన్ని సంపాదించడానికి పోరాటాలు నిర్వహించాలని అట్లాంటి సాహిత్యాన్ని సృజించా"లనే, లక్ష్యాన్ని ఈ సభ ప్రకటించింది. "దళిత చైతన్యాన్ని దళితుల్లో కలిగించడం దళిత సాహిత్య ప్రధానోద్దేశం కావాలి" అని ఈ సభ పిలుపు నిచ్చింది. 1993 ఫిబ్రవరిలో హైద్రాబాదులో "ఆంధ్రప్రదేశ్ దళిత రచయిత కళాకారుల మేధావుల ఐక్యవేదిక మొదటి మహాసభలు జరిగాయి. ఆత్మాభిమాన చైతన్యాన్ని ప్రతిఘటన చైతన్యాన్నీ రేకెత్తించాలని సాహిత్యాన్ని ఆయుధంగా వినియోగించుకోవాలని ఈ మహాసభలు ప్రకటించాయి. ఈ మహాసభ ప్రేరణతో కరీంనగర్, వరంగల్, రంగారెడ్డి జిల్లాల్లో దళిత సభలు దళిత సాహిత్యం మీద సదస్సులు జరిగాయి. 1990 దశకంలో తెలుగులో అనేక ప్రక్రియల్లో దళిత స్పృహ వున్న రచనలు వచ్చాయి.

మానవతా వాదులైన సురవరం, వట్టికోట రచనల్లో దళితుల, బహుజనుల మీద పూర్తి సానుభూతి కన్పిస్తున్నది. అరసం కవుల రచనల్లో దళిత స్పృహ వ్యక్తమైంది. కాని దళిత స్పృహను దళితుడే వ్యక్తీకరించడానికి సమర్థుడని దళితుల వాదన. విరసం ప్రచురించిన 'మానవ స్మృతి' కవితా సంపుటిలో దళిత స్పృహ వుంది.

తెలుగులో జాషువా దళిత ప్రతిఘటన చైతన్యానికి ఆద్యుడుగా భావింపబడ్తున్నాడు. జాషువా దళిత సాహిత్యానికి ప్రతినిధిగా నిలిచాడు. భాగ్యరెడ్డివర్మ దళితోద్ధరణకు పూనుకున్నాడు. "భాగ్యనగర్' దళిత రాజ్యం, ఎదురీత, నలుపు, వాయిస్" మొదలైన పత్రికలు దళిత తాత్త్వికతను దళిత సాహిత్యాన్ని ప్రచారం చేసాయి. చేస్తున్నాయి. 'దళిత రాజ్యం' దళిత బహుజన విముక్తి పత్రికగా చెప్పబడ్తున్నది. సమకాలీన సామాజిక ఆర్థిక రాజకీయ సాంస్కృతిక సమస్యలను అవగాహన చేసుకోవడానికి గతం చాలా ప్రధాన పాత్ర వహిస్తుందని మన మూల పునాది గతంలో వుంటుందని అందుకని భారతదేశ చరిత్రను ఆంధ్రదేశ చరిత్రను కొత్త వెలుగులో విశ్లేషించవలసిన అవసరముందని దళితులు గుర్తించారు. బోయ జంగయ్య 'జాతర, జగడం', బి.ఎస్.రాములు 'బతుకుపోరు', వేముల ఎల్లయ్య 'కక్క', సిద్ధి కాలువ మల్లయ్య 'బతుకు పుస్తకం', ముదిగంటి సుజాతారెడ్డి 'సంకెళ్లు తెగాయి, భూతం ముత్యాలు, సూర, పురుడు, జాతశ్రీ 'బలిపశువు', కదిరె కృష్ణ 'వెదురు పొదలు', అనిశెట్టి 'మట్టిబంధం', దళితులు, దళితేతరులు వ్రాసిన నవలలు. హైద్రాబాద్ బుక్ ట్రస్టు వారు 'దళిత కథలు' పేరుతో కథానికల సంపుటిని ప్రచురించారు. బోయ జంగయ్య 'గొర్రెలు, చీమలు' మొదలైన కథలు, విశాలాంధ్ర 'దళితకథలు', జాజుల గౌరి 'మన్నుబువ్వ', భూతం ముత్యాలు 'బేగరి కథలు'. ఇంకా ఎన్నో దళితుల కథా సంకలనాలు, సంపుటాలు వచ్చాయి. యెన్నెం ఉపేందర్, పసునూరి రవీందర్ కథలు వ్రాసారు.

బి.ఎస్.రాములు బహుజనవాదం గురించి మంచి సాహిత్య విమర్శ వ్యాసాలు రచించాడు. దళిత బహుజన వాదానికి సైద్ధాంతిక తాత్త్విక భూమికను తెలుగులో ఏర్పరచిన వాళ్ళలో కంచె ఐలయ్య, బి.ఎస్.రాములు మొదలైన వాళ్ళున్నారు. గద్దరు, మాస్టార్జీ, గూడ అంజయ్య, సతీష్ చందర్, ఎండ్లూరి సుధాకర్, పి.సి.రాములు, చెరుకు సుధాకర్ మొదలయిన కవులు దళిత వాదంతో కూడిన కవితలు, పాటలు వ్రాసారు. ఈ కవుల్లో శివసాగర్, గద్దర్, సతీష్చందర్, ఎండ్లూరి సుధాకర్లు మార్క్సిస్టు దృక్పథం చేత ప్రభావితులై మొదట్లో కవితలు వ్రాసి తర్వాత దళిత స్పృహతో కవితలు వ్రాసారు. దళిత కవిత్వంలో జాషువా రోజుల్లో దళిత స్పృహ

ఆవేదనలో వ్యక్తం కాగా ఈ కవుల కవిత్వంలో ఆగ్రహంతో వ్యక్తమవుతున్నది. ఈ కవులు పురాణాల్లోని వ్యాస, వాల్మీకి, ఏకలవ్య, కర్ణ, అరుంధతి, శంబూకులను ప్రతినిధులుగా తీసుకున్నారు. ఏసుక్రీస్తును దళిత ఉషస్సుకు ప్రతీకగా, దళిత యోధునిగా వాడుకున్నారు. బుద్ధుని వెలుగుకు ప్రతీకగా గ్రహించారు. దళిత కవిత్వంలో ఆవేశం, ఆవేగం, ఆవేదనలు ఆగ్రహంతో కూడిన చక్కని భావాల చిక్కదనం కన్పిస్తున్నది. చైతన్యస్ఫూర్తిని కలిగించే భావాలు వున్నాయి. అనేక కవుల దళిత కవితా సంపుటాలు వెలువడినాయి. కళామండలి పాటలు (1992), కరీంనగర్ జిల్లా దళిత పాటలు (1993) వంటివి కూడా వచ్చాయి. గుండె డప్పు కనకయ్య, గ్యార యాదయ్య, దొడ్డి రామమూర్తి, మాస్టార్జీ వంటి వాళ్లు దళిత ఉద్యమానికి పాటకున్న అనుబంధాన్ని గుర్తించి పాటను ఆయుధంగా వాడుకున్నారు. 'ఎదురీత' కావ్య సంపుటిలో 'పంచమవేదం' కవితలో సతీష్ చందర్ ఈ విధంగా ప్రశ్నించాడు.

"నిజం చెప్పండి
పంచముడంటె అయిదో వేలు లేనివాడనేనా అర్థం
మా ముత్తాత ఏకలవ్యుడు చెప్పాడు"

ఎండ్లూరి సుధాకర్ 'వర్తమాన' కవితా సంపుటిలోని 'పాదముద్రలు' కవితలో...

"నేను బద్దలవుతున్న అగ్ని పర్వతాన్ని
నన్నెవ్వరూ ఆపలేరు"

అంటాడు. దళితులు ఈ భూమ్మీద పుట్టిన వాళ్ళు మూలవాసీ సిద్ధాంతాన్ని దృష్టిలో పెట్టుకొని మాస్టార్జీ ఈ విధంగా అంటాడు.

"ఈ దేశ వాసులం – ఈ భూమి పుత్రులం
మేం మూల వాసులం – ఆది అసలు జాతులం
భారతాది జనుల బట్టి – బానిసలు మీరంటూ
వీళ్ళ దోపిడేందిరో – వీళ్ళ దగా ఏందిరో
వీళ్ళ నీల్గుడేందిరో – వీళ్ళ నిక్కుడేందిరో..."

ఇటువంటి చారిత్రక సత్యాలు దళితుల ఆత్మగౌరవాన్ని చైతన్యాన్ని ఉద్దీపింప జేస్తున్నాయి.

*"నాకు చరిత్ర లేదు నాలుగు వేదాలలోంచి*
*నాలుగు పాదాలలోంచి నన్ను తొలగించారు."*

అవి బొజ్జా తారకం ఆవేదన వ్యక్తం చేయగా కత్తి పద్మారావు 'దేశం డైరీ' కవితా సంపుటిలో–

*"దేశ వ్యాప్తంగా రక్త తర్పణం చేసిన దళితుల పీడనల*
*విముక్తికి పోరాటాలకు స్వాగతం సుస్వాగతం"*– పలికాడు.

*"అంటరాని పల్లెల్లో మంటరాజుకుందిరో*
*నివురు గప్పినా నిప్పు గుప్పునంటుకుందిరో*
*మా ఆత్మగౌరవాన్ని మీరు గౌరవించుకుంటే*
*ఈ అంటరానిమంటే మీ ఎంట దగులుతుందిరో"*

అని సాంబశివరావు హెచ్చరించాడు.

*"నా దేశంలో నా ప్రజలు ఎంతకాలం*
*మనుష్యులుగా గుర్తింపబడరో*
*అంతకాలం*
*ఈ తిరుగుబాటు గీతం*
*పాడుతూనే వుంటాను.."* అంటాడు దళిత కవి.

పీపుల్స్‌వార్ గ్రూపు పార్టీ నుంచి గద్దర్‌ను 1996లో తొలగించి పార్టీ దళితులను ఇంకా దూరం చేసిందంటాడు "స్వీయ చరిత్రకు ముందుమాట" అనే కవితలో గద్దరు.

*"ఎర్ర జెండాను/ ఎదకు అద్దుకొని*
*జనం గుండెల చప్పుడునై/ గొంతెత్తి గోపులా అర్సినపుడు*

*గుండె చితికిపోయి/ నోటినిండా పారిన రక్తం రంగుమీద*
*ఇది ఎరుపా నలుపా అని/ చర్చలు లేవనెత్తి*
*దానికి చరిత్రనే లేకుండా చేశారు*
*ఎవ్వడో ఓ మహానుభావుడు"* అని అన్నాడు.

దళితుల్లో మాల మాదిగలు మొదలైన కులభేదాలున్నాయి. వాళ్ళల్లో మాదిగలు తమకు రావలసిన అవకాశాలు రాలేదని న్యాయం జరగడం లేదని తమకు వేరేగా రిజర్వేషన్లు కావాలని ఉద్యమాన్ని మందకృష్ణ మాదిగ నేతృత్వంలో నడిపారు. మాదిగ దండోరా మోగించారు. దాంతో మాదిగ స్పృహను బలంగా వ్యక్తీకరించే సాహిత్యం వచ్చింది. ఇన్నాళ్ళు మాలమాదిగ అంటే తిట్టుగా భావించే వాళ్ళు ఇప్పుడు పేర్ల చివర మాదిగ అని పెట్టుకొని తమ కుల గౌరవాన్ని, ఆత్మవిశ్వాసాన్ని ప్రకటించు కొంటున్నారు. మాదిగ పదాన్ని "మహాదిగ" అని సంస్కృతీకరిస్తున్నారు కూడా. బహుజనులు ఒకవైపు సంస్కృత భాషను బ్రాహ్మణ వాద చిహ్నంగా నిరసిస్తూ ఇంకోవైపు గంగాపుత్ర, వంశరాజ, సగరపుత్ర, వాల్మీకులని కులం పేర్లను సంస్కృతీకరించుకొంటున్నారు. నాగప్పగారి సుందరరాజు "మాదిగోడు", ఎండ్లూరి సుధాకర్ "మల్లె మొగ్గల గొడుగు" మాదిగల బతుకులను ఆత్మగౌరవాన్ని సంస్కృతినీ చిత్రించే కథల సంకలనాలు.

దళిత సాహిత్యం ఇతర కులాల మీద విద్వేషం ప్రకటించేదిగా మాత్రమే కాక కుల నిర్మూలన వైపుగా ఉద్యమాన్ని సాగించాలి. ధనికులైన దళిత వర్గం ఏ అవకాశాలను అనుభవించని దళితుల చైతన్యానికి పిలుపునివ్వాలి. అప్పుడే దళితోద్యమం సత్ఫలితాలను ఇయ్యగలుగుతుందంటారు.

దళితులు రాజకీయాధికారం చేజిక్కించుకోవాలి. అప్పుడే దళిత సమస్యలు తీరుతాయని ఒక అవగాహన వుంది. అందుకే దళితులు బహుజన సమాజ్ పార్టీ, రిపబ్లికన్ పార్టీ మొదలైన రాజకీయ పార్టీలు వచ్చాయి. పెరియార్ రచనలు భావజాలం కూడా దళితులకు ప్రేరణ నిస్తున్నది. బహుజన సమాజ్ పార్టీ కాన్షీరాం, మాయావతి

నాయకత్వంలో ఉత్తరప్రదేశ్‌లో అధికారంలోకి రావడం దళిత వాదానికి ఉత్తేజాన్ని, ఉత్సాహాన్నిచ్చింది. ఆంధ్రప్రదేశ్ 'దళిత సంఘర్షణ సమితి', మహారాష్ట్రలో 'దళిత పాంథర్స్' తమిళనాడులో 'దళిత కల్చరల్ ఫ్రంట్' మొదలైన సంస్థలు దళిత వాదానికి ప్రచారాన్ని కలిగిస్తున్నాయి.

అయితే దళితవాద కవిత్వం కొంత విమర్శకు కూడా గురయింది. కులవాదాన్ని రగుల్పుతున్నదనే నింద దానిమీద వుంది. అది పోగా దిగంబర కవులు కుళ్ళు సమాజం మీద నాయకుల మీద కసితో తిట్టు పదజాలంతో కవిత్వం వ్రాసారు. స్త్రీ వాదులు బట్టబయలుగా అశ్లీల పదాలను వాడారు. అదే విధంగా దళిత కవులు 'నకిలీ గోత్రాలు మడిబట్టల తడి పొగరు, మనువుగాడు, మేం పాల్గొన్న రహస్య రతులు, వృషణాలు, చలం చంకలు' వంటి అశ్లీల పదజాలాన్ని ప్రయోగించి విమర్శకు గురయ్యారు.

## ముస్లిం మైనారిటీ వాదం

మొదట్లో ముస్లిం వేదన దళిత బహుజన వాదంలో భాగంగానే వ్యక్తమైంది. రాను రాను ముస్లిం రచయితలు ఎక్కువ సంఖ్యలో తమ బాధలు, సమస్యలు వివక్షలను తమ సంస్కృతి నేపథ్యంలో వ్యక్తీకరించటంతో ముస్లిం మైనారిటీ వాదం స్వతంత్ర రూపం ధరించింది. ముస్లింలను అన్ని రాజకీయ పార్టీలు, ప్రభుత్వాలు ఓటు బ్యాంకులుగా చూసి వాళ్ళ మీద ఏదో 'మెహర్బానీ'లు కురిపించాలని చూస్తుంటారు. కాని నిజమైన అభివృద్ధికి అవి దోహదం చేయడంలేదు. రాజకీయాధికారం కోసం, స్వలాభం కోసం ముస్లిం హిందువుల మధ్య ఘర్షణలు లేపి మారణహోమం సృష్టించబడటం ప్రజలు తెలుసుకున్నారు. కాని ఏమి చేయలేని నిస్సహాయ స్థితి. అవకాశవాదుల హింసలు, హత్యలు, మత ఘర్షణల పేరుతో చలామణి అవుతున్నాయి. చాలా మట్టుకు మత ఘర్షణల వెనుక వ్యాపారం, లాభాలు, మార్కెట్‌ను శాసించటం వంటి కారణాలు కూడా వుంటున్నాయి. గుజరాత్‌లో అల్లర్లు వెనుక ఈ వ్యాపార కారణాలున్నాయంటారు. 'షబానా దుఃఖం' అనే ముదిగంటి సుజాతారెడ్డి కథలో

ఈ వ్యాపారమే మత ఘర్షణకు, దుకాణం కాల్చివేతకు కారణంగా చిత్రింపబడింది. రోజు సంపాదన మీద ఆధారపడిన వాళ్ళ కడుపులు కొట్టే కర్ఫ్యూ పరిస్థితులు ఏర్పడినా సామాన్యులే ఏమీ చేయలేని దుస్థితి.

ముస్లింలు ఎప్పుడూ పాకిస్తాన్ వైపు వుంటారనే అనుమానాలు వ్యక్తమైనప్పుడు ముస్లింలు అవమానాలు, వేదనలు అనుభవిస్తారు. సౌది, దుబాయి, కువైట్‌లకు పోయే భారతీయ ముస్లింలను వాళ్ళు వీళ్ళను అచ్చమైన ముస్లింలు కారని బానిసలుగా చూడటం ఒకవైపు కాగా మరోవైపు భారతదేశంలో బాబ్రీ మసీదు కూల్చివేతలో తమ అస్తిత్వం అస్మితల మీద దాడి జరిగినట్లుగా ముస్లింలు అభద్రతా భావంలోకి నెట్టబడినారు. దాంతో ముస్లిం మైనారిటీలు తమ మూలాలు ఎక్కడో అరబ్ దేశాల్లో, ఇరాన్‌లో లేవని ఇక్కడే ఈ భూమ్మీద ఉన్నాయని ఇదే తమ వతన్ జమీన్ అని తెలుసుకున్నారు. ఈ నేపథ్యంలోనే ముస్లిం మైనారిటీ వాదం ముస్లిం చైతన్యాన్ని ప్రకటిస్తూ ప్రత్యేక వాదంగా నిలిచింది. మైనారిటీ వాదం మొదట 'జల్ జలా, అజా, గుజరాతు గాయం' వంటి కవితా సంకలనాల్లో కనిపిస్తుంది. తర్వాత స్కైబాబా సంపాదకత్వంలో వచ్చిన 'పతన్' కథా సంకలనంలో ప్రకటమైంది. మత శక్తులను ప్రశ్నిస్తూ వాళ్ళ అసలు స్వరూపాన్ని బయటపెడ్తూ కూడా రచయితలు కథలు వ్రాసారు. అటు ముస్లిం ఇటు హిందూ మత శక్తులను తీవ్రంగా ఖండించారు. ముస్లిం సమాజంలో వుండే పర్దా తలాఖ్ వంటి దురాచారాలను విమర్శించారు. ముస్లింల మీద జరిగే అన్యాయాలను వివక్షలను ప్రశ్నించారు. స్త్రీల అణచివేతలను, గృహ హింసలను చిత్రించారు. ముస్లిం పేదరికాన్ని నిరక్షరాస్యత, నిరుద్యోగాల వేదనను వ్రాసారు. వాళ్ళ జీవిత విధానాలు, ఆచారాలు, వ్యవహారాలు, వాళ్ళ రచనల్లో ప్రతిబింబిస్తున్నాయి. సెప్టెంబరు 11 దాడులు, పార్లమెంటు మీద, అక్షరధామ్ మీద దాడులు కాశ్మీరులో ప్రతినిత్యం జరిగే మారణహోమం ముస్లింలను ఉగ్రవాదులుగా, టెర్రరిస్టులుగా ముద్రవేసాయి. ఆ అపార్థాలను తొలగించే ప్రయత్నం 'వతన్' కథల్లో జరిగింది.

తెలుగు భాషను స్వంతం చేసుకొని ముస్లిం రచయితలు తమదైన సొంత భాష

యాసలను స్వంతంగా సృష్టించుకున్నారు. వాళ్ళ అభివ్యక్తీకరణం తెలుగు సాహిత్యంలో కొత్త భాషతో నుడికారాలతో భావ చిత్రాలతో, ఉపమానాలతో కన్పిస్తున్నది. ఒకప్పుడు ముస్లింల భాష ఉర్దూ అనే భావన ఉండేది. వాళ్ళ సంస్కృతికి చిహ్నం ఉర్దూ అనుకునే వాళ్ళు. కాని ఇప్పుడు ముస్లిం యువ రచయితలు తెలుగులో నిస్సంకోచంగా రచనలు చేసి తెలుగులో ఒక ప్రత్యేక శాఖను సృష్టించారు. అఫ్సర్, అలి, స్కైబాబా, యాకూబ్, కరీముల్లా, స్మైల్, అన్వర్, ఖాదర్ మొహియుద్దీన్, షాజహానా, హనీఫ్, దిలావర్, జమీలానిషాత్, అనీస్ పర్వీన్ మొదలైన వాళ్లెందరో కథలు కవిత్వం వ్రాస్తున్నారు. సలీం కథలే కాక 'వెండిమేఘం' నవలను ముస్లిం జీవితాలను చిత్రిస్తూ రచించాడు. దాదాహయాత్, ఖదిర్‌బాబు, కరీముల్లా, వేంపల్లె షరీఫ్, ఇనాయతుల్లా, ఖాజా, శశిశ్రీ, యాస్మీన్ బేగం, ఎం.ఎస్‌బేగం, మతురహబాల్లా మొదలైన వాళ్ళెందరో కథలు వ్రాస్తున్నారు. ఈ రచయితల్లో తెలంగాణ, రాయలసీమ, కోస్తాకు చెందిన వాళ్ళున్నారు. అందరి అస్తిత్వ వేదన ఒక్కటిగానే వుంది. ముస్లిం రచనల్లో వాళ్ళ అస్తిత్వ వేదన చైతన్య స్ఫూర్తితో బయటికి వస్తున్నది. ఖాజా ముస్లిం మైనారిటీ వాదం తాత్త్వికతను చర్చిస్తూ మంచి విమర్శ గ్రంథం వ్రాసాడు.

## స్త్రీ వాదం

ఇంగ్లీషులో "ఫెమినిజం" పదాన్ని తెలుగులో "స్త్రీ వాదం" అని అనువాదం చేసుకొని వాడుతున్నాం. ఫ్రెంచి విప్లవం తెచ్చిన వ్యక్తి వాదం వ్యక్తి స్వేచ్ఛను సమానత సౌభ్రాతృత్వం భావాల నుంచి పీడిత జనాభ్యుదయం భాగంగా స్త్రీ అభ్యుదయ భావన పుట్టింది. రెండో ప్రపంచ యుద్ధం తర్వాత మానవ హక్కుల ప్రకటన స్త్రీ అభ్యుదయ భావానికి బీజాలు వేసింది. స్త్రీ అభ్యుదయం విముక్తి పోరాటం అనేది యూరోపు, అమెరికాల్లో ఓటు హక్కు కోసం పోరాడడంతో ప్రారంభమైంది.

ప్రాచీన సమాజాల్లో ఏ కొద్దిమందికో అధికారాలు అధిపత్యాలుండేవి. చాలా మంది కుటుంబంలో గాని, సమాజంలోగాని, దేశంలోగాని అణచివేతకు గురయ్యే వాళ్ళు. అట్లా అణచివేతకు గురయిన వాళ్ళల్లో జనాభాలో దాదాపు యాభైశాతం స్త్రీలు కూడా వున్నారు. స్త్రీలు కుటుంబం నడపడంలో, వ్యవసాయం పనుల్లో పరిశ్రమలు

వచ్చిన తర్వాత పరిశ్రమల్లో శ్రమపడడం వాళ్ళవంతుగా వుంది. శ్రమపడ్డా వాళ్ళకు స్వేచ్ఛా స్వాతంత్ర్యాలుగాని, శ్రమ విలువను అనుభవించడంలో భాగంగాని లేవు. ప్రాతివ్రత్యం, త్యాగం, సహనం, శాంతం స్త్రీలకుండాలనే భావజాలం స్త్రీ అణచివేతకు తోడ్పడినాయి. భారతదేశంలో అనాదికాలం నుంచి స్త్రీలు సంపూర్ణ స్వేచ్ఛా స్వాతంత్ర్యాలు సుఖశాంతులు లేకుండానే వున్నారు. క్రమంగా బాల్యవివాహాలు, విధవల దుస్థితి, పునర్వివాహం హక్కుల్లేకుండా వుండటం, ఆస్తి హక్కు నుంచి వంచితురాలిని చేయటానికి పుట్టిన సతీసహగమనం వంటి దురాచారాలతో స్త్రీల పరిస్థితి అధ్వాన్నమైంది. 19వ శ. ఉత్తరార్థంలో రాజా రామమోహన్‌రాయ్‌ల వంటి మత సంస్కరణ వాదులు స్త్రీ జనోద్ధరణను చేపట్టారు. ఆంధ్రదేశంలో వీరేశలింగం, వేంకటరత్నం, ఉన్నవ మొదలయిన సంఘ సంస్కర్తలు స్త్రీ అభ్యుదయానికి కృషి చేసారు. కేసరి "గృహలక్ష్మి" పత్రిక ద్వారా స్త్రీ అభ్యున్నతి, స్త్రీ శరీరారోగ్యం గురించి కృషి చేసాడు. సంస్కరణలతో సాంస్కృతిక పునరుజ్జీవనంతో భారతదేశంలో స్త్రీ అభ్యుదయం స్త్రీ విముక్తికి ఉద్యమాలు ఆరంభమయ్యాయి. అది మొదటి దశ.

భారత స్వాతంత్ర్య ఉద్యమ కాలంలో గాంధీజీ పిలుపునందుకొని ఎందరో స్త్రీలు పోరాటంలోకి దిగి పురుషులతో సమానంగా పనిచేసారు. రెండో దశలో స్త్రీ అభ్యుదయ కార్యక్రమాలు స్వాతంత్ర్యోద్యమంలో భాగంగా జరిగాయి. దువ్వూరి సుబ్బమ్మ, దుర్గాబాయి దేశ్‌ముఖ్, మాగంటి అన్నపూర్ణమ్మ, ముత్తులక్ష్మిరెడ్డి వంటి సంఘ సేవాపరాయణులు స్వాతంత్ర్య యోధులు, తోటి స్త్రీలు ఆర్థికంగా నిలదొక్కుకొని, దీనత్వం నుండి బయటపడి వ్యక్తిత్వం, స్వాతంత్ర్యం, ఆత్మవిశ్వాసం సంపాదించు కోవడానికి కృషి చేశారు.

స్వాతంత్ర్యానంతరం దేశంలో పీడిత వర్గం ఉద్ధరింపబడుతుంది, దారిద్ర నిర్మూలన జరుగుతుందన్న కల నిజం కాలేదు. అదే విధంగా స్త్రీల అభ్యున్నతి అట్లాగే నిలిచిపోయింది. 1960–70 దశకంలో యూరోపులో ముఖ్యంగా ఫ్రాన్సు, ఇంగ్లాండు దేశాల్లో స్త్రీ విముక్తి ఉద్యమం ఒక సైద్ధాంతికతతో బయలుదేరింది. అదే "ఫెమినిజం" – స్త్రీ వాదంగా పరిణమించి ప్రపంచ దేశాలన్నిటిలోను క్రమంగా

వ్యాపించింది. పాశ్చాత్య దేశాల్లో స్త్రీల పోరాటం మన దేశంలో లాగా సంస్కరణలతో గాక ఓటు హక్కు కోసం పోరాటంతో ఆరంభమైంది. మేరీ ఓల్‌స్టోన్ క్రాఫ్ట్ అనే ఆమె మొదటి ఫెమినిస్టు సిద్ధాంతకర్త. ఆమె బ్రిటన్‌లో పుట్టింది. "విండికేషన్ ఆఫ్ ద రైట్స్ ఆఫ్ వుమెన్" (1789)లో సమాన హక్కులు సమాన అవకాశాలను గురించి మొదటి సారిగా మాట్లాడింది. ఆడపిల్లలకు చదువు కావాలని వాదించింది. తరువాత రచయిత్రి వర్జీనియా వుల్ఫ్ వ్రాసిన "ఏ రూమ్ ఆఫ్ వన్స్ ఓన్" (1929) రచనలో ఫెమినిజం సూత్రాలు ప్రతిబింబించాయి. 1949లో సిమోన్ ద బూవా "ది సెకండు సెక్స్" గ్రంథాన్ని రెండు సంపుటాలుగా వేసింది. అంతకుముందు ఆ వ్యాసాలు వివిధ పత్రికల్లో వచ్చినయి. 1953లో ఇది ఇంగ్లీషులోకి అనువదింపబడి ప్రపంచ వ్యాప్తంగా చర్చను లేపింది.

1960 దశకంలో స్త్రీవాద భావజాలం విస్తృత ప్రచారంలోకివచ్చింది. రెండో ప్రపంచ యుద్ధానంతరం స్త్రీలు తమ అస్తిత్వాన్ని గురించి తమ శ్రమదోపిడీ, సెక్సు సంబంధాల్లో అనుసరింపబడే ద్వంద్వ నీతిని గురించి ఆలోచన జరిగింది. దాని ఫలితంగానే స్త్రీ మీద తరతరాల అణిచివేతకు, నెట్టివేతకు స్త్రీలు ఎదురు తిరిగారు. 1966లో అమెరికాలో "నేషనల్ ఆర్గనైజేషన్ ఆఫ్ వుమెన్" పేరుతో ఫెమినిస్టు సంస్థ ఏర్పడింది. పురుషాధిక్య ప్రపంచమే స్త్రీలకు శత్రువని, స్త్రీల అణిచివేతకు పితృస్వామ్య సమాజం కారణమని, స్త్రీ పురుష సంఘర్షణను ప్రచారం చేసారు వాళ్ళు. 1969లో మార్గరేట్ బెన్‌స్టన్ "పొలిటికల్‌ఎకానమీ ఆఫ్ వుమెన్"లో స్త్రీల ఇంటి చాకిరీకి వెలకట్టాలని వాదించింది. 1970లో కేట్ మిల్లెట్ "సెక్సువల్ పాలిటిక్స్" అనే పుస్తకంలో స్త్రీల అణచివేతకు పితృస్వామ్యం కారణమని తేల్చింది.

1972లో జర్మయిన్ గ్రీయర్ వ్రాసిన "ది ఫీమేల్ యూనక్"లో వ్రాసిన స్త్రీవాద ధోరణి అందరి కళ్లను తెరిపించింది. తర్వాత స్త్రీ పురుషులను "సెక్సు" పదంతో కాక "జండర్" పదంతో సూచించడం జరగాలంటున్నారు. సామాజిక శాస్త్రాల ఆధారంగా సెక్సుకు జండర్‌కు మధ్య స్పష్టమైన భేదం నిరూపించబడింది. సెక్సు అనే పదం కన్నా జండర్ పదం స్త్రీ ఆడతనాన్నే కాక స్త్రీ సంబంధి పదజాలాన్నంతా

ప్రతిబింబిస్తున్నది. స్త్రీ పురుషుల మధ్య అసమానతతో కూడిన సంబంధాలను లైంగిక రాజకీయాలు అని మిల్లెట్ పేర్కొన్నది. షులామిల్ ఫైర్‌స్టోన్ "ది డయలిక్టిక్స్ ఆఫ్ సెక్స్" అనే పుస్తకం వ్రాసింది. మిల్లెట్, ఫైర్ స్టోన్‌లు సాంఘిక ఆర్థిక అణచివేతలతో పాటు పురుషాధిక్యత భావాన్ని ప్రతిపాదించారు. లైంగికతను బట్టి పని విభజన వుండటం, స్త్రీల ఇంటి పనుల శ్రమకు విలువ కట్టకపోవడం వంటి సమస్యలు లేవదీశారు.

తెలుగు సాహిత్యంలో 1960–70 దశకంలో చాలా మంది స్త్రీలు నవలా రచనలు చేసారు. వాళ్లు, ప్రేమ పెళ్లిళ్లు, వర్ణాంతర వివాహాలు వంటి ఇతివృత్తాలు తీసుకొని నవలలు వ్రాసారు. కానీ ఆ తరుణంలో యూరోపులో తలెత్తిన స్త్రీ వాదాన్ని పట్టించుకోలేదు. కొందరు నవలా రచయిత్రులు కులాంతర వివాహాలు, కట్నం సమస్యలు, కుటుంబ సమస్యలు ఉమ్మడి కుటుంబాల్లోని బాధలు ఉద్యోగినులైన స్త్రీల కష్టాలను గురించి వ్రాసారు. కాని స్త్రీల స్వేచ్ఛ, స్త్రీ పురుష సంబంధాల్లో ఆధిక్యతా న్యూనతా భావాలను స్త్రీల ఆర్థిక సమస్యలను అణచివేతలను గురించి పట్టించుకోలేదు.

స్త్రీవాద ధోరణిని చిత్రిస్తూ తెలుగులో మొట్టమొదటి రచన రంగనాయకమ్మ "జానకి విముక్తి" అనే నవల 1978లో వచ్చింది. స్త్రీల అణచివేతను స్వేచ్ఛా రాహిత్యాన్ని పురుషాధిక్యతను రంగనాయకమ్మ ఈ నవలలో చిత్రించింది. ప్రశ్నించింది. ఈ నవలలో నాయిక జానకి తన అన్న చైతన్య సాహచర్యంతో భర్త అణచివేతను ప్రశ్నించి ఎదురు తిరిగే వ్యక్తిగా ఎదిగినట్లుగా రచయిత్రి చిత్రించింది. వీరేశలింగం కాలంలోని రచయిత్రులు నీతి ధర్మభక్తి బోధకమైన రచనలు చేయగా కొందరు బండారు అచ్చమాంబ, స్త్రీ విద్య స్త్రీల కష్టాలు, స్త్రీల ఆత్మగౌరవం స్వేచ్ఛల గురించి వ్రాసారు. బండారు అచ్చమాంబ "అబలా సచ్చరిత్రరత్నమాల" (1905)లో స్త్రీల పాతివ్రత్యం, పురుషాధిపత్యాలతో ఎట్లా బాధలు పడ్డారో చిత్రించింది. అచ్చమాంబ తెలంగాణా రచయిత్రి.

స్త్రీ సమస్య అంతా లైంగికమని ఫ్రాయిండ్ అంటాడు. స్త్రీ సమస్య అంతా

ఆర్థికమే అని ఏంగెల్స్ వాదం. స్త్రీకి పారిశ్రామికుడికి సమస్యల్లో భేదం లేదని సోషలిస్టులంటారు. సోషలిస్టు సమాజ స్థాపన స్త్రీల సమస్యలను పరిష్కరిస్తుందని విశ్వసిస్తారు. స్త్రీ సమస్య లైంగికంగాని, ఆర్థికంగాని కాదని మానవ వాస్తవికతలో ఒక భాగం కావాలని అప్పుడే స్త్రీ అణచివేత నశిస్తుందని సైమన్ ద బూవా అనే స్త్రీ వాదిని అంటుంది. స్త్రీల సమస్యను మానవ వాస్తవికతతో, మానవ హక్కుల సాధనతో ముడిపెట్టిన వాళ్లున్నారు. స్త్రీవాదంలో అనేక ధోరణులు ఏర్పడినాయి. అయినా స్త్రీవాద తాత్త్వికతలో ప్రధానంగా మూడు విధాలైన ధోరణులు కన్పిస్తున్నాయి. ఒకటి – లిబరల్ ఫెమినిజం (ఉదార స్త్రీవాదం) స్త్రీలకు పురుషులతో సమానమైన హక్కులు, అవకాశాలు కావాలంటారు. విద్య, ఉద్యోగ, రాజకీయ, ఆర్థిక రంగాలలో స్త్రీలు పాల్గొనాలని వీరు కోరుతారు. స్త్రీ పురుషులు ఎవరి బాధ్యతలు వాళ్లు నిర్వహిస్తూ సామరస్య ధోరణిలో జీవించాలన్నది వీళ్ళ వాదం.

ఇక రెండోది – రాడికల్ ఫెమినిజమ్. వీళ్లు స్త్రీలను ఒక ప్రత్యేక వర్గంగా భావిస్తారు. స్త్రీ అణచివేతకు పితృస్వామ్యం మూలకారణమని అంటారు. స్త్రీలకు తమ శరీరాల మీద, జీవితాల మీద, మతం, రాజ్యం అధికారం చలాయిస్తాయి. పితృస్వామిక సమాజం, మత రాజ్యాలు స్త్రీ అణచివేత కనుకూలంగా భావజాలాన్ని సృష్టించి తరతరాలు వ్యాపింప జేసాయి. స్త్రీ పురుష సంబంధాల్లో పురుషుడు అనుభవించే వాడుగా అంటే భోగిగా, స్త్రీ అనుభవింపబడే వస్తువు అంటే భోగ్యంగా చూసారని మగవాన్ని ప్రేమించడానికి సేవించడానికి కనడానికి తయారు చేయబడింది స్త్రీ శరీరం అని చెప్పి స్త్రీవాదంలోస్త్రీ శరీరాన్ని ద్వేషించడం అలంకరించుకోకపోవటం అన్న భావాలు కన్పిస్తున్నాయి. మగవాళ్లను వర్గ శత్రువులుగా మగ పిల్లలను శత్రు వర్గపు మొలకలుగా భావించడం వంటి ధోరణలు దీనిలో వున్నాయి. ఇంటిపని – స్త్రీల జీవిత సారాన్ని మేధోశక్తిని సృజనాత్మకతను నశింపజేసేదిగా వీళ్ళు భావించారు. ఇల్లు స్వర్గసీమ ఇల్లాలు గృహలక్ష్మి వంటి భావజాలాన్ని వీరు ద్వేషించారు. పితృస్వామ్యం నుండి ఏర్పడింది కుటుంబ వ్యవస్థ అనీ, పితృస్వామ్యం కుటుంబ వ్యవస్థ కుళ్లు, ప్రైవేటు ఆస్తులు నశించాలని వీళ్లు అంటారు.

స్త్రీ వాదంలో మూడోది - సోషలిస్టు ఫెమినిస్టు ధోరణి. మార్క్సు, ఏంగెల్స్, లెనిన్ భావాలతో కూడిన స్త్రీవాద ధోరణి ఇది. బెబెల్ ఆగస్టు వ్రాసిన "వుమెన్ అండ్ సోషలిజం" (1879) ప్రభావంతో స్త్రీల లైంగిక స్వేచ్ఛ, వివాహం చేసుకోకపోవటం వచ్చాయి. అందుకే దీన్ని అలెగ్జాండ్రా కొల్లెంటై "వుమెన్స్ బైబిల్" అన్నది. బ్రౌన్ స్టెల్లా (1920, 30 దశకాల్లో) అబార్షన్, బర్త్ కంట్రోల్ కోసం పోరాటం చేసింది. ఇవన్నీ సోషలిస్టు స్త్రీ వాదంలో భాగాలు-

సోషలిస్టు విప్లవ కాలంలో రష్యాలో చైనాలో సామాజిక శ్రమ విభజనకు అంటే స్త్రీ వంటింటికి అంకితం కావడం, పురుషుడు కార్మిక కర్షక వృత్తికి అంకితం కావడాన్ని నిర్మూలించి స్త్రీ కర్మాగారాల్లో శ్రామిక ఉత్పత్తి శక్తిగా మార్చబడింది. దాంతో స్త్రీ విముక్తి అభ్యుదయం సమానతలు సాధింపబడినాయని అన్నారు. కాని నిజానికి అది జరుగలేదు. స్త్రీలకు యాజమాన్యంలో భాగంగాని, నిర్ణయాధికారం గాని లేవు. ఇంటి పని తప్పలేదు. అందువల్లనే సోషలిస్టు ఫెమినిజం లిబరల్ ఫెమినిజంకు దగ్గరగానే దాని చెల్లెలుగానే కన్పిస్తున్నది. కాని అంతగా స్త్రీ అభ్యుదయాన్ని రాజకీయ ఆర్థిక స్వేచ్ఛను సాధించలేకపోయింది. దాంతో స్త్రీ వాదంలో రాడికల్ ఫెమినిజం తలెత్తింది. ఈ మూడు కాక స్త్రీ వాదంలో మరో ధోరణి కన్పిస్తున్నది. వాళ్ళ స్త్రీ స్వేచ్ఛను సంప్రదాయ పరిధిలోనే న్యాయపరంగా సామాజిక పరంగా ఏ రాజకీయాలు లేకుండా నిజాయితీగా అమలులోకి తెచ్చేందుకు స్త్రీలు ఉద్యమించాలంటున్నారు. స్త్రీ తనకు తాను మారాలి. ఎదగాలి. తన హక్కులను తాను తెలుసుకొని అమలులోకి తెచ్చుకునే మనోధైర్యం, ఆత్మవికాసం రావాలన్నది వాళ్ళ వాదన. ఆత్మబలంతో పరిసరాలను, అణచివేతను, వివక్షతను జయించాలన్నది వాళ్ళ అభిప్రాయం. మానవీయ విలువలకు ప్రాధాన్యమియ్యాలి. పాత ధోరణిలో దోషాలన్నీ పురుషుల్లోనే వున్నాయనే విపరీత ధోరణితో కాక ప్రజాస్వామ్య దృక్పథంతో ఆలోచించాలి. పురుషున్ని శత్రువుగా చూడకుండా స్త్రీ తన అభ్యుదయంలో భాగస్వామిగా చేయాలి. పురుషులు మారందే స్త్రీ వాదం విజయవంతం కాదు. స్వేచ్ఛ, సమానత్వం, సామాజిక న్యాయం, హక్కుల పరిరక్షణలు ప్రజాస్వామ్య మార్గంలో సాధింపబడాలి అని ఈ వాదం. దీన్ని మానవీయ విలువలన్న ప్రజాస్వామ్య స్త్రీవాదం

అని అనవచ్చును. స్త్రీకి నిర్ణయాధికారం వుండాలి. అన్ని రంగాల్లో స్త్రీలు చొచ్చుకొని ముందుకు రావాలి. పురుషున్ని ఒక శత్రువుగా ఒక బలహీనతలకు కారణంగా చూడడం కుటుంబ వ్యవస్థను ఛిన్నాభిన్నం చేయాలనడం వాళ్ళు వ్యతిరేకిస్తున్నారు. తెలంగాణ రచయిత వట్టికోట ఆళ్వారుస్వామి "అవకాశమిస్తే..." కథలో ఇటువంటి స్త్రీవాదం, స్త్రీ ఇంటిచాకిరికి గురి కాకూడదని ఆమె సమాన భాగస్వామిగా వుండాలని 1940ల్లో వ్రాసిన కథలో చెప్పాడు.

స్త్రీ వాదంలో ఈ నాలుగు భేదాలే కాక మూడో ప్రపంచంలోని స్త్రీలు తమ సమస్యలు పాశ్చాత్య స్త్రీలకన్న భిన్నమైనవని అంటున్నారు. అదే విధంగా భారతదేశంలోని గ్రామీణ సమాజంలోని స్త్రీల సమస్యలు భిన్నమైనవి. ఆ విధంగా స్త్రీవాదం అభివృద్ధి చెందిన దేశాల స్త్రీల సమస్యలతో అభివృద్ధి చెందని అభివృద్ధి చెందుతున్న స్త్రీల సమస్యలతో విబేధిస్తుంది. 1980 దశకంలో చార్లెట్ బంచ్, టి గ్రేస్ అటికిన్సన్ మొదలైన వాళ్లు రాడికల్ ఫెమినిజంలో భాగంగా లెస్బియనిజంను పురుషుల నెదిరించే శక్తిగా చెప్పారు. లెస్బియన్ ఫెమినిజంను జెండర్ స్వేచ్ఛకు మార్గం అన్నారు. మేరీ డాలీ "ది చర్చ్ అండ్ ది సెకండ్ సెక్స్ (1969)లో క్రిస్టియానిటీలో దేవుడు మగవాడుగా చిత్రింపబడ్డాడు. క్రిస్టియానిటీ గాని, ఏ మతం గాని పితృస్వామ్యంగాని స్త్రీల మీద అధికారం చెలాయించిందని భాషా పదాల ప్రయోగంలో స్త్రీ వివక్షత వుండకూడదని చెప్పింది.

ఆంధ్రదేశంలో 1970 దశకంలో వ్యాపించిన సాయుధ పోరాటం గిరిజనోద్యమం విప్లవోద్యమం స్త్రీలకు న్యాయం చేకూర్చలేదనే అసంతృప్తి స్త్రీలల్లో కలిగింది. విప్లవోద్యమంలో పని చేసిన స్త్రీల పట్ల గౌరవభావం సమభావం లేకపోవటం సబార్డినేషన్‌కు గురి చేయడం వంటి కారణాల వల్ల స్త్రీలు ప్రత్యేక వర్గంగా ఉద్యమాన్ని చేపట్టారు.

పోరాటానికి ప్రేరణ విప్లవోద్యమం నుంచి వచ్చినా స్త్రీ వాదంలోని భావజాల మంతా సిద్ధాంతాలన్నీ పాశ్చాత్య రచనలనుంచి తీసుకున్నాయనే చెప్పాలి. 1980 దశకం నుంచి స్త్రీ వాదధోరణులతో తెలుగులో రచయిత్రులు రచనలు చేయడం

ప్రారంభించారు. స్త్రీలు తమ బాధలను, కష్టాలను తామే అనుభవపూర్వకంగా తెలుసుకొని ఆ అనుభూతులను బాగా వ్యక్తీకరించగలమనే ప్రధాన ఆశయం స్త్రీల రచనల్లో కనిపిస్తుంది. తమ గోడులను పురుషులు వ్యక్తం చెయ్యడం గాని, సానుభూతి చూపడం గాని వీళ్లు కోరుకోలేదు. అయినా, చేరా వంటి విమర్శకులు, పత్రికా రచయితలు స్త్రీవాద సాహిత్యాన్ని బాగా విశ్లేషించి పాఠకుల దృష్టికి తెచ్చేంతవరకు స్త్రీవాదం అందరి దృష్టిని ఆకర్షించలేదనే చెప్పాలి.

వట్టికోట ఆళ్వారుస్వామి వంటి వాళ్ళు తమ కథల్లో స్త్రీ సమానతను ప్రబోధిస్తూ సానుభూతిని చూపారు. విప్లవ కవుల్లో చెరబండరాజు, గద్దర్, వరవరరావులు స్త్రీ విముక్తిని కోరుతూ కొంతవరకు స్పందించారు. స్త్రీ పురుషులిద్దరు కలిసి ఉద్యమించాలని విప్లవ కవులు కోరారు.

*"ఆకాశంలో సగం నీవు సగం నేను*
*మనిద్దరం కలిసి ఉద్యమిస్తే ఉప్పెన*
*విప్లవిస్తే విజయం" (శివసాగర్)*

1993లో స్త్రీలే స్త్రీవాద కవితల సంకలనాన్ని 'నీలి మేఘాలు' పేరుతో ప్రచురించారు. దీనిలో తెలంగాణ కవయిత్రులు ఉన్నారు. ఆడపిల్లల పెంపకంలోని పక్షపాతం, స్త్రీల మీద జరిగే హింస, మానభంగాలు, భ్రూణ హత్యలు, వరకట్నాలు – చావులు, స్త్రీల ఇంటి చాకిరి, స్త్రీ ఉద్యోగిగా పడే శ్రమ, స్త్రీల అణచివేతలు సంప్రదాయ నిరసనలు మొదలయినయి స్త్రీవాద కవిత్వంలో వస్తువుగా కన్పిస్తున్నయి.

ఇంటి చాకిరి వంటగదికి అంకితమయ్యే స్త్రీ సమస్యలను విమల 'వంటిల్లు'లో చక్కగా చిత్రించింది. 'అసలు మా అమ్మే నడుస్తున్న వంట గదిలా వుంటుంది'.... 'మా అమ్మ మా అమ్మమ్మ ఇంట్లో అమ్మలంతా ఇక్కడే స్త్రీలయ్యారట' అంటుంది.

*"ఈ వంటింటి సామ్రాజ్యానికి మా అమ్మే రాణి*
*అయినా చివరకు వంటింటి గిన్నెలన్నిటిపైనా నాన్న పేరే"*

అని పురుషాధిపత్యాన్ని ఎత్తి చూపింది–

*"మనం ఏమైనా మన అంతిమ కర్తవ్యం*
*గరిట తిప్పటంగా చేసిన ఈ వంటిళ్లను*
*ధ్వంసం చేద్దాం రండి..."*

'మన పిల్లల కోసం వంటగదులు కూల్చేందుకు రండి' అని పాటిబండ్ల రజని భావితరాల వాళ్ళు కూడా వంటింటి కంకితం కాకూడదని వంటింటిని ధ్వంసం చేద్దాం అంటుంది. స్త్రీ అణచివేత వ్యవస్థకు వంటిల్లు ఒక ప్రతీక. దాన్ని ధ్వంసం చేయమనడం వ్యవస్థను ధ్వంసం చేయాలనడమే.

*"వేరు వేరు స్వంత పొయిలను*
*పునాదులతో సహా తవ్వి పోద్దాం రండి."*

అని వ్యవస్థ ధ్వంసం కోసం విమల పిలుపునిచ్చింది.

*పురాతన పిత్రుస్వామ్య వివాదాలకు*
*బరిగా నిల్చింది నా శరీరమే!*

అంటుంది వసంత కన్నబిరాన్ 'శరీరం' కవితలో.

స్వేచ్ఛతో కూడిన లైంగిక సంబంధాలు ఉత్తమమైనవనడం, స్వేచ్ఛ కోసం పెళ్ళి చేసుకోకుండా స్త్రీ పురుషులు కలిసి జీవించడం స్త్రీ సమానత సమస్యలకు స్వేచ్ఛకు పరిష్కారం అని అంటారు కొందరు. కుటుంబ వ్యవస్థ అవసరం లేదనడం పితృస్వామ్య వ్యవస్థకు కుటుంబాన్ని ప్రతీకగా చూడడం అందరూ సమర్థించలేరు.

ఎందరో ఆడవాళ్ళు కుటుంబవ్యవస్థలో ఛాయలో శాంతి భద్రతల ననుభవిస్తున్నారు. ఆ శాంతిభద్రతలు సంకెళ్ళతో కూడినవని దాన్ని వ్యతిరేకించే తీవ్ర ధోరణులు విపరీత ఫలితాలను తేవచ్చును. స్త్రీ ముందుగా వ్యక్తిత్వాన్ని ఆత్మ స్థైర్యాన్ని సంపాదించాలంటారు మరికొందరు. చైతన్యవంతురాలు కావాలి. అధికార దుర్వినియోగంతో అమాయకత్వంతో ప్రేమ పవిత్రతల పేరుతో వ్యక్తిత్వాన్ని చంపుకోవద్దు. లైంగిక స్వేచ్ఛ పేరుతో పురుషులకు లొంగిపోవద్దు. సమలింగ సెక్సు సంబంధాలతో ప్రకృతికి విరుద్ధంగా పోయి ఆత్మవినాశనాన్ని తెచ్చుకోవద్దు. వ్యక్తులను

సమాజాన్ని నిందిస్తూ కూర్చోకుండా ధైర్యసాహసాలతో అవసరమైతే విప్లవించాలి అని స్త్రీ, పురుష సంబంధాల్లో నిజాయితీ, స్నేహం, విశ్వాసాలుండాలని ధ్వనింపజేస్తూ సుజాతారెడ్డి 'ఆకాశంలో విభజన రేఖల్లేవు' అనే నవలను (1995) వ్రాసింది. సాధన 'రాగో' నవలలో స్త్రీ వాదాన్ని విప్లవోద్యమంలో భాగంగా చిత్రించింది. రాగో విప్లవోద్యమంలో కార్యకర్తగా వుంటూ స్త్రీల సమస్యలను పరిష్కరిస్తుంటుంది. గీతాంజలి 'ఆమె అడవిని జయించింది' స్త్రీవాద నవల. మౌలికత వున్న నవల.

"ఆమె అడవిని జయించింది" నవల నిజామాబాదు యాసలో వుంది. కుటుంబంలో స్త్రీలు పురుషుల రుచులకనుగుణంగా లొంగి నడుచుకోవటం, స్త్రీలల్లో ఆత్మగౌరవం ఆత్మాభిమానాలు విడిచిపెట్టి ఆచార సంప్రదాయాల పేరుతో అణచివేయబడటం ఇతివృత్తం. నగరాల్లో స్త్రీలు ఎటువంటి స్వేచ్ఛా స్వాతంత్ర్యాలు లేకుండా హింసలకు గురికావటాన్ని గీతాంజలి ఈ నవలలో చిత్రించింది. గీతాంజలి "బచ్చేదాని" కథలో ముదిగంటి సుజాతారెడ్డి "విసుర్రాయి" కథల్లో స్త్రీల సమస్యలు, స్త్రీలు ఎదుర్కొనే వివక్షలు, హింసలు చిత్రింపబడినాయి. మలయశ్రీ రచించిన "నిర్ణయం"లో స్త్రీ ఆత్మగౌరవం కోల్పోయే పురుషాధిపత్యాన్ని చిత్రించాడు.

స్త్రీల శారీరక మానసిక హింసలను చిత్రిస్తూ 1980 దశకం నుంచి చాలా కథానికలు వచ్చాయి. జయధీర్ తిరుమలరావు స్త్రీవాద కథానికలను ఎంపిక చేసి సంపుటిగా ప్రచురించాడు. కథానిక సాహిత్యం స్త్రీవాదంలోని వివిధ భావజాలాన్ని చక్కగా చిత్రించాయి. దాంపత్య సంబంధాలు, స్త్రీ స్వయం ప్రతిపత్తి, స్త్రీ శ్రమ దోపిడి, పురుషాధిపత్యం, భర్త అధికారం, తల్లిదండ్రుల దృక్పథం, వరకట్నాల బాధలు–హత్యలు, స్త్రీల ఉన్నత చదువులు ఉద్యోగాలు ఇంటి చాకిరి, గృహహింస మొదలయిన ఎన్నో వాస్తవిక జీవితంలోని సమస్యలు కథానికల్లో ప్రతిఫలించాయి. విషయాన్ని కళాత్మకంగా ధన్యాత్మకంగా విశ్లేషణాత్మకంగా చెప్పడం ఈ కథానికల్లో కన్పిస్తుంది.

1990 దశకంలో యూరోపు అమెరికాలో స్త్రీ వాదంలో మార్పులు వచ్చాయి. 1960–70 దశకంలో సెక్స్ పరంగా స్వేచ్ఛ వుండాలన్న స్త్రీ వాదులు ఆ స్వేచ్ఛ

పురుషులు అలుసుగా అవకాశంగా తీసుకోవడం వరకుపోకూడదంటున్నారు. ఎరికాజాంగ్, జెర్మయిన్ గ్రీర్, మేరియన్, టటల్ మార్స్టేట్ మొదలయిన స్త్రీవాదుల దృక్పథంలో మార్పు వచ్చింది. జెర్మయిన్ గ్రీర్ తన 'సెక్స్ అండ్ డెస్టినీ' పుస్తకంలో ఉద్యమాలకు అతీతమైంది. మాతృత్వం అని వ్రాసింది. అది వ్యక్తి చేతనను ఉన్నత పరిచే ఒక మహత్తర అనుభవం అని ఆమె వ్రాసింది. పాశ్చాత్య దేశాల్లో 'బ్రాలు' తగిలేసి వివాహానికి కాలం చెల్లిపోయిందన్న స్త్రీ వాదులు జెర్మయిన్ గ్రీర్, జెన్‌ఫాండా వంటి వాళ్ళు ప్రేమ పెళ్ళిళ్ళు అని స్థిరపడిపోయారు. ప్రేమించే పురుషునితో జీవితాన్ని పంచుకోవడంలో ఆనందముందని చాటింది జేన్‌ఫాండా. 'ది గోల్డెన్ నోట్‌బుక్, ది గ్రాస్ ఈజ్ సింగింగ్' వంటి పుస్తకాలతో స్త్రీ వాదానికి దిశా నిర్దేశం చేసిన డోరిస్ లెస్సింగు లింగ వివక్ష పోరాటంలో స్త్రీ వాదం దారి తప్పిందని విమర్శించింది. దాంతో సామాన్య స్త్రీలు స్త్రీవాదంలోని అతివాద ధోరణిని ఎదుర్కొన్నారు. అదే విధంగా తెలుగులోను స్త్రీవాదంలోని అతివాద ధోరణిని ప్రశ్నిస్తూ సుజాతారెడ్డి వ్రాసిన 'స్త్రీవాదం ఎక్కడిది? ఎందుకు? (ఆంధ్రప్రభ దినపత్రిక 1-3-1993) అన్న వ్యాసం అందరినీ ఆకర్షించింది.

ప్రపంచంలోని ప్రజాస్వామిక దేశాలన్నీ సమర్థించినా బంగ్లాదేశ్‌కు చెందిన ఫెమినిస్టు తస్లిమా నస్రీన్‌ను భారతదేశంలో స్త్రీవాదులు సమర్ధించకపోవడం రాజకీయాల ప్రభావమంటారు. అదే విధంగా తెహమీనా దుర్రాని (పాకిస్తాన్ రచయిత్రి) వ్రాసిన 'మై ఫ్యూడల్ లార్డ్' నవల ఇక్కడి స్త్రీ వాదులను ఏ మాత్రం కదిలించినట్లు కన్పించదు. కన్నడ ముస్లిం రచయిత్రి సారా అబూబకర్ 'నాదిరా' నవల ముస్లిం పితృస్వామ్యాన్ని ప్రశ్నించే యథార్థ జీవితాన్ని చిత్రించేది. ఇది ఇంగ్లీషు, తెలుగు భాషల్లోకి తర్జుమా అయింది. అట్లా మైనారిటీ స్త్రీలు కూడా తమదైన సమస్యలతో స్త్రీవాదంలో తమ గొంతును కలుపుతున్నారు.

1994ను యుఎన్ఓ కుటుంబ సంవత్సరంగా ప్రకటించి కుటుంబ వ్యవస్థకున్న ప్రాధాన్యాన్ని గుర్తించింది. మానవ సమాజానికి మానవ మనుగడకు ఆరోగ్యవంతమైన పిల్లల పెరుగుదల వుండాలంటే, కుటుంబ వ్యవస్థ స్థిరంగా వుండాలంటే ఆచరణ

సాధ్యమైన సంబంధాలు స్త్రీ పురుషుల మధ్య సాగాలి. కాని కుట్రలు కుతంత్రాలతో కూడిన రాజకీయాలు కాదు. స్త్రీలు పురుషుల మా హక్కులంటే మా హక్కులనే పోరాటాన్ని అశాంతిని ఆపవలసి వుంటుంది. అసౌమనస్య వాతావరణంలో మానవ జాతి మనుగడ సాగించలేదు. స్త్రీ, పురుషులు మానవతలో భాగమే. పురుషునితో పాటు స్త్రీకి స్వేచ్ఛ స్వాతంత్ర్యాలుండాలి. కాని సమస్యలన్నిటికీ పురుషుడే కారణమనడంలో కుటుంబంలో కలతలు సంఘర్షణలు ఏర్పడి సమాజ జీవితం విచ్ఛిన్నమయ్యే పరిస్థితి ఏర్పడుతున్నది. మానవ సంబంధాలు దెబ్బతినే పరిస్థితులు వచ్చాయి. స్త్రీ పురుషుల మధ్య ప్రేమానురాగాలు విచ్ఛిన్నమయ్యాయి. అప్పుడు స్త్రీకే దెబ్బరావచ్చును అది స్త్రీ వాదులు గుర్తించలేకపోతున్నారు. సామరస్యం, సుహృద్భావం లేకపోవడంతో అక్షరాస్యత, విజ్ఞానం అంతగా లేని బడుగు దేశాల్లో ఈ భావజాలం విపరీత పరిణామాలను అరాచకతను తెస్తుందని అంటున్నారు. ప్రపంచ నిధుల సహాయంతో బడుగు దేశాల్లోని అమాయక స్త్రీలపై తమ అభిప్రాయాలను రుద్ది కీర్తి, ఆర్థిక లాభాలు పొందాలనే తపన ఎక్కువైంది. ఈ ధోరణి స్త్రీ సంక్షేమం పేరుతో స్త్రీపై ఒత్తిడిని పెంచుతుంది. ఆధునికోత్తర స్త్రీవాదమని ఒకటి పాశ్చాత్య దేశాల్లో బయలుదేరి స్త్రీ, పురుషుల మధ్య పొత్తుతోనే సరియైన అవగాహనల మధ్యనే స్త్రీ సమానత సాధింపబడుతుందనే అభిప్రాయం కన్పిస్తున్నది. స్త్రీవాదులు తమ శరీరాలను అలంకరించుకోవడం ధోరణి ప్రవేశించింది. స్త్రీలకు సెక్స్ పునరుత్పత్తిలో నిర్ణయాధికారం, పిల్లల పెంపకంలో ఇంటి పనిలో పురుషుల పురుషాధిపత్యాన్ని నశింపజేస్తుందని స్త్రీవాదులంటున్నారు.

తెలుగులో వచ్చిన స్త్రీవాద కవిత్వంలోని కొన్ని భావాలు పదజాలం కొంత విమర్శకు గురయినాయి. ఒకప్పుడు దిగంబర కవిత్వం జుగుప్సను కలిగించే కవిత్వంగా విమర్శించబడిందో అదే విధంగా స్త్రీవాద కవిత్వం విమర్శకు గురయింది. యస్వీ, జ్వాలాముఖి వంటి అభ్యుదయ విప్లవ భావాలు గల విమర్శకులు స్త్రీవాద ధోరణిలోని అశ్లీలతను గురించి ప్రశ్నలు లేవనెత్తారు. రతి, ప్రసవం, అంగప్రవేశం, వీర్య వర్షం, స్వప్న స్ఖలనం వంటి పదాల ప్రయోగం అవసరమా అని, జుగల్‌బంది, లేబర్‌రూం మొదలయిన కవితల్లో కవయిత్రులు పురుషుని మీద చూపిన పగ కసిని ప్రశ్నించారు.

స్త్రీకి ప్రకృతి సహజమైన పిల్లల్ని కనే శక్తిని, స్థితిని అసహ్యించుకోవడం, మగవాళ్లను ఒక వర్గంగా, ఆడవాళ్లను ఒక వర్గంగా భావించడం, మగ పిల్లలను శత్రువర్గపు మొలకలుగా చెప్పడం, పురుషుని సుఖంకోసమే స్త్రీ శరీరం తయారు చేయబడిందని స్త్రీ శరీరాన్ని ద్వేషించుకోవడం, అవసరాల వేడి మాత్రమే దంపతుల మధ్య లైంగిక సంబంధాలకు ప్రాతిపదిక అవుతుందనం మొదలయిన విపరీత భావజాలం సహృదయుల సహృదయతను సంపాదించుకోలేకపోయింది. మొత్తంమీద తెలుగులో స్త్రీవాద కవిత్వం ఒక ఊపు ఊపింది. స్త్రీవాదం అచ్చమైన దేశీయమైన వరకట్నం దాంతో స్త్రీల మీద జరుగుతున్న హింస హత్యలు, ఆత్మహత్యలను పరిష్కరించలేక వైఫల్యం ఎదుర్కొంది. స్త్రీ ఆర్థిక స్వావలంబనం, ఆత్మవిశ్వాసం పెరిగే దిశగా స్త్రీవాదం నడువవలసి వుంది.

## దళిత స్త్రీ వాదం

బ్ల్యాక్ ఫెమినిజంలాగానే తెలుగులో దళిత స్త్రీవాదం ముందుకొచ్చింది. అగ్రవర్ణాల కవయిత్రులు దళిత స్త్రీల గోడును పట్టించుకోలేదనే వేదన, ఆక్రోశంతో దళిత స్త్రీలు తమ వేదనను తామే వ్యక్తీకరించుకోగల్గుతామని కవిత్వం కథలు వ్రాస్తున్నారు. స్త్రీ వాదంలో జండర్ వర్గంనే స్త్రీలు ఎదిరిస్తే దళిత స్త్రీలు జండర్ వర్గంతో పాటు కులం రంగులను ఎదిరించవలసి వస్తున్నది. కాబట్టి దళిత స్త్రీ తన వేదనను తనే సరిగ్గా వ్యక్తం చేసుకోగల్గుతున్నది. ఒకప్పుడు దళిత వర్గాల్లో స్త్రీకి స్వేచ్ఛ, సమానతలు నిర్ణయాధి కారాలుండేయని సంస్కృతీకరణంలో భాగంగా వాటిని వాళ్ళు కోల్పోయామనే బాధ దళిత స్త్రీ వాదంలో కన్పిస్తుంది. వాళ్ళ మతంలో అందరూ స్త్రీ దేవతలే. స్త్రీ దేవత శక్తిమంతమైంది. మగ దేవతలను ఎదిరించి ఓడిస్తుంది. అటువంటి స్త్రీ శక్తి ఇప్పుడు సంస్కృతీకరణంతో పురుషునికి లొంగి బానిస బతుకు ఈదవలసి వస్తున్నది. చివరకు మారు మనువు పోయే సంస్కృతి కూడా మాసిపోతున్నది. ఆధునికత దళిత స్త్రీల హక్కులను హరించేస్తున్నది.

*"తిరుగుబాటు ప్రకటిస్తున్నా*
*కుటుంబంలోని కుళ్ళుని కడిగి*
*సమాజంలోని దురహంకారాన్ని*

ఇక ఉతికి ఆరేస్తా..."

అంటుంది జాజుల గౌరి.

గోగు శ్యామల, మేరీ మాదిగ, జూపాక సుభద్ర, గూటాల శాంత కుమారి, సదాలక్ష్మి దళిత స్త్రీ అనుభవాన్ని కథల్లో, నవలల్లో, కవిత్వంలో, వ్యాసాల్లో బలంగా చెప్పారు. గోగు శ్యామల దళిత స్త్రీల రచనలను సేకరించి "నల్లపొద్దు" (2003) సంకలనంగా వేసింది. దీనిలో దళిత స్త్రీల చారిత్రక నేపథ్యం 1921-2002 మధ్యకాలంలోని దళిత స్త్రీల రచనలను పరిచయం చేసింది. జూపాక సుభద్ర దళిత స్త్రీల వ్యథలను కథల్లో గాఢంగా వ్యక్తం చేసింది. కాలమ్స్ వ్రాసింది. జాజుల గౌరి "మన్నుబిడ్డ, వాయినం" నవలలు "మన్నుబువ్వ" కథల సంపుటి ప్రచురించి దళిత స్త్రీల సమస్యలను చిత్రించింది.

## మైనారిటీ స్త్రీ వాదం

దళిత స్త్రీల తిరుగుబాటు లాగానే ముస్లిం మైనారిటీ స్త్రీలు తిరుగుబాటు నిరసనలు ప్రకటించారు. ముస్లిం రచయిత్రులు తమ సంస్కృతిలో వున్న స్త్రీ అవిద్య, బుర్ఖా, తలాఖ్, గృహహింస వంటి సమస్యలకు స్పందించి కవిత్వం, కథలు వ్రాసారు. మత శక్తుల దాడులను స్త్రీల మీద జరిపే అత్యాచారాలను నిరసించారు. షాజహానా, షంషాద్, షాహనాజ్ ఫాతిమా, యాస్మిన్ బేగం, ఎం.ఎస్.బేగం, జాకెరా, సలీమా మొదలైన రచయిత్రులు కవితలూ, కథలూ వ్రాస్తున్నారు. షాజహానా-

"ప్రపంచం మాయి పొరలో ఇరుక్కొని ఉమ్మనీరు తాగి
ఇవ్వాళ కాషాయం కక్కుతోంది

మా కాళ్ళ సందుల్లో చొచ్చి
మమ్మల్ని బరిబత్తెల పరిగెత్తించారే
అయినా
స్త్రీ తప్ప మగాన్ని క్షమించేదెవరు
ఎప్పటికీ ప్రపంచం
నా రొమ్ము తాగుతున్న పసిబిడ్డే"

అని తన "కాలీ దునియా' కవితలో వ్రాసింది.

## తెలంగాణ ప్రాంతీయ అస్తిత్వ వాదం

ఒక ప్రాంతం వాళ్ళు మరో ప్రాంతం మీద కూడా సామ్రాజ్యవాద పెత్తనం చలాయిస్తున్నారని తెలంగాణా కవులు, రచయితలు, మేధావులు తమ మీద జరిగే అధికారం పెత్తనాలను దోపిడీని నిరసిస్తూ తీవ్రంగా స్పందించారు. దాని ఫలితంగానే ప్రాంతీయ అస్తిత్వవాదం తెలంగా సాహిత్యంలో చోటు చేసుకుంది. 1952లో ఒకసారి, 1979లో పెద్ద ఉద్యమంగా తెలంగాణ ప్రత్యేక రాష్ట్ర ప్రకంపనలు జరిగాయి. 1990ల నుంచి ఇంతకుముందు లేని విధంగా కేవలం రాజకీయోద్యమంగా కాక మేధావుల, విద్యావంతుల, విద్యార్థుల, ఉద్యోగుల, సామాన్య జనులు అంతేగాక కవుల, రచయితల, కళాకారుల ఉద్యమంగా పెద్ద ఎత్తున లేచింది. సాంస్కృతిక, సాహిత్య కారులు ఉద్యమంలో పాల్గొనడం వల్ల 1990లో నాటి ఉద్యమం సాహిత్యంలో స్థానం సంపాదించుకొని ఒక వాదంగా బలంగా నిలబడింది. తరతరాల చారిత్రక రాజకీయ, సామాజిక కారణాల వల్ల రెండు ప్రాంతాల్లో భిన్న సంస్కృతులు ఏర్పడినందువల్ల ఏర్పడిన ఘర్షణ అది ఒక ఉద్యమం ఒక వాదంగా ఎదిగింది.

తెలంగాణ పట్ల పాలకుల వివక్షను, వలసాధిపత్యంపై నిరసనను, అన్యాయాలను, తెలంగాణ పల్లెల విధ్వంసం తెలంగాణ నీళ్ళను మళ్లించుకోవటం విషయాలను గూడ అంజయ్య, గోరటి వెంకన్న, బాలకిషన్, అందెశ్రీలు 'పాట' ప్రక్రియలో వ్రాసారు. గూడ అంజయ్య

"ఆంధ్రులేందిరో వాళ్ళ పాలనేందిరో
వలసలేందిరో వాళ్ళ మోసమేందిరో..

ఇంకా–

"అయ్యోనివో నువ్వు అవ్వోనివో...
ఇసుంటు రమ్మంటే ఇల్లంత నాదంటివి..."

అని పాటలో కవులు ప్రశ్నించారు. "తెలంగాణ నిలువెల్ల విప్లవాల గాయాల

వీణ" అన్నాడు అందెశ్రీ. పూర్వం తెలంగాణ విమోచనోద్యమంలో పాట ఎట్లా ప్రధాన పాత్ర ధరించిందో తెలంగాణ రాష్ట్ర సాధనలోనూ పాట ప్రధాన పాత్ర ధరించింది. ఈ తీవ్ర స్పందన తెలంగాణా ప్రాంతీయ అస్తిత్వవేదన వాదంగా కొత్తగా ముందుకు వచ్చింది. తెలంగాణా ప్రాంతీయవాదం ఇతర ప్రాంతాల్లో కన్నా బలంగా రావడానికి కొన్ని ప్రత్యేక చారిత్రక, సామాజిక, రాజకీయ కారణాలు పనిచేసాయి. ప్రపంచీకరణంలో "డయస్పోరా" అంతర్జాతీయంగా సాహిత్యంలో ప్రవేశించింది. అటువంటిదే తెలంగాణ సాహిత్యంలోను ప్రవేశించింది. తెలంగాణ కవికి తన ఊరు 'పల్లె' మీద ఎంత ప్రేమ మమకారమో ఏలేశ్వర నాగభూషణాచార్య కవితలో ఇట్లా వ్యక్తమైంది –

*"ఇప్పుడు పల్లె చిన్నెలు లేకున్నా*
*నా కళ్ళలోనే పల్లెను పదిలంగా దాచుకున్నాను*
*నా పల్లె ఆనవాల్లను హృదయ పేటిక మీద*
*మేకులా దిగ్గొట్టుకున్నాను."*

ప్రేమించిన పల్లెను విడిచిపెట్టి పట్నాలకు వలస పోవలసిన పరిస్థితిని తలచుకొని కవి కె.అంజయ్య బాధపడ్తున్నాడు–

*గ్రామాలు దిక్కులేని పక్షులై*
*పట్టణాలకు వలస*
*పచ్చదనము దొరకని మురికివాడల బస*

వర్షం రాగానే తెలంగాణ కవికి ఊరి చెరువు అందం ఇట్లా కన్పిస్తుంది–

*ఆనంక మా సెరువు సూడాల*
*సిక్కంగా కలిపి / ఉట్టి మీదుంచిన*
*గట్క కుండోలె ఉంటది* (యెన్నెం ఉపేందర్)

తను పుట్టిన ఊరును మల్లమల్ల యాదికి తెచ్చుకొని వేదన చెందటమే "నోస్తాల్జియా". ఆ ఊరును మరచిపోని జ్ఞాపకాలే "డయస్పోరా". ఈ రెండు తెలంగాణ

కవుల కవితల్లో ప్రతిబింబిస్తున్నాయి. ఇదే తెలంగాణ అస్తిత్వ వాదంలోని ఒక విలక్షణం.

తెలంగాణ ప్రజలు తమ భాష, సంస్కృతి సంపదల మీద జరిగే వివక్షతకు దోపిడికి స్పందించారు. తిరుగుబాటు చేసారు. కవులు, రచయితలు ఆవేశంతో పాటలు, కవిత్వం, కథలు వ్రాసారు. తెలంగాణ భాష మీద ఉన్న వివక్ష, వెక్కిరింత సాహిత్యమంటె వున్న నిరాదరణ తెలంగాణా సంపదలను దోచుకొని తెలంగాణను వలసభూమిగా చేసారన్న వేదన సాహిత్యంలో ప్రతిబింబించింది. తెలంగాణ పోరాటం నేపథ్యం వల్లనో యేమో తెలంగాణ ప్రాంతీయ వేదన తీవ్రంగా ఒక వాదంగా విన్పించింది. బృహత్ కవితా సంకలనాలు 'పొక్కిలి', 'మత్తిడి' 'మునుము' పేర్లతో వచ్చాయి.

తెలంగాణ రచయితలు తమ పల్లెలు విధ్వంసమయ్యాయని పల్లెల్లోని బాల్య మధురానుభూతులను 'నోస్టాల్జియా'లుగా వ్యక్తం చేసారు. తెలంగాణలో జరిగే ఆధునీకరణంతో పట్టణాలు పెరుగుతున్నాయి. పల్లెల నుంచి వలసలు పట్టణాలకు జరుగుతున్నాయి. వర్షాభావంతో నీటి కరువుతో వ్యవసాయాలు మూలనపడ్తున్నాయి. రైతులు, రైతు కూలీలు పనులు వెతుక్కుంటూ దూర ప్రాంతాలకు వలసలు పోతున్నారు. పల్లెలు పాడుపడ్తున్నాయి. రచయితలు ఆ 'ట్రౌమా'ను కవితల్లో కథల్లో చిత్రిస్తున్నారు. రాష్ట్రం రాజధాని నగరం తెలంగాణలో వుండడం చేత ప్రపంచీకరణం, అభివృద్ధి, ఆధునికీకరణం ఫలితాలను తెలంగాణ వాసులు అనుభవించినంతగా ఇతర ప్రాంతం వాళ్ళు అనుభవించలేదు. ఆ ఫలితాల ఫలంగానే ప్రాంతీయాభిమానం, భాష, సంస్కృతుల మీద అభిమానం సాహిత్యంలో గాఢంగా ప్రతిబింబించింది. ఇతర ప్రాంతాల వారి అధికారం, ఆధిపత్యం, వివక్ష, ఉపేక్షలు ఇతర ప్రాంతాల్లో లేవు. తెలంగాణ భాష సాహిత్యమన్నా వివక్ష, ఉపేక్షలు, వెక్కిరింతలు. సంస్కృతి అన్నా చిన్నచూపు. ఈ సామ్రాజ్యవాద పోరువల్ల కలిగిన వేదనల అభివ్యక్తి ప్రాంతీయతగా మిగిలించకుండా బలమైన ఒక వాదంగా రూపొందటానికి కారణమైంది. తమ భూములు ఆక్రమించబడినాయని నీటి దోపిడి అయిందని వ్యవసాయ భూములు పారిశ్రామిక వాడలుగా రిసార్టులుగా మారాయని చివరకు విత్తనాలు నకిలీ

అయ్యాయని బాధ రచయితల్లో కన్పిస్తుంది. ఆ బాధను తెలంగాణ కవులు గాఢంగా వ్యక్తీకరించారు.

*మార్యాగల్లల కాలువెట్టి/ అటువెట్టి ఇటువెట్టి*
*బహురూపుల బాగోతాలు గట్టి/ నీల్లు దొబ్బి ఊలు దొబ్బి*
*మా ఎవుసాన్ని/ చిల్లుల బొక్కెన చేసినందుకే*
*బలిమీటికి బొగ్గుబాయి పొక్కల్లోకి/ జారిన బంజరు బతుకు లయినం*

అని వఝల శివకుమార్ 'సింగరేణి సిచ్చు' కవితలో అన్నాడు.

నందిని సిద్ధారెడ్డి 'పెనుగులాట' కవితలో-

"ఉన్నతమైన ప్రేమలల్లుకోవాల్సిన ఇంట
ఊసులు బంతిపూల సొగసులు కావాల్సిన ఇంట
అన్యోన్య పరిమళాలు అవకాశాల్ని కుదపాల్సిన ఇంట
కాపురం వికృతి క్రీడా విశేషమైంది"

కలిసి బతుకవల్సిన చోట వివక్ష దోపిడీలు అశాంతి రేపాయంటాడు.

*మా జాగలు దోశి మమ్ముల్నె జీతం బెట్టుకుంటిరి*
*ఎడ్డేషం మాదాయె ఎట్టి శాకిరి మాదాయె...*

అని స్పందించాడు పప్పుల రాజిరెడ్డి. తెలంగాణ భాషను రచయితలు అభిమానంతో ప్రయోగించారు. ఇంతకుముందు రచయితలు తెలంగాణ భాషను వాడటంతో గుర్తింపు ఉండదేమోనని జంకేవారు. కాని ఇప్పుడు తెలంగాణ రచయితలు తెలంగాణ భాషలో జంకుగొంకు న్యూనతా భావం లేకుండా వ్రాస్తున్నారు.

*మా ర్యాగడి భూములన్నీ గుంజపుకున్నవ్*
*మాకు నీళ్ళ పారకమే తక్వ*
*ఉన్నే కాడికి నీవే గొంగడి జాపినవ్...*

అని అంటాడు అన్నవరం దేవేందర్ 'తొవ్వ'లో. ఇదే సామ్రాజ్యవాద దోపిడి పెత్తనం

1970ల్లోనే ఎన్.గోపి తెలంగాణ ఆత్మను నుడికారాన్ని పట్టుకొని "తంగేడు పూలు", "చుట్ట కుదురు" కవితా సంకలనాలు ప్రచురించాడు. పుట్టిన ఊరు మీద మమకారాన్ని, బాల్యం జ్ఞాపకాలు, పల్లె జీవితం నెనరు, పట్టణ జీవితంలోని ఏకాకితనం, కృత్రిమత్వం మీద నిరసనను తెలంగాణ నుడికారంలో మొట్టమొదటి సారిగా వ్యక్తీకరించిన కవి ఎన్.గోపి. తెలంగాణతనంతో వ్రాసిన మరోకవి దర్భశయనం, శ్రీనివాసాచార్య. వీళ్ళ కవిత్వంలో తెలంగాణ మట్టి వాసనలు నీటి రుసులు వుంటాయి. 1970ల్లోనే పంచరెడ్డి లక్ష్మణ 'ఇసిత్రం' దేవరాజు మహారాజు 'గుడిసెగుండె' వంటి తెలంగాణ కవితల సంపుటాలు వచ్చాయి. తర్వాత నందిని సిధారెడ్డి, అన్నవరం దేవేందర్, యెన్నెం ఉపేందర్, గ్యార యాదయ్య, కృష్ణమూర్తి యాదవ్, నమిలికొండ బాలకిషన్‌రావు, అన్వర్, బైరెడ్డి కృష్ణారెడ్డి, వేణు సంకోజు, పప్పుల రాజిరెడ్డి, నాళేశ్వరం, శంకరం, రత్నాకరరెడ్డి, వఝల శివకుమార్, అనిశెట్టి రజిత, పొట్లపల్లి శ్రీనివాసరావు, జూకంటి జగన్నాథం, ప్రసేన్, దొడ్డి రామ్మూర్తి, దాస్యం లక్ష్మయ్య, కందుకూరి దుర్గా ప్రసాద్, సుంకిరెడ్డి నారాయణరెడ్డి, జగన్, కందుకూరి శ్రీరాములు, పగడాల నాగేందర్, వరిగొండ కాంతారావు, జూలూరు గౌరిశంకర్ మొదలైన కవులెందరో కవితా సంపుటాలను ప్రచురించారు. దెంచనాల శ్రీనివాస్, అల్లం నారాయణ, గోపగాని రవీందర్, వేముగంటి మురళీకృష్ణ, పి.విద్యాసాగర్, కోట్ల వెంకటేశ్వరరెడ్డి, హనీఫ్, ఉదారి నారాయణ, పులిపాటి గురుస్వామి, చెరుకు సుధాకర్ మొదలైన కవులెందరో కవితలు వ్రాసారు. వీళ్ళందరి కవితల్లో ఆక్రోశం, ఆవేశం, ఆగ్రహం, నిరసనలు బలంగా వ్యక్తమవుతున్నాయి. వివక్షను ఎదురిస్తూ అఫ్సర్ అంటాడు–

నువ్వు చూపిస్తున్న దృశ్యంలో
బొమ్మని కాను
నువ్వు ఆడిస్తున్న మాటల్లో
మాటని కాను
నేను మాట్లాడిస్తానింక
నేను ఆడిస్తానింక

శ్రీదాస్యం లక్ష్మయ్య-

మాకెవ్వల సొమ్ము అక్కర్లేదు
మాయి మాకు దక్కుతెసాలు..
మా ఆరాటంల అలజడి వుంది..."

ఈ కవుల కథా రచయితల రచనల్లో తెలంగాణ భాష, యాస, నుడికారాలు కొట్టవచ్చినట్టు కన్పిస్తాయి. తొవ్వ, ఒక బాధగాడు, ఉసురు, సుక్కపొడుపు, రంపెకకోత, వరదగూడు, కర్రు పుట్టింది, దేవులాట, తొక్కుడు బండ, సిమాంట మొదలైన ఎన్నో కవితా సంపుటాలను ఈ కవులు ప్రచురించారు. తెలంగాణ నుంచి వచ్చినంత కవిత్వం ఇతర ప్రాంతాలనుంచి రాలేదనే చెప్పాలి. తెలంగాణ అస్తిత్వం బాధను సమస్యలను చిత్రిస్తూ తెలంగాణ భాషలో బి.ఎస్.రాములు, బోయ జంగయ్య, పులుగు శ్రీనివాస్, కాలువ మల్లయ్య, ఆడెపు లక్ష్మీపతి, పంజాల జగన్నాథం, బి.వి.ఎస్.స్వామి, బెజ్జారపు వినోద్ కుమార్, కె.వి.నరేంద్రర్, ముదిగంటి సుజాతారెడ్డి, బెజ్జారపు రవీందర్, దీవి సుబ్బారావు, కాసుల ప్రతాపసరెడ్డి, వేముల ఎల్లయ్య, జాతశ్రీ, ఐతా చంద్రయ్య, చొప్పదండి సుధాకర్, పి.చంద్, భూపాల్, బోధనం నర్సిరెడ్డి, పెద్దింటి అశోక్ కుమార్ నవలలు కథలు రచించారు.

1970 దశకంలో తెలంగాణ సాహిత్యమంటే విప్లవ సాహిత్యమే అని విమర్శకుల్లో పాతుకుపోయింది. సంస్కృతుల మధ ఘర్షణను, అభివృద్ధీకరణం, ఆధునికీకరణం తెచ్చిన క్షోభను తెలంగాణ రచయితలు కవిత్వంలో కథల్లో వ్యక్తీకరించి సార్వకాలికతను సార్వజనీనతను సాధించారు. ఆధునిక కాలంలో తెలంగాణ నుంచి ఎక్కువ సంఖ్యలో కవితలు, కథలు ప్రచురింపబడినాయంటే అతిశయోక్తి కాదు. లోకేశ్వర్ "సలాం హైద్రాబాదు" ప్రాంతీయ ఉద్యమం వల్ల వచ్చిన నవల. ఈ కవితల్లో భావాల్లో కొత్తదనం, వస్తువులో కొత్తదనం, ఉపమానాల్లో భావ చిత్రాల్లో కొత్తదనం కన్పిస్తుంది. అరిగిపోయిన భావ వ్యక్తీకరణలు లేవు. కవుల హృదయాల్లోంచి వచ్చిన ఆవేశమే కవితలుగా మారాయి. కాబట్టి కావ్య శాస్త్రాల లక్షణాల కన్నా మట్టివాసనలు ఎక్కువగా కన్పిస్తున్నాయి. అఫ్సర్, కె.శ్రీనివాస్, గుడిపాటి, కె.పి.అశోక్ కుమార్, సంగిశెట్టి

శ్రీనివాస్, వెన్నవరం ఈదారెడ్డి, జితేందర్ బాబు, సీతారామ్ పరిశోధకులుగా, విమర్శకులుగా సమీక్షకులుగా ఎదిగారు. అందెశ్రీ, గూడ అంజయ్య, దేశపతి శ్రీనివాస్, గోరటి వెంకన్న, విమల, సంధ్య బాలకిషన్, జంగిరెడ్డి పాడే పాటలు తెలంగాణ స్ఫూర్తిని బలంగా ప్రతిధ్వనించాయి. వాళ్ళ పాటలు శ్రోతలను కదిలించేయిగా వుంటాయి. తెలంగాణలో ఇంకా పాట బలంగా వుందనడానికి వీళ్ళే నిదర్శనం.

తెలంగాణ నుంచి కవులు 'దీర్ఘకవిత'లను అభిమానించారు. పదికిపైగా దీర్ఘకవితలు వచ్చాయి. గేయ పద్ధతిలో మొదటి నుంచి చివరి వరకు ఒక వస్తువును తీసుకొని వ్రాయటం దీర్ఘకవిత లక్షణం. ఇది ఖండకావ్యం కన్నా భిన్నమైంది. జూలూరు గౌరి శంకర్ "కాటు, నా తెలంగాణ", ఎన్.గోపి 'జలగీతం', అఫ్సర్ 'తెలంగాణ', సుంకిరెడ్డి నారాయణరెడ్డి 'దాలి', గ్యార యాదయ్య 'ఎర్కోషి, జగన్‌రెడ్డి 'ఇతిహాసం మా చేతిలో కుక్కపిల్ల', అల్లం నారాయణ 'ఒక మనాది' కాసుల ప్రతాపరెడ్డి 'గుక్క' శ్రీనివాస్ 'పడావు' దర్భశయనం శ్రీనివాసాచార్య 'ఆట', జూగంటి జగన్నాథం 'వాస్కోడిగామా', ఎలికట్టె శంకరరావు 'యాది', అనిశెట్టి రజిత 'లచ్చవ్వ', రామగిరి శివకుమార శర్మ 'తమ్ముడి కోసం', వెంకట్ 'వర్జి' మొదలైన దీర్ఘ కవితలు తెలంగాణ రాష్ట్ర సాధన ఉద్యమకాలంలో వచ్చాయి. వీటిల్లో ప్రాంతీయ స్పృహ, అస్తిత్వ పోరాటాల నేపథ్యం కన్పిస్తుంది.

విశాలాంధ్ర ఏర్పడిన సందర్భంలో నెహ్రూ సభలో మాట్లాడుతూ ఒక గడుసు పిల్లవాడికి ఒక అమాయకురాలైన పిల్లకు మధ్య వివాహం జరుగుతున్నది. కావాలంటే ఎప్పుడైనా తెంపుకోవచ్చును అని అన్నాడు. అదే నిజమైంది. అమాయకమైన పిల్ల మాటిమాటికి విడిపోతానని పిల్లవాని బాధలు పడలేనని అంటున్నది. ఆఖరికి 1990 దశకంలో తెలంగాణ ప్రత్యేక రాష్ట్ర ఉద్యమం ఆరంభమైంది. కవులు, రచయితలు, మేధావులు కళాకారులు ముందున్నారీ ఉద్యమంలో. తర్వాత కెసిఆర్ నాయకత్వం వహించి రాజకీయంగా నడిపాడు.

తెలంగాణ రచయిత్రులు తెలంగాణ రాష్ట్ర సాధన ఉద్యమ కాలంలో కథలు, నవలలు, సాహిత్య విమర్శలు, పాటలు, కవిత్వం చాలా సంఖ్యలో రచించారు.

పరిశోధనల్లోను ముందంజ వేశారు. రచయిత్రులు, తమ రచనలను అచ్చువేసుకోవటమే కాక ఎన్నో రచనలకు సంపాదకత్వం వహించి ప్రచురణ భారం వహించి అచ్చువేశారు. గోగు శ్యామల దళిత స్త్రీల –తరతరాల స్త్రీల రచనలను "నల్లపొద్దు" పేరుతో సంకలనం చాలా కృషి చేసి తీసుకువచ్చింది. ముదిగంటి సుజాతారెడ్డి "తెలంగాణ తొలి తరం కథలు (2002), తొలినాటి కతలు" (2005) ప్రచురించింది. 'ముద్దెర' పేరుతో తెలంగాణ ప్రాంతీయ అస్తిత్వ వాద విమర్శ వ్యాసాల సంకలనానికి సంపాదకత్వం వహించింది. తెలుగు విశ్వవిద్యాలయం తరపున 'నూరేండ్ల తెలుగు కథలు' (2011)కు సంపాదకురాలుగా వుంది. వట్టికోట ఆళ్వారుస్వామి 'జైలు లోపల' కథల సంపుటిని విమర్శనాత్మకమైన ముందుమాటతో (2009)లో అచ్చువేసింది. నిజామాబాదు నుంచి అమృతలత సంపాదకులుగా తెలంగాణ రచయిత్రుల కవిత్వాన్ని, కథలను 'గాయాలే గేయాలై' 'వెతలే కతలై' (2011) సంపుటాలు ప్రచురించింది. అనిశెట్టి రజిత ప్రధాన సంపాదకత్వంలో "ఉద్విగ్న, జిగర్" (2014) కవితా సంకలనాలు అపురూపమైనయి అచ్చయి వచ్చాయి. ఈ విధంగా రచయిత్రులు సంపాదకత్వంలో మంచి పుస్తకాలు రావటం ఎక్కడా జరగని విశేషం. తెలంగాణ రాష్ట్ర సాధన ఉద్యమంలో స్త్రీలు చాలా సంఖ్యలో పాల్గొన్నారు. మేధావులు, కళాకారులు, కథా రచయితలు, కవయిత్రులు కవిత్వం కథలు పాటలు విస్తృతంగా వ్రాసారు. గోలకొండ కవుల సంచిక ప్రచురించినప్పుడు 354 కవుల్లో పది మంది కవయిత్రులుండగా ఆ సంఖ్య ఇప్పుడు అనేక ప్రక్రియల్లో పాకి పెరిగింది. తెలంగాణ రాష్ట్ర సాధన ఉద్యమంలో పాలు పంచుకున్న విధంగానే తెలంగాణ స్త్రీలు రాజకీయరంగం మొదలుకొని అన్ని రంగాల్లో ప్రవేశించి తమ అస్తిత్వాన్ని, అస్మితను చాటుకుంటారు.

## ముగింపు

2014 జూన్ 2వ తారీఖునాడు ప్రత్యేక తెలంగాణ రాష్ట్రం ఏర్పడింది. ఎందరో త్యాగాల ఫలితంగా తెలంగాణ వచ్చింది. విద్యార్థులు, ఉపాధ్యాయులు, ఉద్యోగులు, మేధావులు, విద్యావంతులు, సామాన్య ప్రజలు ఈ ఉద్యమంలో పాల్గొని విజయవంతం చేసారు. కవులు, రచయితలు, పరిశోధకులు, కళాకారుల పాత్ర కూడా ఈసారి తెలంగాణోద్యమంలో ఉండటం గొప్ప విశేషం. తెలంగాణ రాష్ట్రం

అవతరణతో తెలుగు సాహిత్య చరిత్ర కొత్తవాద వివాదాలతో ధోరణులతో ముందుకు నడుస్తుంది. సాహిత్యం కొత్త బాటలు వేస్తు సాహిత్య చరిత్ర కొనసాగుతూనే వుంటుంది. కాలం సమాజాల అవసరాలకనుగుణంగా తెలంగాణ సాహిత్యం ముందడుగు వేస్తుంది!

# తెలంగాణ తెలుగు సాహిత్యంలో
# కథ

తెలంగాణ తెలుగు కథ సమగ్రమైంది. ఒక స్వతంత్రమైన భాషా సాహిత్యంలో ఒక ప్రక్రియలో ఎన్ని వాదాలు, ధోరణులు, స్వరాలు విన్పిస్తాయో తెలంగాణ తెలుగు కథలో అన్ని వాదాలు, ధోరణులు, స్వరాలు విన్పించాయి. కొన్ని వాదాలు, ధోరణులు, స్వరాలు తెలంగాణ "కథ" సాహిత్యంలోనే పుట్టాయి, వికసించాయి. తెలంగాణ తెలుగు కథ ఒక సమగ్రతతో వ్యుత్పన్నతతో కన్పిస్తున్నది. స్వతంత్రత, మౌలికతలు తెలంగాణ కథలో వున్నాయి.

ఆంధ్ర ప్రాంతాల సాహిత్యం ఇంగ్లీషు సాహిత్యం చేత ప్రభావితమై ఆధునికతలోకి అడుగు పెట్టింది. అంతేగాక ఒకప్పుడు యూరోపులో పురోగామి లక్షణంతో కొత్త వాదాలు, ప్రక్రియలతో అన్ని భాషా సాహిత్యాలకు అనుకరణీయంగా ఆదర్శంగా వున్న ఫ్రెంచ్ సాహిత్యం వంటిది భారతదేశంలో బెంగాల్ సాహిత్యం. అటువంటి బెంగాల్ సాహిత్యం చేత కూడా ఆంధ్ర ప్రాంతాల సాహిత్యం ప్రభావితమైంది. ప్రేరణనందుకుంది. బెంగాల్‌లో 1872లో పురాణచంద్ర చటర్జీ రాసిన "మధుమతి' మొట్ట మొదటి కథ. అయితే ఆ వెంటనే రవీంద్రనాథ టాగోరు "గుల్పగుచ్ఛ" అనే కథల సంపుటిని ప్రచురించాడు. దాంతోనే బెంగాల్ కథ ఒక స్థిరరూపంతో నిలబడింది. తెలుగులో మొట్టమొదటి ఆధునిక కథను రాసిన గురజాడ అప్పారావు రవీంద్రుని చేత చాలా ప్రభావితుడయ్యాడు. అందుకేనేమో తెలుగులో 'కథ' ప్రక్రియను తేవాలని కథలను రాసాడు. అయితే గురజాడ కన్నా ముందు కథ రాయాలనే ప్రయత్నాలు

చాలా మంది చేశారు. 1857 తర్వాత భారతదేశంలో ఆధునికతలో భాగంగానే అచ్చు యంత్రాలు వచ్చాయి. ఆ సమయంలో తెలుగులో విక్రమార్క కథలు, భోజరాజు కథలు, గులేబకావళి కథలు, చిలుక కథలు, పరమానందయ్య శిష్యుల కథలు, తాతాచారి కథలు వంటి కథల పుస్తకాలెన్నో సరళమైన భాషలో అచ్చయ్యాయి. పాఠకులు వాటిని విరివిగా చదివేవాళ్ళు. ఆ కథల పరివేశనం నుంచే "ఆధునిక కథ"కు పురుటి నొప్పులు మొదలయ్యాయి. సమకాలిక జీవితాన్నిసామాన్యుని సమస్యలను సరళమైన భాషలో రాయాలన్నదే ఆధునిక కథ ప్రధాన లక్షణం. అటువంటి 'కథలు' రాయాలనే ప్రయత్నం చేసి కృతకృత్యురాలయింది బండారు అచ్చమాంబ. ఆమె, తెలంగాణ వైతాళికులలో ఒకడైన 1901లో తెలంగాణలో భావ చైతన్యం తేవాలని గ్రంథాలయోద్యమాన్ని ప్రారంభించిన కొమర్రాజు లక్ష్మణరావు సోదరి. కొన్నాళ్ళు తెలంగాణలో పెరిగింది. భర్తతో నాగపూరులో స్థిరపడింది. తెలుగే కాక హిందీ మరాఠీ గుజరాతీ భాషలు నేర్చుకుంది. ఆమెకు సామాజిక, రాజకీయ స్పృహ అవగాహనలున్నాయి. సంఘ సంస్కరణల చేత ప్రభావితురాలయింది. ఆమె స్త్రీ జనోద్ధరణ భావాలు గల కథలను 1898 నుంచే రాసింది. 1901, 1902ల్లో ఆమె రాసిన "లలితా శారదలు, ధన త్రయోదశి" కథలు ఇప్పుడు దొరుకుతున్నాయి. ఆరంభ కథల్లో పరిణత శిల్పాన్ని ఆశించటం అత్యాశే అవుతుంది. అయినా అచ్చమాంబ కథలు సంఘ సంస్కరణ భావాలతో సరళ శైలిలో వున్నాయి. తెలంగాణ ఆడబిడ్డ అచ్చమాంబ తెలుగు కథకు ఆద్యురాలని చెప్పుకోవాలె.

నిజాం నిరంకుశ పాలనలో అక్షరాస్యత తక్కువ. ఇతర ప్రాంతాల వాళ్ళతో ఆదాన ప్రదానాలు లేవు. ఇంగ్లీషు మొదలైన సాహిత్యాల ప్రభావం ఇక్కడ లేదు. కాని తెలంగాణ గడ్డ మీద మొదటి కథ రాసిన మాడపాటి హనుమంతరావు తెలంగాణ విమోచనోద్యమంలో అగ్రేసరుడుగా వున్నాడు. ఆయన ప్రేమ్‌చంద్ ఉర్దూ కథల చేత ప్రభావితుడయ్యాడు. ఆయన రాసిన "హృదయశల్యము" మొట్టమొదటి తెలంగాణ గడ్డమీద వ్రాసిన తెలుగు కథ. ఆ కథలో రాణి రుద్రమదేవి పాత్రగా వుండటం చేత చారిత్ర కథ అనిపించవచ్చు. కాని అది కల్పిత కథ. సమకాలిక సమస్య. స్త్రీకి స్వేచ్ఛ, స్వాతంత్ర్యాలు కావాలని చెప్పే కథ. ఇది మచిలీపట్నం నుంచి వచ్చే గురజాడ

"దిద్దుబాటు" కథ అచ్చయిన ఆంధ్రభారతి పత్రికలోనే 1912 జనవరిలో అచ్చయింది. మాడపాటి రెండో కథ 'నేనే'లో హైమవతి తన భర్తను వేశ్యాగమనం నుంచి మళ్ళించి సంస్కరించే కథ. చమత్కారపూర్ణమైన సన్నివేశాలతో వుంది. తర్వాత మాడపాటి హన్మంతరావు ప్రేమ్‌చంద్ కథలను ఉర్దూ నుంచి స్వేచ్ఛానువాదం చేసాడు. ఆ తర్వాత నెల్లూరి కేశవస్వామి కూడా ప్రేమ్‌చంద్ కథలను అనువదించి పుస్తకంగా అచ్చువేసాడు. ఆ విధంగా తెలంగాణ "తెలుగు కథ" ఆరంభంలోనే ప్రేమ్‌చంద్ వంటివారు రాసిన అభ్యుదయ కథల చేత ప్రభావితమైంది.

తెలంగాణ నుంచి వచ్చిన మొదటి పత్రిక "హితబోధిని" (1913). దాన్ని నిర్వహించిన బండారు శ్రీనివాసరావు రాసిన కథ "రాజయ్య సోమయాజులు" ఆ పత్రికలో 1914లో అచ్చయింది. తెలంగాణ పత్రికలో అచ్చయిన మొదటి కథ అది. అది బాల్య వివాహాన్ని ఎదిరిస్తూ రాసిన కథ. చమత్కారపూర్ణమైన సన్నివేశాలు, వ్యంగ్య సంభాషణలు, నాటకీయతతో కథ ఆసక్తికరంగా సాగింది.

తెలంగాణలో పునరుజ్జీవనోద్యమం 1901లో గ్రంథాలయోద్యమంతో మొదలైంది. 1926లో ఆంధ్ర జనసంఘం 1930లో ఆంధ్రమహాసభ స్థాపనలతో ఆర్య సమాజ ఉద్యమంతో, కమ్యూనిస్టుల ఉద్యమంతో తెలంగాణలో సంస్కరణలు ఆరంభమయ్యాయి. ఆనాటి సంఘ సంస్కరణలను చిత్రిస్తూ తెలంగాణ నుంచి ఆరంభ కాలంలో కథలు చాలా వచ్చాయి. మాడపాటి, సురవరం ప్రతాపరెడ్డి, కాళోజి, వి.ఆర్.అవధాని వంటి వాళ్ళెందరో సంఘ సంస్కరణలను, స్త్రీ జనోద్ధరణను చిత్రించే కథలు రాసారు. సురవరం ప్రతాపరెడ్డి హుసేన్‌బీ, అపరాధం, వింతవిడాకులు వంటి ఎన్నో కథల్లో ఆనాటి స్త్రీల దుస్థితిని చిత్రించాడు. షబ్నవీసు 1921లో "బాలికా విలాపము" కథను స్త్రీ పునర్వివాహం వస్తువుగా చిత్రించాడు. కాళోజి "తెలియక ప్రేమ తెలిసి ద్వేషము"లో అంటరానితనాన్ని చిత్రిస్తూ రాసాడు. 1936లో ఆంధ్ర మహాసభలో బాధ్యతాయుత ప్రభుత్వం కావాలని నిర్ణయం జరిగింది. అప్పట్నుంచి బాహాటంగా రాజకీయాలను గురించి మాట్లాడటం నైజాంలో మొదలైంది. దాంతో ఏ అడ్డంకులు లేకుండా రచయితలు సామాజిక రాజకీయ సమస్యలను, ఉద్యమాలను

చిత్రిస్తూ గొప్ప కథలు రాసారు. నైజాంలో వృత్తి పనుల వాళ్ళ వెట్టిచాకిరిని, దొరల ప్రభుత్వోద్యోగుల అధికార అహంకారాన్ని చిత్రిస్తూ వట్టికోట "పరిగె", సురవరం "సంఘాల పంతులు", పొట్లపల్లి రామారావు "న్యాయం", ఆవులపిచ్చయ్య "దొరా", భాగ్యరెడ్డివర్మ "వెట్టిమాదిగ", కాంచనపల్లి "దావతు" వంటి ఎన్నో కథలు వచ్చాయి. రైతుల నుంచి బలంవంతంగా పంటపండినా పండకపోయినా శిస్తులను వసూలు చేసే దౌర్జన్యాలను చిత్రిస్తూ పి.వెంకటేశ్వరరావు "ఇది పంట కాదా", మంద రామారెడ్డి "సర్కారు కిస్తు" భాస్కరభట్ల 'ఇజ్జత్" కథలు రాసారు. నిజాంకు వ్యతిరేకంగా జరిగిన తెలంగాణ విమోచనోద్యమాన్ని, కమ్యూనిస్టుల సాయుధ పోరాటాన్ని, రజాకార్ల ఆగడాలను వర్ణిస్తూ తెలంగాణ కథకులు ఎన్నో కథలు రాసారు. పి.వి.నరసింహారావు "గొల్ల రామవ్వ", అయోధ్య రామకవి 'తెలంగాణ మంటల్లో', కె.ఎల్.ఎన్. "అమరవీరుడు, కాంచనపల్లి "ఆకలి", నెల్లూరి కేశవస్వామి "యుగాంతం" వంటి ఎన్నో కథలు వచ్చాయి. సామాన్యుల్లో సైతం ప్రతిఘటన చైతన్యం ఎలా పురివిప్పిందో "అమరవీరులు", "గొల్ల రామవ్వ" వంటి కథలు చిత్రించాయి. హిందూ ముస్లింల సఖ్యతను, సమైక్యతను చిత్రిస్తూ వట్టికోట, కాంచనపల్లి, నెల్లూరు కేశవస్వామి వంటి రచయితలు కథలు రాసారు. నిజాంతో వ్యతిరేకతే కాని ముస్లిం ప్రజలతో వైరమేమీ లేదని ఈ కథలు చాటాయి. ఫ్యూడల్ వ్యవస్థకు, నిజాంకు వ్యతిరేకంగా హిందూ ముస్లింలు ఏకమై పోరాడారు. కాంచనపల్లి చిన వెంకట రామారావు "చెరువొడ్డున" కథలో హిందూ ముస్లిం దొరలు నీటిని పొలాలకందకుండా ఎత్తువేస్తే హిందూ ముస్లిం రైతులు ఏకమై పోరాడి గెలిచే ఇతివృత్తం వుంది. ఆ విధంగా నైజాం పాలనలో ప్రజా జీవితాన్ని సమస్యలను అన్యాయాలను, దౌర్జన్యాలను రచయితలు అన్నివర్గాల దృక్పథం నుంచి కథలు రాసారు. ఈ కథలు గొప్ప శిల్పంతో వున్నాయి.

ఒకవైపు సంఘ సంస్కరణలు కథలుగా వచ్చిన కాలంలో – తెలంగాణలో "సాధన సమితి" ఏర్పడింది. ఆ సమితి సభ్యులు ఎక్కువగా "రొమాంటిసిజం" – కాల్పనిక వాదానికి సంబంధించిన కథలు రాసారు. బూర్గుల రంగనాథరావు, హీరాలాల్ మోరియా, భాస్కరభట్ల కృష్ణారావు, నందగిరి వెంకట్రావు, నందగిరి ఇందిరాదేవి, ధరణికోట శ్రీనివాసులు, ధవళా శ్రీనివాసరావు, వెల్దుర్తి మాణిక్యరావు

వంటి వాళ్ళెందరో కాల్పనికవాద కథలు రాసారు.

తెలంగాణ విమోచనం జరగగానే ఏర్పడిన ఆర్థిక మాంద్యం నిరుద్యోగం నైరాశ్యం విమోచనోద్యమంలో పాల్గొన్న వాళ్ళు ఎదుర్కొన్న పేదరికం వంటి సమస్యలను చిత్రిస్తూ ఊటుకూరు రంగారావు, హీరాలాల్ మోరియా, పైడిమర్రి వెంకట సుబ్బారావు, కె.లింగరాజు కథలు రాసారు. ఈ విభిన్న పార్శ్వం కూడా తెలంగాణ తెలుగు కథలో బాగా ప్రతిబింబించింది. 1920-56 మధ్య కాలంలో తెలంగాణలో తెలుగు కథలు ఎక్కువ రావడంతో ప్రచురణలు కూడా జోరుగానే సాగాయి.

తెలంగాణ నుంచి 1929లోనే కథనం మాండలికంలో రాసిన కథ ఎస్.బి.సీతారామావు "గరీబోన్ని" వచ్చింది. 1940లో చరుకుపల్లి రఘోత్తమరావు "కోవిల్లో" చరుకుపల్లి హరికృష్ణారావు "పల్లెబడి" కథలు కూడా కథనంతా మాండలికంలో రాసిన కథలు "కమతెమ్మరలు" కథా సంకలనంలో అచ్చుయ్యాయి. ఈ విధంగా కథనంతా మాండలికంలో రాయటం తెలంగాణలోనే ఆరంభమైంది. తర్వాత 1950, 60ల్లో సురమౌళి, గూడూరి సీతారాం, పి.వెంకటరామారావు, యశోదారెడ్డి మొదలైన వారు కథనంతా మాండలికంలో రాసారు. రచయిత్రుల్లో కథనంతా మాండలికంలో రాసిన ఏకైక రచయిత్రి యశోదారెడ్డి. సమకాలిక కాలంలో మారుతున్న పల్లెలను పల్లెటూరి జీవన సంస్కృతిని ఈ రచయితలు చిత్రించారు. ఈ రచయితల కథలు ప్రధాన స్రవంతి తెలుగు కథల్లో చేరలేదు. 1960ల్లో రచయిత్రులు రచనలు ముమ్మరంగా చేస్తున్న కాలంలో తెలంగాణ నుంచి యశోదారెడ్డి, మాదిరెడ్డి సులోచన, పొల్కంపల్లి శాంతాదేవి, ఇల్లిందల సరస్వతి, బొమ్మా హైమా దేవి రచనలు చేసి తెలంగాణ సాహిత్య గరిమను నిలిపారు.

తెలంగాణ తెలుగు కథ ఉనికిని వలస పాలకుల పాలనలో తన వైవిధ్యాన్ని, విశిష్టతను కోల్పోయింది. 1956 తరువాత ఒకరిద్దరు రచయితలు కథలు రాసినా తెలంగాణ జనజీవితాన్ని చిత్రించలేకపోయారు. దాంతో తెలంగాణ "తెలుగు కథ" తన ఉనికిని, అస్తిత్వాన్ని కోల్పోయింది. 1956లో వట్టికోట ఆళ్వారుస్వామి అచ్చేసిన "పరిసరాలు" కథల సంకలనమే తెలంగాణ తెలుగు కథ వైభవాన్ని చాటింది.

దాంతోనే ఆ వైభవం కనుమరుగైంది. ఉప్పెనలా వచ్చిన పరాయి సంస్కృతికి తెలంగాణ మళ్ళీ గురయింది. తన భాషా సంస్కృతిని విస్మరించింది. తెలంగాణలో కథే లేదన్నంతగా తెలంగాణ తెలుగు కథ విస్మృతి పాలయింది. 1970లో విరసం ఏర్పడి ఉత్తర తెలంగాణలో విప్లవోద్యమం ప్రారంభమైనపుడు అల్లం రాజయ్య, తుమ్మేటి రఘోత్తమరెడ్డి, సాహు, పి.చంద్, చెరబండరాజు, నిఖిలేశ్వర్ వంటి వాళ్ళు తెలంగాణ భాషలో మాండలికంలో తెలంగాణ ప్రజల పోరాటాలను, ఉద్యమస్ఫూర్తిని చిత్రిస్తూ కథలు రాసారు. అయితే 1940ల నాటి విప్లవోద్యమాగ్ని కణాలు ప్రజ్వరిల్లినప్పుడు కథలు వచ్చాయన్న స్పృహ వాళ్ళకున్నట్టు లేదు. తెలంగాణ తెలుగు కథకున్న గొప్ప వారసత్వపు పరిచయం వాళ్ళకు తెలియలేదనుకుంటాను. అస్సలు తెలంగాణ తెలుగు కథ విప్లవోద్యమంతోనే ఆరంభమైందన్నంతగా బలంగా విరసం రచయితలు కథలు రాసారు. దాంతో అందరూ తెలంగాణ తెలుగు కథ ప్రాచీన వైభవాన్ని విస్మరించే పరిస్థితి ఏర్పడింది. తెలంగాణలోనే మాండలికంలో, నిజాం వ్యతిరేకోద్యమ కాలంలోనే కథలు రాయబడినాయి అన్న సంగతి మరిచిపోయి విరసం రచయితలు తెలంగాణ మాండలికంలో రాయటాన్ని పాఠకులు, పత్రికల వాళ్ళు ప్రశ్నించారు. తెలంగాణ భాష అంటే వున్న వివక్ష ఉపేక్షలు బయటపడ్డాయి. పత్రికల వాళ్ళు తెలంగాణ మాండలికంలో రాస్తే అర్థం కాదు అని ప్రచురించుకోవడానికి ఆంక్షలు తెలిపారు. దాంతో తెలంగాణ రచయితల ఆత్మగౌరవం మేల్కొన్నది. 1960ల నుంచి రావిశాస్త్రి మొ॥న రచయితలు విరసం కాలంలో ఉత్తరాంధ్ర రచయితలు మాండలికంలో రాస్తే రాని ఆంక్షలు తెలంగాణ మాండలికంలో రాసినప్పుడు రావటం తెలంగాణ రచయితలను బాధ పెట్టింది. ఇందిరాగాంధీ విధించిన ఎమర్జెన్సీ నాటి రాజ్యం జులుంను చిత్రించే కథలు ఏ ప్రాంతం నుంచి రాలేదు. తెలంగాణలో తాడిగిరి పోతరాజు ఎమర్జెన్సీ నాటి కథలను 'కిటికి' కథా సంపుటిగా ప్రచురించాడు.

విప్లవోద్యమం స్ఫూర్తితో తిరుగుబాటు ధోరణులను చిత్రిస్తూ బి.ఎస్.రాములు, వుప్పల నరసింహం, దేవరాజు మహారాజు, పులుగు శ్రీనివాస్, సదానంద శారద, భూపాల్, కాలువ మల్లయ్య వంటి రచయితలు తెలంగాణ భాషలో కథలు రాసారు. ఆ విధంగా ఉత్తరాంధ్రలో కన్నా విప్లవ కథ ఎక్కువ సంఖ్యలో విభిన్న దృక్కోణాలతో

వైవిధ్యంతో తెలంగాణ నుంచి వచ్చింది. 1990ల్లో అక్షరాస్యత పెరిగింది. దాంతో ఏ ప్రాంతంలో జరగని విధంగా అన్ని సమాజాల నుంచితెలంగాణ రచయితలు బయలు దేరారు. సమాజం ప్రజల జీవితాలను కథల్లో చిత్రించారు. తెలంగాణ అస్మితను, తెలంగాణ ఆత్మగౌరవాన్ని నిలబెట్టాలనే పట్టుదలతో తెలంగాణ భాషలోనే కథలు రచించారు. జీవనోపాధికి పట్నం వలస వచ్చిన వాళ్ళు పల్లెల మీద అనురాగం, బాల్యం నాటి మధుర స్మృతులను, భాషాభిమానం తెలంగాణ సంస్కృతిపై అభిమానం వ్యక్తం చేస్తూ కథలు రాసారు. ఈ భావజాలమంతా ఒక సైద్ధాంతికతను పొందింది. అదే తెలుగు కథలో "తెలంగాణ అస్తిత్వవాదం"గా రూపుదిద్దుకుంది. ఈ అస్తిత్వ వాదంలో ఆంధ్రప్రాంతాల భాషా సంస్కృతుల వల్ల తమ ఉనికి, అస్తిత్వం లుప్తమౌతుందన్న ఆక్రోశం చోటు చేసుకుంది. ప్రపంచీకరణంతో తమ భాషా సంస్కృతులు తుడిచివేయబడ్డాయి అన్న బడుగు దేశాల భయం ఆక్రోశాలు, వివిధ దేశాల నుంచి వలసపోయిన ప్రజలు ఇంగ్లీషు రచనల్లో తమ స్థానిక జీవితం మీద ప్రేమానురాగాలు "నోస్టాల్జియా"లను ప్రకటించే "డయస్పోరా"లు తెలంగాణ ప్రాంతీయ వాదంలో చోటు చేసుకొని సమానంగా కన్పించటంతో ఆ వాదం పెద్ద "కాన్వాసు"ను సంపాదించుకొని సమగ్రవాదంగా నిలిచింది. ఉత్తరాంధ్ర, ఉత్తరకోస్తా, దక్షిణ కోస్తా, రాయలసీమల్లో కన్పించే ప్రాంతీయ, స్థానికత, క్షేత్రీయతలకన్నా తెలంగాణ ప్రాంతీయ వాదం ఒక పార్శ్వ చిత్రణ మాత్రం కాక భిన్న పార్శ్వాల ప్రాంతీయ, జాతీయ, అంతర్జాతీయ భావజాలాలతో సమగ్ర సైద్ధాంతిక స్వరూపాన్ని పొందింది. తెలుగు సాహిత్యంలో ఒక నూతన వాదం ప్రాంతీయ అస్తిత్వ వాదంగా అవతరించింది.

తెలంగాణ భాషా సంస్కృతుల మీద అభిమానం, తెలంగాణ ప్రజా జీవితాన్ని, వ్యవసాయం వృత్తి పనుల విధ్వంసం, వలసలు, సెజ్‌ల పేరుతో భూమి అపహరణలు, అమ్మకాలు, భూసేకరణలు, భూములను కోల్పోయిన వాళ్ళ వెతలను, నీటి సమస్యను చిత్రిస్తూ పెద్దింటి అశోక్ కుమార్, బి.ఎస్.రాములు, కాలువ మల్లయ్య, కాసుల ప్రతాపరెడ్డి, జాతశ్రీ, దిలావర్, బోధనం నర్సిరెడ్డి, మేరెడ్డి యాదగిరిరెడ్డి, బెజ్జారపు రవీందర్, బెజ్జారపు వినోద్ కుమార్, దొరవేటి, పసునూరి రవీందర్, అంబల్ల జనార్ధన్, కె.వి.నరేందర్, ఉదయ మిత్ర, జీవన్, నేరెళ్ళ శ్రీనివాస గౌడ్, ఎలికట్టె శంకర్రావు,

బి.వి.ఎస్.స్వామి, పంజాల జగన్నాథం, ఐతా చంద్రయ్య, శిరంశెట్టి కాంతారావు, చిన్నయ్య, గీతాంజలి, అనిశెట్టి రజిత, ముదిగంటి సుజాతారెడ్డి, కరుణతాయారు, సి.హెచ్.మధు మొదలైన రచయితలెందరో కథలు రాసారు. రాస్తున్నారు. 1990ల నాటి వరకు తెలంగాణ కథ అంటే కేవలం పోరాట కథ తప్ప వేరే లేదన్న భ్రమను తొలగిస్తూ ఈ రచయితలు తెలంగాణ తెలుగు జనజీవితపు భిన్న పార్శ్వాలను చిత్రిస్తున్నారు. తెలంగాణ తెలుగు కథకున్న మరో ప్రత్యేకత విశిష్టత ఏమంటే అన్ని సమాజాల నుంచి రచయితలు బయలుదేరి సాహిత్య సృజన చేసి సమాజ చిత్రణను సమగ్రం చేస్తున్నారు. ఇటువంటి అన్ని సమాజాల సమగ్ర చిత్రణ ఇతర ప్రాంతాల్లో కన్పించదు. ఆంధ్రప్రాంతంలో ఏదో ఒక్క సమాజం చదవటం రాయటం వృత్తిగా కలిగి వున్న కాలంలో అక్కడ కథ కేవలం ఒకసమాజం ఆ సమాజానికి చెందిన సమస్యలను ఆచార వ్యవహారాల సమస్యలను మాత్రమే చిత్రించింది.

అదే సమయంలో నిజాం పాలనలో 1956 కు పూర్వం తెలంగాణలోఎక్కువ మంది కథకులు అగ్రకులాల వాళ్ళు అయినా సామాన్యుని సమస్యలను, శోషణలను, వెతలను, దోపిడీలను, అన్యాయాలనుచిత్రించారు. అది ప్రేమ్‌చంద్ వారసత్వం, అభ్యుదయ భావాల ప్రభావం, కమ్యూనిస్టు ఉద్యమం కారణాలని చెప్పాలె. ఆ కాలంలోనూ కింది వర్గాల నుంచి రచయితలుండటం కూడా గమనించదగిన విషయం! ఇంకా 1956కు పూర్వం తెలంగాణ తెలుగు కథకులు ఏ విపరీతాన్నయినా విమర్శించడానికి వెనుకాడలేదు. ప్రతిమ “నిట్టూర్పు”, “సురమౌళి “అంగుడుపొద్దు” వట్టికోట “మాకంటె మీరేంనయం” కథల్లో కమ్యూనిస్టు పార్టీ ప్రజాస్వామ్య విలువలను గౌరవించకపోవడం, పేదల కోసం ఏర్పడిన పార్టీ పేదలను పట్టించుకోకపోవటం, చెప్పేదొకటి చేసేదొకటిగా వుండే నీతిని విమర్శిస్తూ కథలను వ్రాసారు. ఇటువంటి విమర్శనా పార్శ్వం మనకు తెలుగు కథ ప్రధాన స్రవంతిలో కన్పించదు.

తెలంగాణ తెలుగు కథలో ప్రాంతీయ అస్తిత్వవాదం కొత్తగా ఉద్భవించటమే కాక అంతకుముందున్న స్త్రీవాదం, దళితవాదం, మైనారిటీ వంటి అస్తిత్వ వాదాలు కూడా కావలసినంతగా తెలంగాణ కథలో ప్రాధాన్యం వహించాయి. ఆ వాదాల్లో “భిన్న స్వరం” వినిపించటం తెలంగాణ తెలుగు కథకున్న విశేషాల్లో ఒకటి. 1932లో

భాగ్యరెడ్డి వర్మ "వెట్టిమాదిగ" కథ వ్రాసాడు. ఇది దళితుడు వ్రాసిన మొట్టమొదటి దళిత కథ. స్త్రీవాదం స్త్రీ పురుషుల మధ్య సహయోగం ఉండాలని, పురుషుల తోడు లేందే స్త్రీ చైతన్యం, స్త్రీ స్వేచ్ఛ సాధ్యం కాదన్న భావజాలం తెలంగాణ స్త్రీవాదంలో చోటుచేసుకుంది. ఈ సందర్భంలో వట్టికోట 1950ల్లోనే స్త్రీవాద భావజాలాన్ని చిత్రిస్తూ "అవకాశమిస్తే" కథను స్త్రీల పక్షంగా రాయటం ఒక విశేషం. దళిత వాదంలోనూ కసికక్షలకన్నా శాంతి సమానత సహజీవన భావాలను తెలంగాణ దళిత రచయితలు బోయ జంగయ్య, వేముల ఎల్లయ్య, యెన్నెం ఉపేందర్ భూతం ముత్యాలు, కదిరె కృష్ణ వంటివాళ్ళు తమ రచనల్లో వ్యక్తం చేసారు.

ముస్లిం మైనారిటీ వాదం తెలంగాణలోనే పురుడు పోసుకున్న నూతన వాదం. ముస్లింలు ప్రధాన స్రవంతిలో ప్రధాన జనజీవనంలో స్థానాన్ని కోరుతూ తమవైన సమస్యలను, వేదనలను చిత్రిస్తూ కథలు రాసారు. స్కైబాబా, అఫ్సర్, అన్వర్, అలీ గౌసుద్దీన్, మహ్మద్, ఖాజా, రహమతుల్లా వంటి రచయితలెందరో ఈ భావజాలాన్ని చిత్రిస్తూ మంచి కథలు రాసారు. తెలంగాణ కథలో మరో ప్రత్యేకత విశిష్టత. ఏమంటే దళిత వాదంలో స్త్రీ స్వరాన్ని వినిపిస్తూ జాజుల గౌరి, సుభద్ర, గోగు శ్యామల, శాంత కుమారి, మేరీ మాదిగ బలమైన కథలు రాసారు. అదే విధంగా ముస్లిం వాదంలో స్త్రీ స్వరాన్ని వినిపిస్తూ షాజహానా, పర్వీన్ కథలు రాసారు.

ఎన్నో వాదాలు, వాదాల్లో భిన్న ధోరణులు భిన్న స్వరాలు, నూతన వాదాల నిర్మాణం తెలంగాణ తెలుగు కథల్లో చోటు చేసుకున్నాయి. ఒక స్వతంత్రమైన భాషా సాహిత్యం ఎంత విస్తృతమైన భావజాలంతో ఎదుగుతుందో తెలంగాణ తెలుగు కథ అంత విస్తృత భావజాలంతో ఎదిగి ఒక సమగ్ర కథా సాహిత్యంగా నాటికి నేటికి నిలిచింది. తెలంగాణ తెలుగు కథ తనదైన చారిత్రక భౌగోళిక సందర్భంలో తనదైన నేపథ్యంలో పుట్టి సంపూర్ణంగా వికసించింది. మొదటి నుంచి తెలంగాణ తెలుగు కథ ఇతర ప్రాంతాల తెలుగు కథకన్నా భిన్నమైన ఉనికిని, మౌలికతను, స్వతంత్ర అస్తిత్వాన్ని కలిగి వుంది. విభిన్న భావజాలంతో వస్తు వైవిధ్యంతో వైశిష్ట్యంతో భాష భావ వ్యక్తీకరణలతో, శిల్ప నిర్మాణంతో తెలంగాణ తెలుగు కథ ప్రపంచంలోని ఏ గొప్ప సాహిత్యంలోని కథతోనైనా పోటీ పడేంతగా ఉన్నత దశను చేరుకుంది.

## తెలంగాణ తెలుగు సాహిత్యంలో

# నవల

తెలంగాణలో పాట కవిత్వం కథలు ప్రక్రియకంటే 'నవల' ప్రక్రియ వయస్సులో చిన్నది. తెలుగు ప్రధాన స్రవంతి నవల కంటే తెలంగాణలో నవల 40 సంవత్సరాలు ఆలస్యంగా ప్రారంభమైంది. చాలా మెల్లమెల్లగా వికసించింది. అయినా పరిమాణంలో, వస్తువులో, శిల్పంలో ఇతర ప్రాంతాల నుంచి వచ్చిన నవలల కంటే తెలంగాణ నవలలు ఏ మాత్రం తక్కువగా లేవు. అసలు తెలంగాణ నుంచి వచ్చిన నవలల గురించి ఇంతవరకు మనం అంత 'సీరియస్'గా పట్టించుకోలేదమోననిపిస్తుంది. కొంతవరకు వరకు ప్రధాన స్రవంతిలో వచ్చిన కోస్తా ప్రాంతపు నవలలను చదవటంలో, వాటిని గురించే చర్చించటంలో మునిగిపోయాం. కాని ఈ ప్రాంతపు చారిత్రక సామాజిక నేపథ్యంలో వికసించిన, ఈ ప్రాంతపు పరివేశనంలో రచింపబడిన నవలలను మనం మనసుపెట్టి చదువలేదు, అధ్యయనం చేయలేదేమోననిపిస్తుంది. ప్రాంతీయంగా, వచ్చిన కథలు, కవిత్వం నవలలు మొదలైన ప్రక్రియలకు ప్రధాన స్రవంతి సాహిత్యం. ప్రాంతీయంగా ముఖ్యంగా నిజాం ఆంధ్రుల చారిత్రక భూమిక నుంచి వచ్చిన రచనలు భిన్నమైన అభివ్యక్తి వస్తువులతో, రావటంతో ప్రధాన స్రవంతి సాహిత్య అధ్యయనం చేసే వాళ్ళకు ఆ చారిత్రక భూమిక అనుభవంలో లేకపోవటం చేత వాళ్ళ దృష్టికి ఈ తెలంగాణ నవలలు పరాయీకరణం పొందుతున్నాయి. ఇంకో ముఖ్య విషయం కోస్తా నవలలో చిత్రింపబడిన బ్రాహ్మణ కుటుంబాల జీవితం, సమస్యలు, వాతావరణం తెలంగాణ నవలల్లో లేకపోవటం కూడా పట్టించుకోక పోవటానికి, పరాయీకరణం పాలు కావటానికి కారణమని చెప్పాలె. 1956లో ఆంధ్రప్రదేశ్ అవతరణం జరిగిన తర్వాత కూడా అంతకుముందు తెలంగాణ సాహిత్య

రాజకీయోద్యమాల్లో సక్రియులై పని చేసిన వట్టికోట ఆళ్వారు స్వామి, బూర్గుల రంగనాథరావు, నెల్లూరు కేశవస్వామి, కాంచనపల్లి, భాస్కరభట్ల వంటి వాళ్ళెందరో జీవించి వున్నారు. అయినా వాళ్ళు తెలంగాణ రచయితలను సాహిత్యాన్ని ప్రధాన స్రవంతిలో కలుపలేకపోయారు. ప్రధాన స్రవంతిలోని రచయితలతో కలిసి పని చేయలేకపోయారు. అందుకు కారణం ఒకటి – ఈ రచయితల రచనల నేపథ్యం భిన్నమైంది. వీళ్ళ జీవితచిత్రణలో కవిత్వం కథల్లో, పాటల్లో వస్తువు భిన్నమైంది. తెలంగాణ చారిత్రక భౌగోళిక సందర్భాన్ని అక్కడి నుంచి వచ్చిన రచయితలు జీర్ణించుకోలేకపోయారు. తెలంగాణ పోరాట కాలం నాటి వ్యథలను ఉద్యమాన్ని అక్కడి రచయితలు పత్రికల్లో వార్తలుగా చదివి కవిత్వం, కావ్యాలు, కథలు, నవలలు వ్రాసారు. కాని వాళ్ళకు సంపూర్ణమైన సానుభూతి సహానుభూతి లేవు. వాళ్ళది పార్టీ కండ్లగంతలు కట్టుకున్న దృష్టేగాని ఇక్కడి ప్రజల పోరాటంతో సంపూర్ణ అవగాహన గాని 'ఇన్‌వాల్వ్‌మెంటు' గాని లేవు. అందుకే 1956 తర్వాత ఇక్కడికి వచ్చిన ప్రధాన స్రవంతి కవులు, రచయితలు ఇక్కడి సాహిత్య గరిమను గుర్తించలేకపోయారు. స్వీకరించలేకపోయారు. ప్రధాన స్రవంతిలో ఇక్కడి సాహిత్యం ఎక్కడ ఏ విధంగా ఇముడుతుందో ఆలోచించలేకపోయారు. ఇక్కడి భాషను గౌరవించలేకపోయారు. ఆ భాషలో అప్పటికే కథ, కవిత్వం, పాట, నవలలు వంటి ప్రక్రియల్లో సాహిత్య సృష్టి జరిగిందని అందరూ విస్మరించారు. రెండోది – ఇక్కడి రచయితల్లో గాని అక్కడి రచయితల్లో గాని బ్రాహ్మణ వర్గానికి చెందిన వాళ్ళెక్కువగా వున్నారు. చదువుకున్న తీరిక వున్న పాఠకులు అక్కడ వున్న వాళ్ళు తెలంగాణలో లేరు. వాళ్ళ "పర్‌స్పెక్టివ్" పరిప్రేక్ష్యం వేరేగా వుంటుంది. బ్రాహ్మణ వర్గాన్ని వాళ్ళ సమస్యలను వాళ్ళ జీవిత విధానాన్ని చిత్రించటం పాత్రలు, సంభాషణలు అంతా వేరే రకమైన పరివేశనంతో ఉంటాయి. తెలంగాణ రచయితల్లో ఆ పరివేశనం లేదు. వాళ్ళది ఉద్యమాల్లో మగ్గిన, ప్రజాసామాన్యాన్ని చిత్రించే దృష్టి. కాని ఎప్పుడైతే ఇక్కడి రచయితలకు ఆ రచయితలతో సంబంధం ఏర్పడిందో ఇక్కడి బ్రాహ్మణులు ఇన్నాళ్ళు తమకు లేని బ్రాహ్మణాధిక్య భావనలోకి నెట్టబడ్డారు. ఇంతవరకు తాము చేసిన రచనల విషయాన్ని గాని నడిపిన ఉద్యమాలను సాహిత్య సంస్థలను గురించి గాని

విస్మరించదలచుకున్నారు. విస్మరించారు. అక్కడి నుంచి వచ్చిన కవుల రచయితల ఆధిపత్యం ఇక్కడి భాషను కించపరచటం చూచి వాళ్ళు ఎదుర్కొనేది పోయి వాళ్ళ భాషలో మాట్లాడటం వాళ్ళ మధ్య పేరు సంపాదించటానికి, వాళ్ళలాగా వాళ్ళ లాంటి వస్తువుతో రాయటం మొదలు పెట్టారు. దాంతో తెలంగాణ ఇన్నాళ్ళ సాహిత్యం విస్మృతమైంది. తెలంగాణ తన అస్తిత్వం కోల్పోయింది. అక్కడి వాళ్ళతో మమేకమై వాళ్ళలాగ సాహిత్య సృష్టి చేయలేదనే న్యూనతా భావంలోకి వెళ్ళిపోయారు. వాళ్ళ ముందు తమ ప్రత్యేక అస్తిత్వాన్ని చాటుకొని గర్వంగా నిలబడలేకపోయారు. 1956ల నుంచి 1980లో విప్లవోద్యమం మధ్యకాలంలో కొంతమంది ప్రసిద్ధ రచయితలున్నా వాళ్ళు భాష నుడికారంలో గాని వస్తువు, పాత్రల పేర్లు స్థలాలు ఏ విషయంలోనూ తెలంగాణతనాన్ని పాటించలేదు. ఆ సమయంలోనే తెలంగాణ తొలితరం రచయితల రచనలు, సాహిత్యం అంతా విస్మృతమైంది. విప్లవోద్యమకాలం నుంచి మాత్రమే తెలంగాణలో కథ, నవల వంటి ప్రక్రియలు ఆరంభమయ్యాయన్న తప్పు అభిప్రాయాలు వ్యాప్తిలోకి వచ్చాయి. తెలంగాణ తన అస్మిత అస్తిత్వం నిలుపుకోవటం గర్వంగా నిలబడటం జరుగలేదు. తెలంగాణలో తమ అస్తిత్వాన్ని వెతుక్కోవటం 1995 నుంచి తెలంగాణ ప్రాంతీయ అస్తిత్వ వేదనావాదంతో ఆరంభమైంది. ఇదే సమయంలో తెలంగాణాభిమానులు 1956కి పూర్వం తెలంగాణ చరిత్రను సాహిత్య ప్రక్రియలను సాహిత్య వైభవాన్ని సాంస్కృతిక గరిమను వెదికి వెలికి తీసి తెలంగాణ అస్తిత్వ గౌరవాన్ని నిలపటానికి ప్రయత్నాలు చేస్తున్నారు. నూటికి నూరుపాళ్లు సఫలమవుతున్నారు. ఇది తెలంగాణలో మరో పునరుజ్జీవనోద్యమమని చెప్పవచ్చును. ఇటువంటి తరుణంలో తెలంగాణ నుంచి వచ్చిన నవలలు చరిత్రను ప్రత్యేకతను నిలుపవలసిన అవసరం ఉంది.

తెలంగాణలో ఒక విధంగా చూస్తే 'నవల' ప్రక్రియ 1860లోనే పుట్టింది. అది ఆశ్చర్యం కలిగించే విషయమే! నల్లగొండ జిల్లా హుజూర్‌నగర్ ప్రాంతంలో పుట్టిన తడకమళ్ళ కృష్ణారావు "కంబుకంధర చరిత్ర" తెలంగాణ నుంచి వచ్చిన మొదటి నవల. 1860 దీని రచనాకాలం. 1860లోనే ఆయన "కామరూపకథ" అనే రచన కూడా చేసాడు. ఈ రెండు రచనల్లో ఆధునిక నవలా లక్షణాల బీజాలు

కన్పిస్తున్నాయి. కాబట్టి 1872లో నరహరి గోపాలకృష్ణమశెట్టి రాసిన "రంగరాజచరిత్ర" 1878లో వీరేశలింగం పంతులు రాసిన "రాజశేఖరచరిత్ర" కంటే ముందే తెలంగాణ ప్రాంతంలో నవలా లక్షణాలున్న ఈ రెండు రచనలు వచ్చాయి. గోపాలకృష్ణమ శెట్టి తన రచనను "నవీన ప్రబంధము" అని పిలిస్తే వీరేశలింగం తన రచనను "వచనప్రబంధము" అని పిలిచాడు. తడకమళ్ళ కృష్ణారావు తన రచనలను "వచన ప్రబంధము" అనే పేర్కొన్నాడు. వీటి రాతప్రతులను డా. సుంకిరెడ్డి నారాయణరెడ్డి మద్రాసులోని ప్రాచ్యలిఖిత భాండాగారంలో చూసాడు. రాతప్రతుల వర్ణనాత్మక పట్టిక (డిస్క్రిప్టివ్ క్యాటలాగు)లో వాటిని "నవలలాంటిది" అనే రాసారట. ఆ తరవాత తడకమళ్ళ కృష్ణారావు "తెలుగు వెలుగు ముగుదకత" అనే వచన ప్రబంధాన్ని రచించాడు. అది ముద్రితమైంది. దాని రచనాకాలం 1872 తర్వాత అని తెలుస్తున్నది.' దీనిలోను నవలా లక్షణాలు కనిపిస్తున్నాయి. దీని ప్రతి హైదరాబాదు ఆర్కైవ్స్‌లో ఉంది.

ఆ విధంగా నవలారచనకు బీజాలు తెలంగాణాలో బ్రిటిషాంధ్రలో కంటే ముందే పడినా గ్రంథాలయోద్యమం, నిజాం వ్యతిరేక పోరాటం వంటి వివిధ ఉద్యమాల వల్ల బృహత్ వచన రచన అయిన నవలా ప్రక్రియపైన రచయితలు దృష్టి పెట్టలేదు. అంతేగాక ఇక్కడ అక్షరాస్యులు తక్కువ తద్వారా పాఠకులు తక్కువ. ప్రచురణ కార్యక్రమాలు తక్కువ. అందువల్ల నవలా ప్రక్రియ ఎక్కువ వికసించలేకపోయింది. పాట, కవిత్వం, కథ వికసించినంతగా, ఎక్కువ పేజీలు ఆక్రమించే నవలా ప్రక్రియకు దోహదం జరుగలేదు.

1922లో శేషభట్టరు వేంకటరామానుజాచార్యులు 'ప్రాకృత దాంపత్యము' అనే నవలను వ్రాసి ప్రచురించాడు. అది నల్లగొండలోని ఉస్మానియా ముద్రణాలయంలో ముద్రింపబడిందని కాసుల ప్రతాపరెడ్డి తన "తెలంగాణ నవలలు" అనే వ్యాసంలో తెలిపాడు. 1922 నాటికి ఈ ఆధునిక ప్రక్రియకు తెలంగాణలో 'నవల' అన్న పేరు స్థిరపడింది. కాబట్టి రచయిత తన 'ప్రాకృత దాంపత్యము'ను నవల అనే పిలిచాడు.

1922కు పూర్వమే ఒద్దిరాజు సోదరులు నవలలు రాశారు. వరంగల్ జిల్లా

ఇనుగుర్తి గ్రామం నుంచి 1922లో "తెనుగు పత్రిక" స్థాపించి ఆరేండ్లు కష్టనష్టాల కోరుస్తూ విజయవంతంగా నడిపారు. ఆ తర్వాత వాళ్ళు 'సుజాత' వంటి ఎన్నో పత్రికలకు వ్యాసాలు, కథలు రాశారు. తెలంగాణలో సాహిత్యం వైజ్ఞానిక, సాంస్కృతిక, రాజకీయ చైతన్యాన్ని తెచ్చినవారు. తెలంగాణలో వారు ఎంతోమంది యువకులకు ఆదర్శమయ్యారు. దీపధారులైనవారు. తెలంగాణ పునరుజ్జీవనోద్యమంలో వాళ్ళ పాత్ర ఎంతగానో ఉంది. ఒద్దిరాజు సోదరుల్లో ఒకరైన సీతారామచంద్రరావు 1918లో 'రుద్రమదేవి' అనే చారిత్రక నవలను రచించాడు. తర్వాత ఆయన 'శౌర్యశక్తి, భ్రమర, బ్రాహ్మణ సాహసము' అనే చారిత్రక నవలలను 'స్త్రీ సాహసము, ముక్తలవ' అనే సాంఘిక నవలను మొత్తం ఆరు నవలలను రచించాడు. "రుద్రమదేవి" నవల మొదట బెజవాడలోని మారుతీ ప్రెస్‌లో 1918లో అచ్చయింది. తర్వాత రెండో ముద్రణ ఒద్దిరాజు సోదరులు స్థాపించిన "విజ్ఞాన ప్రచారిణీ గ్రంథమాల"లో మొదటి గ్రంథంగా ప్రచురించారు.

రాఘవ రంగారావు "వరాహముద్ర, వీరావేశము" అనే చారిత్రక నవలలను రచించాడు. రుద్రమదేవి నవలకు కొమర్రాజు లక్ష్మణరావు నడిపే విజ్ఞాన చంద్రికా మండలి వారు బంగారు పతాకాన్ని బహుకరించారు. ఈ నవలలో రుద్రమదేవి పాత్ర యుద్ధవిద్యను తెలిసిన వీరవనితగా చిత్రింపబడింది. ఆమె దేవగిరి యాదవరాజును జయించిన వృత్తాంతం దీనిలో ఉంది. గోన బుద్ధారెడ్డి వీరుడు. ఆమెకు నమ్మిన బంటు. ఈ నవలలో గణపతి చక్రవర్తి జైనులను హింసించగా వాళ్ళు కక్షతో రుద్రమను గద్దె దించాలని దేవగిరి యాదవరాజుతో చేయి కలిపి కుట్రపన్నుతారు. వారితో హరిహర, మురారి దేవులనే దాయాదులు చేతులు కలుపుతారు. రాఘవ రంగారావు "వీరావేశము"లో నెల్లూరు మనుమసిద్ధిరాజు రాజ్యం కోల్పోగా తిక్కన గణపతిదేవుని సహాయంతో తిరిగి అతన్ని సింహాసనస్థుని చేసే ఇతివృత్తం వుంది. "వారి నవలలు నాటకీయ సన్నివేశాలతో సంభాషణలతో చక్కని శైలిలో రచింపబడినాయి. కథా వస్తువును ఉత్కంఠతో నడిపారు. రాజనీతిని యుద్ధ ఘట్టాలను రచయితలు నైపుణ్యంతో నడిపారు" అని 'ఒద్దిరాజు సోదరుల శతజయంతి మహోత్సవము' ప్రత్యేక సంచికలో 'భండారు సదాశివ, వనం అరుణ'లు రాసిన

వ్యాసాల వల్ల తెలుస్తున్నది. వాళ్ళు రాసిందాన్ని బట్టి అప్పటికి కొన్ని నవలల ప్రతులున్నాయని తెలుస్తున్నది. రుద్రమదేవి నవల ప్రచురింపబడి ఇప్పుడు దొరుకుతున్నది.

"రుద్రమదేవి, తిక్కన సోమయాజి" చారిత్రక నవలను రచించిన నోరి నరసింహాశాస్త్రి ఓరుగల్లులో కొన్నాళ్ళు నివసించాడు. అప్పుడాయనకు ఒద్దిరాజు సోదరులతో పరిచయమేర్పడిందని వాళ్ళతో ఆ నవలలను గురించి, కాకతీయుల చరిత్రగురించి చర్చించే వాడని రామాశాస్త్రిగారు చెప్పారు. కాబట్టి నోరి నరసింహశాస్త్రి, ఒద్దిరాజు సోదరుల "రుద్రమదేవి, వీరావేశము" నవలల చేత ప్రభావితుడయ్యే తన రెండు నవలలను రచించారని చెప్పవచ్చు. జైనుల తిరుగుబాటును "తిక్కన సోమయాజి" నవలలో వర్ణించాడు. హైద్రాబాదులో "మీజాను" పత్రికా సంపాదకులుగా పని చేసిన అడవి బాపిరాజు కూడా ఒద్దిరాజు సోదరుల నవల "రుద్రమదేవి" చేత ప్రభావితుడయ్యే "గోన గన్నారెడ్డి" నవలను రచించి వుంటాడు. రుద్రమదేవి పాత్రలో ఆయన వర్ణించిన గుణగణాలు తీర్చిదిద్దిన వ్యక్తిత్వం ఒద్దిరాజు "రుద్రమదేవి" నవలలోనూ కన్పిస్తున్నాయి. (వనం అరుణ వ్యాసం ఆధారం).

తెలంగాణ నుంచి 1910 దశకంలోనే ఇంత మంచి చారిత్రక సాంఘిక నవలలను ఒద్దిరాజు సోదరులు రచించారు. బ్రిటిషాంధ్రలో చిలకమర్తి, వేంకటపార్వతీశ్వర కవులు చారిత్రక నవలలను రచించారు. కాని వాళ్ళు రాజస్థాన్ కథావళిని ఇంగ్లీషు, బెంగాల్ నవలలను అనువాదం చేస్తూనో అనుసరిస్తూనో రచించారు. కాని ఒద్దిరాజు సోదరులు స్వయంగా చరిత్రను అధ్యయనం చేసి చాలా చక్కని నాటకీయతతో పాత్ర చిత్రణలతో చరిత్ర అంశాలతో కూడిన చారిత్రక నవలలు మౌలికమైనయి రచించారు. 1918లో "విజ్ఞాన ప్రచారణీ గ్రంథమాల" ప్రచురణల ఆరంభకాలం నుంచి 1924లో ఆ ముద్రణలను మూసేసేంత వరకు ఒద్దిరాజు సోదరులు నవలలను రచించి ప్రచురించారు. వారి భవనాన్ని రజాకారులు కాల్చేసినప్పుడు వాళ్ళ ఇంట్లోని వేలకొద్ది గ్రంథాలు అగ్నిపాలయ్యాయి. అందుకేనేమో వాళ్ళ రచనలు ఇప్పుడు అన్నీ దొరకడం లేదు.

వట్టికోట ఆళ్వారుస్వామి 1955లో "ప్రజల మనిషి" నవలను ప్రచురిస్తూ "మిత్రుల ప్రోద్బలంతో ఈ నవలను బయటికి తెస్తున్నాను" అని ముందుమాటలో అన్నాడు. తెలంగాణ నుంచి వచ్చిన పోరాట నవలల్లో ఇది మొదటిది. అప్పటికి నాలుగైదు నవలలు ప్రాంతేతరులు రాసిన పోరాట నవలలు వచ్చాయి. అందుచేత ఆ నవలలతో తన నవల పోటీ పడి నిలుస్తుందో లేదో అని భయం కావచ్చు. కాని "ప్రజల మనిషి"లో తెలంగాణవాడయిన పోరాటంతో పాల్గొన్న వాడయిన ఆళ్వారుస్వామి చాల సరళమైన శైలిలో తెలంగాణ ప్రజాజీవితం వాస్తవికతను యథార్థతలను చిత్రిస్తూ గొప్ప నవలను రచించాడు. కేవలం పార్టీ సిద్ధాంతాల కనుకూలమైన పాత్రలు సన్నివేశాలు లేక తెలంగాణలో జరిగిన వాస్తవికతను ఆయన చిత్రించాడు. 'ప్రజల మనిషి' నవలకు సీక్వెల్‌గా "గంగు" నవలను రచించాడు. దాన్ని పూర్తి చేయకుండానే ఆయన 1962లో పరమపదించాడు. మూడు "సీక్వెల్" నవలలో తెలంగాణ పోరాటాన్ని సొంతం చిత్రించాలన్న ఆయన కోరిక కోరికగానే నిలిచిపోయింది.

సురవరం ప్రతాపరెడ్డి "శుద్ధాంతకాంత" నవలను వ్రాసాడు. ఇది సంపూర్ణంగా వుంది. కాని అముద్రితం. "ఆరె వీరులు" నవల రచన మధ్యలో ఆగిపోయింది. ఈ నవలలు ప్రచురించవలసిన అవసరముంది. ఇరవయ్యో శతాబ్దం ఆరంభం నుంచి తెలంగాణలో నవలా రచన ఆగకుండా కొనసాగుతూనే ఉంది. కాని వాటిని గురించి మనకు తెలియలేదంటే ఆ నవలలు పునర్ముద్రణలు పొందకుండా మార్కెట్‌లో లేకపోవటం పాత గ్రంథాలయాల్లో కూడా లుప్తమైపోవటం కారణమని చెప్పాలె. 1950–60 మధ్యకాలంలో కమలహరి "జగ్గని యిద్దె, సంగం" అనే రెండు నవలలను తెలంగాణ భాష యాసల్లో రచించాడు. జగ్గడు అనే కింది వర్గానికి చెందిన యువకుడు విద్యనభ్యసించటానికి పడ్డ కష్టాలు 'జగ్గనియిద్దె'లో చిత్రింపబడినాయి. 'సంగం'లో భీవండీకి వలసపోయిన పద్మశాలీల సమస్యలు వాళ్ళు సంఘాలుగా ఏర్పడి తమ సమస్యలను పరిష్కరించుకోవటం ఇతివృత్తం. ఈ నవలలను చక్కని శైలిలో రాసాడు రచయిత.

తెలంగాణ విమోచనోద్యమకాలంలోనూ ఆ తరవాత కూడా తెలంగాణ నుంచి చాలా మంది నవలలను రచించారు. నల్లగొండ జిల్లా ఉద్యమాలకు "ఎపిసెంటర్"లాగా వుండటం చేత ఆ చైతన్యంతో ఈ జిల్లా నుంచి పాటలు కథలతో పాటు నవలలు కూడా చాలా వచ్చాయి. 1930 ప్రాంతంలో పైడిమర్రి వెంకట సుబ్బారావు "కాలభైరవుడు" మంచి పేరు తెచ్చిన నవల. సయ్యద్ అలీ అజ్మతుల్లా సోదరులు దేవరకొండవారు. వాళ్ళిద్దరు కలిసి 1945-60 మధ్యకాలంలో "సుశీల, సుజాత, మణి, రంపరాకాసి, జాహ్నవి - అనే 'సాంఘిక' నవలలను రాసారు. అవి చాలా ప్రచారాన్ని పొందాయి. ఆ కాలంలో సోమయాజుల లక్ష్మీనరసింహశాస్త్రి "గిరిజ", చివలూరి లక్ష్మీనరసింహచార్యులు "ఎగిరేపళ్ళాలు" అనే సాంఘిక నవలలను రాసారు. యం.డి.చైతన్య పేరుతో ప్రసిద్ధి చెందిన మహమ్మద్ అబ్దుల్లా పోలీసు శాఖ వారి "సురక్ష" పత్రికలో పనిచేసాడు. అనేక కథలను ఆయన వ్రాసాడు. "శిథిల గుహలు, సత్యభామ శపథం, మౌన మహారణ్యం, కాల్‌గరల్స్, రేపటి డైరీ" అనే నవలలను సమకాలిక సమస్యలను చిత్రిస్తూ రచించాడు. ఆయన నల్లగొండ జిల్లా నకిరేకల్ మండలం పెర్కకొండారంలో జన్మించి ప్రతిభతో స్వయంకృషితో రచనలు చేసాడు. కొల్లు మధుసూదనరావు 'శిక్ష', కొత్రమల్లికార్జున శర్మ 'స్వర్ణలత', ముదుంబ పురుషోత్తమాచార్యులు 'నీడలేని చెట్లు' నవలల్లో ఆనాటి సమాజ స్థితిగతులను చిత్రించారు. స్వాతంత్ర్యానికి పూర్వం తదనంతరం వున్న పరిస్థితులను చిత్రిస్తూ రాశారు. బోయనిపల్లి వెంకట రామారావు "జీవితబంధాలు" నవల సామాజిక సమస్యలను చిత్రిస్తున్నది. పుల్లాబొట్ల వెంకటేశ్వర్లు నల్లగొండ జిల్లా వాడు. ఖమ్మంలో స్థిరపడినాడు. ఆయన నవలతో పాటు "తెలుగు నవలా సాహిత్య వికాసం" అనే విమర్శనా గ్రంథాన్ని కూడా రాశాడు. ఖమ్మం జిల్లా వాడే కోలాహలం లక్ష్మణరాజు 25 నవలలను రచించాడు. వాటిల్లో చాలా నవలలు అచ్చయ్యాయి. చందూరు నివాసి వసంతరాయ్ 1955లో జన్మించాడు. "ఆత్మబలి, భగ్న ప్రేమికులు, ప్రేమాలయం, ఇదీ ఈ దేశ కథ, మన్నే బంగారం, మగువ తిరుగబడితే, జడ్జిమెంటు" నవలలను రచించాడు.

వట్టికోట ఆళ్వారుస్వామి, దాశరథి రంగాచార్యులు తెలంగాణ పోరాటాన్ని

చిత్రిస్తూ నవలలు రచించారు. దాశరథి రంగాచార్యుల అన్నగారు దాశరథి కృష్ణమాచార్యులు కవిగా ప్రసిద్ధుడు. ఆయన కూడా "అమరశిల్పి జక్కన" అనే నవలను రాశాడు. దాశరథి రంగాచార్యులు తెలంగాణ పోరాటాన్ని చిత్రిస్తూ "చిల్లరదేవుళ్ళు, మోదుగుపూలు, జనపదం" నవలలు 1970 దశకంలో రచించాడు. ప్రజలు వెట్టిచాకిరికి వ్యతిరేకంగా తిరగబడటం మతాంతీకరణలు దొరల దోపిడి దౌర్జన్యాలు వాటన్నిటిపై ప్రజలు తిరుగుబాటు చేయటం ప్రజలు చైతన్యవంతులై సాయుధ పోరాటానికి దిగడం వంటి చారిత్రకాంశాలు ఈ నవలలో చిత్రింపబడినాయి. ఒక విధంగా ఈ నవలలు సీక్వెల్ నవలలని చెప్పవచ్చు. దాశరథి ఈ నవలలే కాక "పావని, రానున్నది ఏది, నిజం, మానవత, శరతల్పం" మొదలైన నవలలు రాశాడు. ఉర్దూ నుంచి రుస్వాయి రాసిన, "ఉమ్రావ్‌జాన్ అదా" నవలను ఇంగ్లీషు నుంచి భవానీభట్టాచార్యులు రచించిన 'హీ హూ రైడ్స్ ద టైగర్' అనే ఇంగ్లీషు నవలను తెనిగించాడు.

తెలంగాణ పోరాటాన్ని చిత్రిస్తూ దాశరథి నవలల తర్వాత తెలంగాణ నుంచి చాల నవలలు వచ్చాయి. బి.ఎన్.శాస్త్రి "విప్లవజ్వాల" నవలను రాశాడు. ఆయన "తుక్కాదేవి, వాకాటక మహాదేవి" అనే చారిత్రక నవలలను కూడా రచించాడు. ఇంకా "రాధ, సంధ్యారాగం, పరివర్తన, జీవనపథం" అనే సాంఘిక నవలలను రచించాడు. తెలంగాణ సాయుధ పోరాటాన్ని చిత్రిస్తూ కందిమళ్ళ ప్రతాపరెడ్డి 'బంధూక్', తిరునగరి 'సంగం', కృష్ణారెడ్డి 'ఉప్పెన', బి.యన్.రెడ్డి 'ఆయువుపట్టు', ముదిగంటి సుజాతారెడ్డి 'మలుపు తిరిగిన రథచక్రాలు' నవలలను రచించారు. ఈ నవలలు ప్రజాపోరాటాల, సాయుధ పోరాటాల విభిన్న పార్శ్వాలను చిత్రిస్తున్నాయి. బి.ఎన్.రెడ్డి నిజాం వ్యతిరేక ఉద్యమంలో క్రియాశీలుడై పాల్గొన్నాడు. ఆయన విప్లవ వీరుడు. ఆ పోరాట కాలంలోని పల్లెల పరిస్థితిని, ప్రజాజీవితాన్ని చిత్రిస్తూ చాలా వాస్తవిక దృష్టితో "ఆయువుపట్టు" నవలికను రచించాడు. రజాకార్లు కింద వర్గాల ప్రజలు దళితుల మీద కూడా అత్యాచారాలు చేసారు. వాళ్ళను ఎన్నో విధాలుగా హింసించారు. స్త్రీల మానభంగాలు చేసారు. దళితులపై రజాకార్లు చేసిన ఆగడాలను బోయ జంగయ్య "జగడం" నవల పూర్వభాగంలో వర్ణించాడు. రజాకార్లు దళితులను

పీడించినట్లుగా తెలియని సత్యం. బోయ జంగయ్య ఆ చరిత్రను చిత్రించాడు. అంపశయ్య "రక్తకాసారం" తెలంగాణ పోరాటాన్ని, ప్రజాజీవితాన్ని చిత్రించే నవల. ప్రాణ్‌రావు తెలంగాణ సాయుధ పోరాటాన్ని చిత్రిస్తూ "మలగనిబత్తి" ఇంకా "రుద్రమదేవి" వంటి చారిత్రక నవలలు (2011) రచించాడు.

తెలంగాణ సాయుధ పోరాటం తర్వాత 1970ల నుంచి ప్రారంభమై కొనసాగిన నక్సలైట్ విప్లవోద్యమాన్ని చిత్రిస్తూ ఆ ఉద్యమ నేపథ్యంలో ప్రజల బాధలను వాళ్ళమీద జరిగిన అన్యాయాలను, దోపిడీలను చిత్రిస్తూ తెలంగాణ నుంచి చాల కథలు కవిత్వం, నవలా సాహిత్యం వచ్చింది. తెలంగాణ అంటేనే ఉద్యమ సాహిత్యం అని ఈ విప్లవోద్యమం కాలంలో ఉధృతంగా వచ్చిన సాహిత్యం వల్లనే ఒక అభిప్రాయం బలంగా సాహితీలోకంలో ఏర్పడింది. అంతకుముందు సాహిత్యమే లేదు అన్నంత గాఢంగా ఈ అభిప్రాయం పాదుకున్నది. విప్లవోద్యమం అనగానే మనకు అల్లం రాజయ్య రాసిన కథలు, నవలలు గుర్తుకు వస్తాయి. ఆయన "కొలిమంటుకున్నది, ఊరు, అగ్నికణం, భూమి, వసంతగీతం" అనే నవలలను ప్రజలపై జరిగే అత్యాచారాలను ప్రజల పోరాట చైతన్యాన్ని చిత్రిస్తూ రచించాడు. అల్లం రాజయ్య సాహుతో కలిసి నిజాంకు వ్యతిరేకంగా గిరిజనుల హక్కుల కోసం తిరుగుబాటు చేసిన కొమురం భీము పోరాటాన్ని చిత్రిస్తూ "కొమురం భీము" అనే నవలను రచించాడు. వసంతరావు దేశపాండే గిరిజనుల పోరాట చైతన్యాన్ని చిత్రిస్తూ "అడవి, ఊరు" అనే నవలలను రచించాడు. విప్లవ పోరాటాన్ని చిత్రిస్తూ సాధన, "రాగో" అనే నవలను రచించాడు. 'రాగో'లో విప్లవ పోరాటం, స్త్రీల అస్తిత్వాన్ని చిత్రించాడు. పులుగు శ్రీనివాస్ విప్లవోద్యమ చైతన్యం నేపథ్యంలో 'అన్నలు, అడవితల్లి' అనే నవలలను రచించాడు. తుమ్మేటి రఘోత్తంరెడ్డి సింగరేణి కార్మికుల సమస్యలను, వ్యథలను చిత్రిస్తూ "నల్లవజ్రం" నవలను రచించాడు. పి.చంద్ సింగరేణి బొగ్గు కార్మికుల జీవితాలను కథలుగా రాయటమే కాక ఆ కార్మికుల ఉద్యమాన్ని ఉద్యమ నాయకుని జీవితాన్ని చిత్రిస్తూ 'మహేంద్ర, శేషగిరి" నవలలను వ్రాసాడు. శాంతి ప్రబోధ "జోగిని" నవలను 2005లో జోగినుల జీవితాలను, క్షోభలను చిత్రిస్తూ రాసింది. అమృతలత నిజామాబాదు వాసి. ఆమె "సృష్టిలో తీయనిది" నవలను రచించింది.

దీనిలో చక్కని కుటుంబ జీవిత చిత్రణ జరిగింది. ఇది ఆంధ్రజ్యోతి వారపత్రికలో 1977లో ధారావాహికంగా ప్రచురింపబడింది. బీడీ కార్మికుల జీవితాలను వాస్తవికంగా చిత్రిస్తూ బి.ఎస్.రాములు "బతుకుపోరు" నవలను రాశాడు.

నేరెళ్ల శ్రీనివాస్‌గౌడ్ "బ్రతుకుతాడు" అనే నవలను రచించాడు. ఈ నవలలో గౌడుల వృత్తి జీవిత సమస్యలు, వ్యథలు చిత్రింపబడినాయి. దిలావర్ "సమిధలు, (1985 భారతిలో సీరియల్‌గా వచ్చింది) ముగింపు, తుషార గీతిక (జయశ్రీ ధారావాహికంగా వచ్చింది) నవలలను రచించాడు. "సమిధలు"లో విద్యార్థుల క్యాంపస్ జీవితాలు, వాళ్ళ మీద వున్న ప్రభావాలను చిత్రించాడు.

విప్లవకవి చెరబండరాజు కవిగా ప్రసిద్ధుడు. కాని ఆయన కథలు, నవలలు కూడా రచించాడు. విప్లవ నేపథ్యంలో ఆయన "నిప్పురాళ్ళు, మాపల్లె, ప్రస్థానం దారిపొడుగునా" అనే నాలుగు నవలలను వ్రాసాడు. విప్లవ నిబద్ధతతో చెరబండరాజు గ్రామీణ ప్రజల సంఘర్షణలను, పోరాటాలను చిత్రించాడు. ఈ రచయితలందరూ తెలంగాణ భాషయాసలను ప్రయోగిస్తూ చక్కని శైలిలో రచించారు. భూపాల్ 'పట్నమొచ్చిన పల్లె' పట్టణీకరణాన్ని నిరసించే నవలిక. ఉత్తరాలతో కథనం సాగింది.

తెలంగాణ నుంచి దాశరథి తరవాత ఎక్కువ నవలలను రచించిన రచయిత నవీన్. ఆయన విద్యార్థి దశలోనే 1960ల్లో "అంపశయ్య" నవలను రాశాడు. ఆ నవల ఒక గ్రామీణ విద్యార్థి విశ్వవిద్యాలయంలో వుంటూ పట్నం వాతావరణంలో చిక్కుకున్న మనోదశను చిత్రించారు. "చైతన్య స్రవంతి" శైలిలో సాగింది. ఆ నవల అతనికి ఖ్యాతిని తెచ్చింది. అతని ఇంటి పేరే 'అంపశయ్య నవీన్"గా మారింది. తరవాత నవీన్ ఎమర్జెన్సీ కాలం నాటి పోలీసుల దౌర్జన్యాన్ని చిత్రిస్తూ "చీకటి రోజులు" నవల వ్రాసాడు. ఆ తరవాత తెలంగాణ పోరాటాన్ని, ఆంధ్రప్రదేశ్ అవతరణాన్ని, నక్సలైట్ ఉద్యమం, ప్రపంచీకరణం ప్రభావాలను చిత్రిస్తూ నవీన్ "కాలరేఖలు, బాంధవ్యాలు, చెదిరిన స్వప్నాలు" అనే మూడు సీక్వెల్ నవలలను రచించాడు. ఇవేకాక "ముళ్ళపొదలు, అంతస్స్రవంతి" నవలలు రాశాడు. ఇవి "అంపశయ్య"కు సీక్వెల్ నవలలు. 1960 దశకం నుంచి నిరంతరం నవలలను

రాస్తున్న రచయిత నవీన్. నవీన్ రాసిన "చీకటి రోజులు" నవల ఎమెర్జన్సీ కాలంలో పోలీసుల అత్యాచారాలను, అమాయక జనుల యాతనలను చిత్రిస్తున్నది. ఎమెర్జన్సీ కాలం నాటి పరిస్థితులను చిత్రిస్తూ తెలంగాణ నుంచి తాడిగిరి పోతరాజు తిరుపతయ్యా 'కిటికి' కథలు రాస్తే నవీన్ నవల రచించాడు. ఎమెర్జన్సీ నాటి అప్రజాస్వామిక దౌర్జన్యాలను తెలంగాణ రచయితలు సాహిత్యంలో నమోదు చేసారు. ఈ చిత్రణలు వేరే ప్రాంతాల నుంచి జరుగలేదు. నవీన్ నవలల్లో తెలంగాణ విద్యార్థి జీవితం జన జీవనం మధ్య తరగతి ప్రజల జీవన పోరాటం ప్రతిబింబిస్తుంది. తెలంగాణ రాజకీయ, సామాజిక, సాంస్కృతిక జీవితాన్ని చిత్రిస్తున్నాయి. ఆయన "కాలరేఖలు" నవలకు కేంద్ర సాహిత్య అకాడమి అవార్డు లభించింది.

తిరుపతయ్య 1987లో 'బతుకు' అనే నవలను రాశాడు. ఆ తరవాత రెండు దశాబ్దాలకు "జీవన సమరం" అనే నవలను మృత్యుశయ్య మీది నుంచి రచించాడు. ఈ నవలలో తెలంగాణ దళిత బహుజనుల జీవితాలు, సంస్కృతి, పండుగలను తిరుపతయ్య చాలా వివరంగా చిత్రించాడు. తెలంగాణ భాష, యాసలో నవల చక్కని శైలిలో నడిచింది.

ఒకప్పుడు విప్లవ పోరాటానికి విప్లవ కథలకు నవలలకు పుట్టినిల్లయిన నల్లగొండ జిల్లా నుంచి దళిత చైతన్యాన్ని చిత్రించే నవలా రచయితలు జన్మించారు. బోయ జంగయ్య దళిత చైతన్యాన్ని చిత్రించే కథలేకాక "జాతర, జగడం"అనే నవలలను రచించాడు. దళితులు విద్య విజ్ఞానం వ్యక్తిత్వ నిర్మాణంతో కృషితో అధికారాన్ని చేపట్టాలని బోయ జంగయ్య "జగడం" నవలలో సందేశాన్ని అందించాడు. అగ్రవర్ణాల వాళ్ళతో వివాహబంధం వల్ల దళితులకు సమాజంలో సమానత రాదనే అతడు అభిప్రాయపడినాడు. నల్లగొండ జిల్లా వాడయిన వేముల ఎల్లయ్య "కక్క, సిద్ధి" అనే దళిత చైతన్యాన్ని చిత్రించే నవలలు రాశాడు. ఆయన దళితుల నిత్యజీవితంలోని భాష యాసల్లో రచించాడు. దళిత సంస్కృతిని, జీవిత విధానాన్ని వాస్తవికంగా పాత్ర చిత్రణలో ప్రతిబింబింపజేసాడు. కదిరె కృష్ణ 'పొద' అనే దళిత జీవితాన్ని చిత్రించే నవలను రచించాడు.

తెలంగాణలో దళితవాదంలో స్త్రీ చైతన్య వాదులున్నారు. చాలా మంది కథలు, నవలలు రాశారు. జాజులగౌరి ఒక దళిత స్త్రీ వ్యవసాయం చేసేప్పుడు ఎదుర్కొనే సమస్యలను "మన్నుబిడ్డ" నవలలో చిత్రించింది. జాజుల గౌరి మరో దళిత జీవితాన్ని ఆచార వ్యవహారాలను చిత్రించే నవల "వొయినం" (2012) రచించింది.

భూతం ముత్యాలు "సూర, పురుడు" అనే నవలలను రచించాడు. వాటిల్లో దళిత చైతన్య చిత్రణ కన్పిస్తున్నది. దళితేతర రచయితల్లో ముదిగంటి సుజాతారెడ్డి "సంకెళ్ళు తెగాయి"నవలలో ఒక కింది వర్గంవాడైన మంగలి యువకుడు విద్యార్జనలో ఎదుర్కొన్న కష్టాలు, అతడు విద్య విజ్ఞానం క్రమశిక్షణలో ఎదిగి ప్రభుత్వాధికారిగా అధికారాన్ని సంపాదించటం ఇతివృత్తంగా ఉంది. బరాక్ ఒబామా నల్లజాతీయుడై ఉండి పట్టుదల విద్య విజ్ఞానం క్రమశిక్షణలలో ప్రపంచంలో అత్యధిక అధికారం గల అమెరికను ప్రెసిడెంటుగా ఎన్నికయ్యాడు. జీవితంలో ఏదైనా సాధించటానికి రంగు, కులం, ధర్మం ఏవీ అడ్డురావని ఈ నవల సందేశమిస్తున్నది. సుజాతారెడ్డి నవలలు వ్రాయటమే కాక "తెలుగు నవలానుశీలనం" అనే నవలా విమర్శన గ్రంథాన్ని రచించింది.

దశరథ్ రాసిన "శతాబ్దాల నిశ్శబ్దం, తెగిపడిన సంకెళ్ళు" అనే నవలలు విశాలాంధ్ర వారిచేత ప్రచురింపబడినాయి. ఈ నవలల్లో లంబాడీల జీవితం చిత్రంచబడింది. కాని ఈ నవలలు పునర్ముద్రణ లేక దొరకటం లేదు. వరంగల్ నుంచి హైమాషైనీ అనే ప్రభుత్వాధికారి నవలలు రచించాడని వరంగల్ రామాశాస్త్రిగారు తెలిపారు. కాని అవి అలభ్యం. తిరుకోవలూరు శశిరేఖ "కాలానికి సమాధి" అనే నవలను రచించింది. ఇల్లిందల సరస్వతీదేవి తెలంగాణ పోరాటం కాలంలో ఆంధ్ర మహాసభల్లో పాల్గొన్నది. 300 వరకు కథలు రాసింది. ఆమె "బాంచెన్ కాల్మొక్త" అనే తెలంగాణ గ్రామీణ జీవితాన్ని చిత్రిస్తూ నవల రాసింది.

"వెంపో" (కలంపేరు) తెలంగాణలో పత్రికా సంపాదకుడుగా పని చేసాడు. ఆయన భార్య సత్యవతిది సూర్యాపేట దగ్గర గ్రామం. తెలంగాణలో వినోబాభావే భూదానోద్యమాన్ని వస్తువుగా తీసుకొని వెంపో "ఈ దేశం నాది" నవలను రచించాడు.

అదే విధంగా తెలంగాణలో ఆర్య సమాజోద్యమాన్ని చిత్రిస్తూ "వెలుతురు మలుపులు" అనే నవలను రచించాడు. వరంగల్‌లోని దీప్తి ప్రచురణలు ఈ నవలలను ప్రచురించింది. వెంపో ఇవేగాక మరికొన్ని నవలలు రాసినట్లు తెలుస్తున్నది.

కాలువ మల్లయ్య "భూమి పుత్రుడు, సాంబయ్య చదువు, మాట్లాడే బొమ్మలు, బతుకు పుస్తకం" నవలలు రాశాడు. ఆ నవలల్లో తెలంగాణ బహుజనుల జీవితం, బహుజనుల సంస్కృతి భాషయాసలు కనిపిస్తాయి. గ్రామాల్లోని జనజీవితంలో వస్తున్న మార్పులను మానవ సంబంధాలను, ఆర్థికమైన సమస్యలను కాలువ మల్లయ్య తన నవలల్లో చిత్రించాడు. గ్రామాల్లో రైతులు భూమిని అమ్ముకునే దుస్థితి ఏర్పడటం వంటి పరిణామాలను ఆయన వర్ణించాడు.

పెద్దింటి అశోక్ కుమార్ బతుకు సాగక వలసలు పోయే ప్రజల జీవితాలను చిత్రిస్తూ "ఎడారి మంటలు" నవల రచించాడు. "దాడి" నవలలో నీటి సమస్యను ఇతివృత్తంగా తీసుకున్నాడు. "నెత్తుటిదార" అనే నవలను మారుపేరుతో రచించాడు. "హక్కుల యోధుడు", "భూదేవి" నవలలను ప్రచురించబోతున్నాడు. అశోక్ కుమార్ "జిగర్" ఆటావారినవలా రచన పోటీలో బహుమతి అందుకున్న నవల. ఇది హిందీ, పంజాబీ, ఇంగ్లీషు భాషల్లోకి అనువదింపబడింది. వస్తువులో నవ్యత చక్కని శైలి పాత్ర చిత్రణలు ఇతని నవలల్లో కన్పిస్తాయి. ఐతా చంద్రయ్య తెలంగాణ ప్రజాజీవితాన్ని చిత్రిస్తూ నవలలు వ్రాసాడు. రచయిత మెదక్ జిల్లా వాడు.

నందిగం కృష్ణారావు "చీకట్లో నల్లపిల్లి" నవలలో విద్యార్థి జీవితాన్ని చిత్రించాడు. విప్లవోద్యమంపై సానుభూతిని చూపే విద్యార్థులను రాజ్యం కుట్రతో జైలుపాలు చేసి హింసించటాన్ని ఆయన ఈ నవలలో చిత్రించాడు. ఆయన వరంగల్ జిల్లావాడయినా ఉత్తరాంధ్ర భాషలో రాయటం విశేషం.

1969లో జరిగిన తెలంగాణ ప్రత్యేక రాష్ట్రోద్యమాన్ని ఇతివృత్తంగా తీసుకొని లోకేశ్వర్ "సలాం హైద్రాబాదు" బృహన్నవలను రాశాడు. యథార్థంగా జరిగిన సంఘటనలు వ్యక్తులు దీనిలో కన్పిస్తారు. ఒక విధంగా ఇది నవలలాగా సాగిన చరిత్ర వృత్తాంతం. గతంలోకి, వర్తమానంలోకి మారుతూ తెలంగాణ చారిత్రక,

సామాజిక, సాంస్కృతిక, రాజకీయ పరిస్థితులను రికార్డు చేసింది. తెలంగాణ ప్రాంతీయ అస్తిత్వవాదానికి ప్రతినిధి నవల "సలాం హైద్రాబాదు".

డా. శంకరయ్య "దూరపు కొండలు"నవల సి.పి.బ్రౌను అకాడమీ నవ్యావారపత్రికలు సంయుక్తంగా నిర్వహించిన నవలల పోటీలో లక్ష రూపాయల బహుమతి అందుకొని "నవ్య" వారపత్రికలతో ధారావాహికంగా ప్రచురింపబడింది. చక్కని తెలంగాణ భాష నుడికారంతో సాగిన ఈ నవలలో అమెరికాలో స్థిరపడిన భారతీయుల కుటుంబ జీవితాన్ని ఏదో విధంగా వీసాలు సంపాదించి అక్కడ ఉంటూ జీవితాలను వెళ్ళదీస్తున్న ఇమ్మిగ్రెంటుల పరిస్థితులను ఈ నవలలో చాలా సహజంగా ఆసక్తికరంగా రచయిత చిత్రించాడు.

మలయశ్రీ రచించిన "నిర్ణయం" కూడా బహుమతి నందుకున్న నవల. తెలంగాణ భాష నుడికారాలతో నవల కథ మలుపులు తిరుగుతూ సాగుతుంది. తెలంగాణ కుటుంబాల్లో పరస్పర సంబంధాలు స్త్రీ ఆత్మగౌరవం తెలంగాణ పెండ్లిల్లో ఆచారాలను రచయిత వాస్తవికంగా చిత్రించిన నవల. చదివించే శైలిలో వుంది.

తెలంగాణ నుంచి స్త్రీవాద కథలే కాక నవలలు కూడా వచ్చాయి. గీతాంజలి రచించిన "ఆమె అడవిని జయించింది" నవల నిజామాబాదు యాసలో ఉంది. కుటుంబంలో స్త్రీలు పురుషుల అభిరుచుల కనుగుణంగా నడుచుకోవటం వాళ్ళల్లో ఆత్మగౌరవం ఆత్మాభిమానాలు, ఆచారాలు, సంప్రదాయాల పేరుతో అణచబడటం పట్నాలల్లో స్త్రీలు కూడా ఎటువంటి స్వాతంత్ర్యం, స్వేచ్ఛ లేకుండా హింసలకు గురికావటాన్ని గీతాంజలి ఈ నవలలో చిత్రించింది. ముదిగంటి సుజాతారెడ్డి "ఆకాశంలో విభజన రేఖల్లేవు" నవలలో కొందరు స్త్రీవాదులమంటూ ద్వంద్వ ప్రమాణాలను ఆచరించటాన్ని స్త్రీ పురుషులు సమానంగా జీవితాన్ని ప్రజాస్వామ్య మార్గంలో కొనసాగించినప్పుడే స్త్రీవాదం సాధింపబడుతుందని ఈ నవలలో చిత్రించింది. రాడికల్ ఫెమినిజం భావాలను ఖండించింది.

1960, 70 దశకాల్లో అనేక సంఖ్యలో 'స్త్రీలు నవలలు రాస్తున్న తరుణంలో తెలంగాణ నుంచి మాదిరెడ్డి సులోచన, పొల్కంపల్లి శాంతాదేవి, బొమ్మా హైమాదేవి

నవలలు రాశారు. మాదిరెడ్డి సులోచన నవలల్లో తెలంగాణ కుటుంబ జీవితం, తెలంగాణ భాష, నుడికారాలు కన్పిస్తాయి. ఆమె 80 వరకు నవలలు రచించింది. నాలుగైదు నవలలు సినిమాలుగా కూడా వచ్చాయి. పొల్కంపల్లి శాంతాదేవి కూడా 70 వరకు నవలలు రాసింది. ఆమె నవలల్లోను కుటుంబ చిత్రణ కన్పిస్తుంది. ఇతర రచయిత్రుల వ్యాపార నవలతో పోలిస్తే ఈ రచయిత్రుల నవలలు గంభీరంగా వాస్తవికత చిత్రణలలో చక్కని శైలిలో కన్పిస్తాయి. వాళ్ళ నవలలో కొన్ని సినిమాలుగా కూడా వచ్చాయి. విజయవంతంగా నడిచాయి. హైమాదేవి 40 వరకు రచించింది. 1960 దశకంలో తాడిగిరి పోతరాజు "మట్టిబొమ్మలు, పావురాలు" అనే నవలలను రచించాడు. "పావురాలు" నవలలో తెలంగాణ స్వాతంత్రోద్యమ కాలంలో సాగిన రజాకార్ల అత్యాచారాలు వర్ణింపబడినాయి. ప్రసిద్ధ రచయిత భాస్కరభట్ల కృష్ణారావు 1950 దశకంలో "యుగసంధి, వెల్లువలో పూచికలు" అనే నవలలను రచించాడు. ఆ కాలం నాటి హైద్రాబాదు పట్టణ జీవితం సంస్కృతులు ఈ నవలల్లో చిత్రింపబడినాయి.

తెలుగులో 1960, 70 దశకాల్లో వచ్చినస్త్రీలు ఎక్కువ సంఖ్యలో (దాదాపుగా 125 మంది) తక్కువ సంఖ్యలో పురుషులు రాసిన వ్యాపార నవలలను పక్కన పెడితే ఆంధ్ర ప్రాంతాల నుంచి వచ్చిన "సీరియస్" నవలల కంటే తెలంగాణ ప్రాంతం నుంచి వచ్చిన "సీరియస్" నవలలు ఎక్కువగా ఉన్నాయి. ఇతివృత్తంలో వస్తువులో శిల్పం, శైలి భాషల్లో తెలంగాణ నవలలు ఏ విధంగానూ తీసిపోకుండా ఉన్నాయి. నవీన్ వంటి వాళ్ళు నవలా శైలిలో కొత్త పోకడలు సృష్టించారు. ప్రయోగాలు చేసారు.

తెలంగాణ నవలా రచయితలు తమ చుట్టూ ఉన్న జీవితాన్ని సమస్యలను, ఉద్యమాలను తీసుకొని నవలలు వ్రాసారు. తెలంగాణ పరివేషంలో ఇక్కడి నవలలో రచన సాగింది. అందుకని తెలంగాణ నవలలను మిగతా తెలంగాణ సాహిత్యం లాగానే తెలంగాణ ప్రాంతపు భౌగోళిక చారిత్రక సందర్భం అవగాహనతో చదువవలసి ఉంటుంది. అధ్యయనం చేయవలసి ఉంటుంది. తెలంగాణ సామాజిక రాజకీయ మార్పులకు ఇక్కడి ఉద్యమాలకు తెలంగాణ నవల అద్దం పడుతుంది. నిజాయితీగా

ఇక్కడి ప్రజాజీవితాన్ని, సమస్యలను, సంఘర్షణలను తెలంగాణ నవలలు చిత్రిస్తున్నాయి. తెలంగాణ నవలా రచయితలు ఎప్పుడూ నవలా ప్రక్రియను ఉబుసుపోకకు వ్రాసే రచనగా తీసుకోలేదు. సామాజిక, రాజకీయ పరిణామాలను చిత్రించే, వ్యాఖ్యానించే గంభీరమైన ప్రక్రియగానే తీసుకొని నవలా రచనలు చేసారు. వస్తువులో, భాషలో, నుడికారంలో ప్రాంతీయతను కోల్పోకుండా రచించారు.

## తెలంగాణ తెలుగు సాహిత్యంలో

# సాహిత్య విమర్శ

**తె**లంగాణలో క్రీ.శ.13వ శతాబ్దం నుంచే అలంకార శాస్త్ర గ్రంథాలు రచింపబడినాయి. ప్రాచీన కాలంలో సాహిత్య విమర్శ ఛందోగ్రంథాలు, అలంకారశాస్త్ర గ్రంథాల్లో అంతర్భాగంగానే సాగింది. సంస్కృత సాహిత్యంలో కావ్య సంబంధమైన విషయాలను చర్చించే అలంకార శాస్త్ర గ్రంథాలు, అలంకార సిద్ధాంతాలు తెలంగాణ నుంచి చాలానే వచ్చాయి. సంస్కృత అలంకార శాస్త్ర గ్రంథాల్లో ప్రతాపరుద్ర యశోభూషణానికి మంచి స్థానమే వుంది. ఇది తెలుగుదేశంలో వ్రాయబడిన మొట్టమొదటి అలంకార శాస్త్ర గ్రంథం. దాన్ని ఓరుగల్లు నివాసి అయిన విద్యానాథుడు రాసాడు. దేవరకొండ నేలిన రెండో సింగభూపాలుడు 'రసార్ణవ సుధాకరం' అనే రసవివేచనతో కూడిన అలంకార శాస్త్రాన్ని రచించాడు. సింగభూపాలుని ఆస్థానంలో వాడైన విశ్వేశ్వరుడు 'చమత్కార చంద్రిక' అనే అలంకార శాస్త్రంలో చమత్కార సిద్ధాంతాన్ని ప్రతిపాదించాడు. గోలకొండ రాజు అబుల్ హసన్ తానీషా గురువు కుమారుడైన అక్బరు షా 'శృంగార మంజరి' అనే సంస్కృత అలంకార శాస్త్ర గ్రంథాన్ని రాశాడు. అక్బరు షా సంస్కృతంలోనే కాక తెలుగులోనూ పండితుడట. అసలు ఆయన శృంగార మంజరిని తెలుగులో రాసి సంస్కృతంలోకి ఆయనే అనువదించాడని కూడా అంటారు. ఇవి సాహిత్య విమర్శ ప్రాచీన రూపాలని చెప్పవచ్చును. ఇక తెలుగుకు వస్తే తెలుగులో మొట్టమొదటి ఛందోగ్రంథం కరీంనగరం జిల్లా వేములవాడ వాడైన భీమన రచించాడు. భీమకవి రచించిన "కవిజనాశ్రయము'లో తెలుగు పద్యాల లక్షణాలు వున్నాయి. ఆ విధంగా తెలుగులో మొట్టమొదటి ఛందో లక్షణ గ్రంథం తెలంగాణ నేల మీద ఆవిర్భవించింది. కవిజనాశ్రయము తర్వాత ప్రసిద్ధమైంది 'అప్పకవీయము'. ఆ ఛందో గ్రంథాన్ని రాసిన కాకునూరి అప్పకవి మహబూబునగరం

జిల్లాలో వున్న తొమ్మిది రేకుల గ్రామం వాడు. తొమ్మిది రేకుల గ్రామ నామాన్ని 'నవదళ పురి' అని అప్పకవి సంస్కృతీకరించాడు, సంస్కృత మహాకావ్యాలకు విలువైన వ్యాఖ్యానాలను రాసిన మల్లినాథుడు తెలంగాణ వాడే. ఆ వ్యాఖ్యానాలల్లో నిక్షిప్తమై ఎంతో సాహిత్య విమర్శ అంశాలు కన్పిస్తాయి. అదేవిధంగా వేములవాడ నివాసి రాజేశ్వరస్వామి భక్తుడైన సోమనాథుడనే పండితుడు 'వసుచరిత్ర' తెలుగు ప్రబంధానికి విద్వద్రంజనిఅనే వ్యాఖ్యానాన్ని రచించాడు. వసు చరిత్ర కూడా సంస్కృత నైషధం వలెనే వ్యాఖ్యానం లేకుండా అర్థం కాదు. అటువంటి కఠినమైన ప్రబంధానికి సోమనాథుడు వ్యాఖ్యానం రాశాడు. ఆ వ్యాఖ్యానాన్నే ఆధునిక కాలంలో శేషాద్రి రమణ కవుల నూతనాంశాలతో, వావిళ్లవారు ప్రచురించారు. ప్రాచీన కాలంలో ఛందో గ్రంథాలు గాని, వ్యాఖ్యానాలు గాని సాహిత్య విమర్శలో భాగంగానే సాగాయి. సాహిత్య విమర్శకు అవి ప్రాగ్రూపాలుగా చెప్పబడుతుంటాయి. ఈ విధంగా తెలంగాణలో ప్రాచీన సాహిత్య విమర్శ అవశేషాలు బహుమూల్యమైనవే దొరుకుతున్నాయి.

ఆధునిక కాలంలోకి వస్తే 1950 దశకం నుంచి తెలంగాణలో సాహిత్య విమర్శ ప్రారంభమై వికసించింది. ఇక్కడి సాహిత్య విమర్శకులు తెలుగు సాహిత్య విమర్శలో ప్రధానమైన మూడు సాహిత్య ప్రస్థానాలకు మార్గం వేశారు. సురవరం ప్రతాపరెడ్డి "ఆంధ్రుల సాంఘిక చరిత్ర"ను వ్రాసి సాహిత్యం ఆధారంగా చారిత్రక, సామాజిక చరిత్ర సంస్కృతుల అధ్యయనానికి శ్రీకారం చుట్టాడు. ప్రాచీన కావ్యాల ఆధారంగా సామాజిక చరిత్ర నిర్మాణాన్ని చేశాడు. మనకు చరిత్ర పుస్తకాల్లో దొరకని జనజీవితమెంతో కావ్యాల్లో దొరుకుతున్నదని సురవరం ఈ సాహిత్య విమర్శ గ్రంథంలో చూపాడు. దీనికి 1952లో తెలుగుకు మొట్టమొదట కేంద్ర సాహిత్య అకాడమీ అవార్డు లభించింది.

బిరుదురాజు రామరాజు జానపద సాహిత్యాన్ని సేకరించి విశ్లేషించి "తెలుగు జానపద గేయ సాహిత్యం" అనే పరిశోధనా గ్రంథాన్ని రచించాడు. జానపదుల సాహిత్య పరిశోధనకు విశ్వవిద్యాలయంలో పీఠం వేసి అకడమిక్ స్థానాన్ని కల్పించాడు. ఇప్పటికీ జానపద సాహిత్య అధ్యయనానికి విమర్శకు ఈ గ్రంథమే మూలాధారంగా వుంది. సి.నారాయణరెడ్డి ఆధునికాంధ్ర కవిత్వం మీద చేసిన పరిశోధనా గ్రంథం "ఆధునికాంధ్ర కవిత్వం – సంప్రదాయం – ప్రయోగం". ఆధునిక సాహిత్య విమర్శ

చేయాలంటే ఎవరైనా తప్పక ఉపయోగించుకునే ఆధార గ్రంథం. తెలంగాణ పోరాటం ఇతివృత్తంతో రాసిన నవలలను మార్క్సిస్టు దృక్పథంతో అధ్యయనం చేసి వరవరరావు 'తెలంగాణ విమోచనోద్యమం – తెలుగు నవల' అనే పరిశోధనా గ్రంథాన్ని ప్రచురించాడు. మార్క్సిస్టు దృక్పథంతో విమర్శకు మార్క్సిస్టు విమర్శనా పద్ధతిలో ఒక నవలను అధ్యయనం చేసే మార్గానికి వరవరరావు దారి చూపాడు. ఎన్.గోపి పరిశోధనా గ్రంథం 'ప్రజాకవి–వేమన' వేమన మీద వచ్చిన పరిశోధనల్లో అగ్రగామిగా ఆకరగా గ్రంథం నిలుస్తున్నది. ఈ విధంగా తెలంగాణ నేల మీదనే తెలుగు సాహిత్యంలోని ఈ ఐదు విమర్శనా మార్గాలకు తోవలు పడ్డాయి.

బిరుదురాజు రామరాజు తెలంగాణ కవులను గురించి వ్యాసాలు వ్రాశాడు. విశ్వవిద్యాలయాల్లో ఎందరో ఉత్తమ పరిశోధనలు చేస్తున్నారు. గ్రంథాలుగా ప్రచురిస్తున్నారు.

వీళ్ళేగాక తెలంగాణ నుంచి ఇంకా విమర్శనా రంగంలో ప్రసిద్ధమైన వారు కోవెల సుప్రసన్నాచార్య. కోవెల సంపత్కుమారాచార్య, వేనరెడ్డి, ఎస్వీ రామారావు, జ్వాలాముఖి, నిఖిలేశ్వర్, చేరా, ఎస్వీ సత్యనారాయణ, కసిరెడ్డి, దోరవేటి, ముదిగొండ వీరభద్రయ్య వంటి వాళ్ళెందరో వున్నారు. ఇంకా ఎంతోమంది యువకులు సునిశితమైన విమర్శ వ్యాసాలు రాస్తున్నారు. గ్రంథాలు ప్రచురిస్తున్నారు. అంపశయ్య నవీన్, అనుమాండ్ల భూమయ్యలు అనేక విమర్శ వ్యాసాలు రచించారు. ముదిగొండ వీరభద్రయ్య నవలలు ఆధునిక కవిత్వంమీద విమర్శ గ్రంథాలు ప్రచురించాడు. అనుమాండ్ల భూమయ్య "వేయిపడగలు–ఆధునికేతిహాసం" మొదలైన విమర్శనా గ్రంథాలు రచించాడు. ఎన్.వేణుగోపాల్ విలువైన సాహిత్య విమర్శ వ్యాసాలను, సమీక్షలు, ముందుమాటలు రాశాడు. ముదిగంటి సుజాతారెడ్డి 'చారిత్రక సామాజిక నేపథ్యంలో తెలుగు సాహిత్య చరిత్ర' రాసింది. ఇది స్త్రీ రచించిన మొట్టమొదటి సాహిత్య చరిత్ర. తెలంగాణ రచయితలు ఆచార్యులు కూడా ఎవరూ సమగ్ర తెలుగు సాహిత్య చరిత్రను వ్రాయలేదు. దీనిలో విస్తృతంగా తెలంగాణలో వచ్చిన ప్రాచీన ఆధునిక సాహిత్య ప్రస్తావనలున్నాయి. ఈ సాహిత్య చరిత్ర తెలంగాణలో రచింపబడి భీమన కవిజనాశ్రయం నుంచి ప్రారంభమై తెలంగాణ అస్తిత్వ వాదంతో ముగిసింది. తెలంగాణ సాహిత్యానికి సముచితస్థానమిచ్చిన సాహిత్యచరిత్ర గ్రంథం. ఆమె 'తెలుగు నవలాను శీలనం' నవలల విమర్శనా గ్రంథం రచించింది.

అత్యాధునిక కాలంలో 1990 దశకం నుంచి తెలంగాణ నుంచే ఎక్కువ సాహిత్యం వస్తున్నది. సాహిత్యం, కవిత్వం, పాట, దీర్ఘకవిత, కథ, నవలలు మొదలైన ప్రక్రియల్లోనే కాక 'విమర్శ' కూడా వ్యాసాలుగా, పుస్తకాలుగా చెప్పుకోదగినంతగానే వస్తున్నది. తమ సాహిత్యం, భాష, సంస్కృతులను గురించి చెప్పేటప్పుడు కోస్తాంధ్ర ప్రసక్తి అపరిహార్యం అయిపోతున్న బలహీనత నుంచి బయటపడ్తున్నారు. కొంతమంది 'విమర్శ' తక్కువగా వస్తున్నది అని పదేపదే అంటుంటారు. కాని వస్తున్న విమర్శను చదువరు. పట్టించుకోరు. తెలంగాణ నుంచి సాహిత్య విమర్శ వ్యాసాల రూపంగా సమీక్షల రూపంగా, గ్రంథాల రూపంగా విస్తారంగా వస్తున్నది.

1990వ దశకంలోని ఉత్తరార్థం నుంచి తెలంగాణలో తమ ఉనికిని దేవులాడుకుంటూ అస్తిత్వానికి సంబంధించిన సునిశితమైన, లోతైన విమర్శలు వస్తున్నాయి. తెలంగాణ భాష తెలంగాణ సాహిత్యం గురించి విమర్శ వ్యాసాలు, విమర్శ గ్రంథాలు ప్రచురింప బడుతున్నాయి. పరిశోధనలు జరుగుతున్నాయి. విమర్శలో తెలంగాణ వాళ్ళు ఏం వెనుకబడి లేరని చూపిస్తున్నారు. తెలంగాణ సాంస్కృతిక వేదిక నుంచి 2001లో 'తెలంగాణ తోవలు' అనే వ్యాస సంకలనం అచ్చయింది. తెలంగాణ సాహిత్య స్రష్టలకు తెలంగాణ ఉనికి అస్తిత్వం నిలుపుకోవటం తక్షణ కర్తవ్యం అని చాటారు. 2002లో 'తెలంగాణ కథ దేవులాట' అనే వ్యాస సంకలనం వచ్చింది. దీనిలో తెలంగాణ నుంచి 1990 దశకం నుంచి వివిధ వస్తు వైవిధ్యంతో జనజీవిత చిత్రణలతో విస్తృతమవుతున్న తెలంగాణ కథను గురించి విమర్శ వ్యాసాలు సమీక్షలు వున్నాయి. గుడిపాటి తను వ్రాసిన విమర్శ వ్యాసాలు సమీక్షలను 'ఇతివృత్తం', 'కిటికి', 'ఫాయిదా' అని పుస్తకాలుగా వేశాడు. 'ఫాయిదా'లో తెలంగాణ కథల్లోని ఇతివృత్తం, భాషలను గురించి విశదంగా చర్చించాడు. 'ఎవరి అనుభవాల్ని వాళ్ళు రాయడం మంచిదన్న వాదం వచ్చి పదేళ్లు దాటింది.' అప్పట్నుంచి తెలంగాణ కథకులు తమ భాషలోనే రాస్తున్నారు. తమ సంస్కృతిని చిత్రిస్తున్నారు. ఈ స్పృహ 1995 తర్వాత బలంగా కన్పిస్తున్నది. అయితే భాషలో ఎన్నో ఎగుడు దిగుడులుంటున్నాయని కథల్లో 'తమదైన భాషలో రాయాలన్న అవగాహన ఇంకా పెరగాలి' అని అంటాడు గుడిపాటి.

గుడిపాటి తను రాసిన సమీక్షా వ్యాసాలను 'ఇతివృత్తం' పేరుతో ప్రచురించాడు. పుస్తక సమీక్షను మొక్కుబడిగా గుడిపాటి పరిచయం చేయడు. ఏదో అరపావు

పేజీలో సమీక్ష వ్రాయడు. అతని సమీక్షా వ్యాసాలు సుదీర్ఘంగా వుంటాయి. పుస్తకంలోని ఇతివృత్తానికున్న సామాజిక నేపథ్యాన్నంతా చర్చిస్తాడు. ప్రక్రియా రూపాన్ని విశ్లేషిస్తాడు. ఆయన సమీక్షా వ్యాసాలు అధ్యయనంతో కూడిన విమర్శ వ్యాసాలుగా వుంటాయి.

తెలంగాణ నుంచి విమర్శలు, సమీక్షలు రాస్తున్న వాళ్ళల్లో కె.శ్రీనివాస్, నందిని సిధారెడ్డి, కాసుల ప్రతాపరెడ్డి, శ్రీధర్ దేశ్‌పాండే, నాళేశ్వరం శంకరం, కాలువ మల్లయ్య, అఫ్సర్, ఖాజా, గుడిపాటి, ముదిగంటి సుజాతారెడ్డి, కె.పి.అశోక్ కుమార్, వెన్నవరం ఈదారెడ్డి, బన్న అయిలయ్య, యాదగిరి, తెలిదేవర, పెన్నా శివరామకృష్ణ, నాగేందర్, బాల శ్రీనివాసమూర్తి, లక్ష్మణ చక్రవర్తి, డా॥ త్రివేణి మొదలైన వాళ్ళున్నారు. తెలంగాణ సాహిత్యాన్ని కొత్త చూపుతో చూడాలని, శ్రీశ్రీ వంటి కవులు తెలంగాణ సందర్భానికి ఎట్లా సరిపోతారని, కన్యాశుల్కం శ్రామికుల జీవితం కాదని, ఆ నాటకాన్ని ఇప్పుడెట్లా చూడాలని? తెలంగాణ దృక్పథంతో దళితవాద దృష్టికోణంతో ప్రశ్నిస్తూ బి.ఎస్.రాములు సాహిత్య విమర్శ వ్యాసాలు వ్రాసాడు. ఆ వ్యాసాలను 'సాహిత్య చరిత్రను కొత్త చూపుతో తిరగరాయాలి' అనే పుస్తకంగా అచ్చు వేసాడు. బాల శ్రీనివాసమూర్తి తెలంగాణ పోరాట వీరుల ఆత్మకథలను అధ్యయనం చేసి విమర్శ వ్యాసాలు వ్రాసాడు. లక్ష్మణ చక్రవర్తి విమర్శలు, విమర్శకులను అధ్యయనం చేసే కొత్త రంగాన్ని విమర్శలో ఎన్నుకున్నాడు.

కాసుల ప్రతాపరెడ్డి 'కొలువు', 'భౌగోళిక సందర్భం' అనే సాహిత్య విమర్శ వ్యాసాలను ప్రచురించాడు. ఇవాళ తెలంగాణ సాహిత్య కారులు ఆత్మపరిశీలనలో పడ్డారు అని 'వాళ్లూ–మనమూ' వ్యాసాన్ని ప్రారంభించాడు. ఇప్పుడు చేయాల్సింది ప్రశ్నించటం కాదు, నిందారోపణలు చేయటం కాదు – ఆచరణ! అని కాసుల ప్రతాపరెడ్డి గుర్తించాడు. దాంతో నూతన తెలంగాణ సాహిత్య విమర్శకు తోవ పడిందని చెప్పాలి. తెలంగాణ చారిత్రక సామాజిక నేపథ్యంతో అక్కడి సాహిత్య సృష్టిని విశ్లేషించాలంటాడు కాసుల. ఆ చూపుతోనే కోస్తాంధ్రలోని తెలంగాణలోని స్త్రీవాదం, దళితవాదం, ముస్లింవాదం సాహిత్యంలో అంతర్లీనంగా భేదాలు వ్యక్తమవుతున్నాయని 'వాళ్ళూ–మనమూ' అనే వ్యాసంలో తరచి చూసాడు. 'భౌగోళిక సందర్భం' వ్యాసాలు ఈ నేపథ్యంలోని భిన్నత్వాన్ని బట్టబయలు చేస్తున్నాయి. అస్తిత్వ వేదన ప్రధానంగా తెలంగాణ ముస్లిం రచయితల్లోనే ఎందుకు వ్యక్తమవుతున్నదో

పరిశీలించాల్సిన విషయం అంటాడు ప్రతాపరెడ్డి. తెలంగాణ అస్తిత్వవాదం కవుల కవితల్లోని భాషలో పదాలు భావ వ్యక్తీకరణలను చాలా లోతుగా 'తెలంగాణ కవిత్వ భాష–ఆధునికత' అనే వ్యాసంలో కాసుల పరిశీలించాడు. గుడిపాటిలో చారిత్రక దృష్టి కనబడితే కాసుల ప్రతాపరెడ్డిలో 'లోనారసి' చూసి మథించే తత్త్వం, అంటే అంతరంగ విమర్శ ఎక్కువగా కన్పిస్తున్నది. అస్తిత్వ వాద విమర్శ చారిత్రక పద్ధతిలోనే కాక గతితార్కిక చారిత్రక భౌతికవాద దృక్పథంతో సామాజిక అస్తిత్వంతో సాహిత్యాన్ని పరిశీలించాలనే సూత్రాలకు అధీనంగా సాగుతున్నది.

సంగిశెట్టి శ్రీనివాస్ 1956కి పూర్వం తెలంగాణ నుంచి వచ్చిన కథల పేర్లను 'దస్త్రమ్'లో కూర్చాడు. 'షబ్నవీసు'లో తెలంగాణ పత్రికలను గూర్చిన సమాచారం ఇచ్చాడు. సుంకిరెడ్డి నారాయణరెడ్డి తెలంగాణ చరిత్ర, సాహిత్య పరిశోధనా విమర్శ వ్యాసాలు వ్రాసాడు. మానేరు రచయితల సంఘం వారు మరుగునపడ్డ కథలను వెతికి గూడూరు సీతారాం, జి.రాములు కథలను ప్రచురించారు. జి.సురమౌళి కథలను ప్రచురించినారు. అవన్నీ తెలంగాణ నేల మట్టివాసనల మధుర పరిమళాలను గుబాళించే కథలు. తెలంగాణ తొలితరం కథా రచయితల్లో ఒకడైన గూడూరి సీతారాం సాహితీజీవిత స్వర్ణోత్సవాల సంచిక 'కానుగచెట్టు' ప్రచురించి తొలి తెలంగాణ కథకుని సాహిత్య యోగదానానికి నివాళులు పట్టటం ఇదే తొలి ప్రయత్నం! ఇటువంటి సాహిత్య కృషి పరిశోధనలు జరగడం ఆరంభమైంది. నలిమెల భాస్కర్ 'తెలంగాణ పదకోశం' పేరుతో తెలంగాణకే పరిమితమైన ప్రత్యేక పదాలను, పదబంధాలను కూర్చాడు. అంతర్జాతీయంగానే కాదు ప్రాంతీయంగాను సాంస్కృతిక దాడికి గురవుతున్న వైనం నుంచి తెలంగాణ బయటపడాలనే ప్రయత్నం జరుగుతున్నది. దానిలో భాగంగానే తమదైన భాషను ప్రయోగించటంలో ఈ పదకోశం ఉపకరిస్తుంది. వేముల పెరుమాళ్ళు 'తెలంగాణ జాతీయాలు'లో తెలంగాణకు ప్రత్యేకమైన జాతీయాలను కూర్చాడు. అట్లా భాషకు సంబంధించిన కృషి సాగుతున్నది.

'ముద్దెర' పుస్తకంలో తెలంగాణ అస్తిత్వ వాదాన్ని పరిశీలించే సాహిత్య విమర్శ వ్యాసాలు వున్నాయి. తెలంగాణ సాహిత్య విమర్శలో ఓ మైలురాయి 'ముద్దెర' సాహిత్య విమర్శ వ్యాసాల సంపుటం.

తెలంగాణ తెలుగు సాహిత్యంలో

# జానపదుల సాహిత్యం

**శి**ష్ట కవులు పద్యకావ్యాలను రచిస్తే జానపద కవులు తమ చుట్టూ జరిగిన కథలను, వీరుల వృత్తాంతాలను గేయ కావ్యాలుగా రచించి సంచారం చేస్తూ పాడుతూ మౌఖిక రూపంలో ప్రచారం చేసారు. ఈ గేయ కావ్యాల పాటల కర్తలెవరో చెప్పలేము. మళ్ళా మళ్ళా పాడినప్పుడల్లా కొత్త విషయాలు, కొత్త వృత్తాంతాలు చేర్చబడుతూ పోయాయి. మహాభారతం అంతేకద. మౌఖికంగా కథను చెప్పే మహర్షులు శ్రోతల సందేహాలను తీర్చటానికి ఎన్నో కథలు, గాథలు చేర్చుతూ పోయారు. జానపద కవులు తెలంగాణలో వీరులైన నల్లసోమనాద్రి, సర్వాయి పాపన్న, బల్మూరి కొండయ, సదాశివరెడ్డి, రాజా రామేశ్వరరావు, రాణీ శంకరమ్మ, మియాసావు, అంకమరాజు, రేణికుంట రామిరెడ్డి, కుర్రారం రాంరెడ్డిల వీర గాథలను, వృత్తాంతాలను జీవిత చరిత్రలను గేయకావ్యాలుగా కట్టి పాడారు. ఇవేగాక సంప్రదాయంగా జానపదులు పాడే బాలనాగమ్మ కథ, ధర్మాంగద కథ, పౌరాణికమైన రేణుకాదేవి కథ, ప్రమీలార్జునీయం, అల్లిరాణీ వంటివి ఎన్నో జానపదుల పాటలు వ్యాప్తిలో వున్నాయి. ఒగ్గు కథలు, పటాల కథలు, చిందు బాగోతాలు, యక్షగానాలు, తోలు బొమ్మలాటలు, జానపద కళా ప్రదర్శన రూపాలు జానపదుల్లో వ్యాప్తిలో వున్నాయి. నవరసాలు ఒలికించే ఈ కథలన్నీ జానపదులు చెప్పేయి. జానపదుల నలరించేయి.

తెలంగాణలో మౌఖికంగా కీర్తన సాహిత్యం కూడా చాలా వ్యాప్తిలో వుంది. కీర్తన కవిత్రయం మన్నెంకొండ హనుమద్దాసు, రాకమచర్ల వెంకటదాసు, వేపూరి హనుమద్దాసులు ఎన్నో కీర్తనలు రచించారు. గవండ్ల రాజలింగకవి, సుంకరనేని

తెలంగాణ వైభవోన్నతిపై ప్రత్యేక గ్రంథ ప్రచురణను పరిషత్తు చేపట్టింది. ఈ పరంపరలో ప్రస్తుత గ్రంథం ప్రముఖ రచయిత్రి డా॥ ముదిగంటి సుజాతారెడ్డి రచించిన "తెలంగాణ తెలుగు సాహిత్య చరిత్ర". డా. సుజాతారెడ్డి ఈ గ్రంథాన్ని పరిశోధనాత్మకంగా శాస్త్రీయ దృక్పథంతో ప్రామాణిక రచనగా తీర్చిదిద్దినారు. యుగ విభజన ఆధారంగా ఈ గ్రంథానికి ఆమె సమగ్రతను సంతరింపజేసినారు. వేములవాడ చాళుక్యుల యుగం నుండి ఈనాటి వరకు తెలంగాణలో తెలుగు సాహిత్యాన్ని సుసంపన్నం చేసిన సాహితీవేత్తల రచనాగరిమ దీనిలో ప్రతిభాన్వితంగా చిత్రించినారు. ఈ గ్రంథం తెలంగాణ సాహితీ వైలక్షణ్యానికి మణిదర్పణంగా భాసిస్తున్నది. గ్రంథ రచయిత్రి డా॥ సుజాతారెడ్డికి నా హార్దికాభినందనలు.

- డా. సి.నారాయణరె